అపరాధ పరిశోధన అనుబంధం—157

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## కాల యముడు

రచన: సుంకరి రాంప్రసాద్

## రెండు చట్టాలు!!

రచన: వసుంధర

## అష్టావధానం

రచన: కె. బి. యస్. కుమార్

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —157
జనవరి, 1987
వెల: రు. 7-00
ఏడాది చందా: 84 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ పీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీటు, మద్రాసు-1

# కాల యముడు

సుంకరి రాంప్రసాద్

గోధూళి వేళ.

యాక్ పశువుల (జడల బర్రెలు) గిట్టలనుండి లేస్తున్న ఎర్రని ధూళితో కప్పివేయబడ్డ పచ్చని దేవదారు వృక్షాలు.... హోలీలో బుక్కారంగును పులుముకున్న పడుచుల్లా వున్నాయి.

సాయంత్రపు నీరెండలో జడల బర్రెల దేహాలమీది మెత్తని సిల్కు జుత్తు నిగనిగా మెరుస్తోంది.

అల మందలను అదలిస్తూ, కొందరు గిరిజన యువకులు ఆ మందల వెనుక నెమ్మదిగా నడుస్తున్నారు.

దూరంగా యెవరో వాసెకోల వాయిస్తున్న ధ్వని. ఆ పిల్లనగ్రోవి పల్లవికి తాళం వేస్తున్నట్లుగా పశువుల మెడలలోని చిరుగంటలు గణగణమంటున్నాయి. కాని, ఆ యువకులలో మాత్రం ఉత్సాహం మచ్చుకైనా కనిపించటంలేదు.

అది తవాంగ్ జిల్లాలోని సుమదోరోంగ్ లోయ

ప్రాంతం. అరుణాచల్ ప్రదేశ్ రాష్ట్రంలో ఇండో-చైనా సరిహద్దులోని జిల్లా తవాంగ్.

ఇన్నాళ్ళూ యెంతో ప్రశాంతంగా, నాగరిక ప్రపంచానికి దూరంగా, ప్రకృతి మాత ఒడిలో పసి పాపల్లా బ్రతుకుతున్నారు అక్కడి గిరిజనులు.

కాని, కొన్ని రోజుల క్రితం ఆ లోయలోనికి కొందరు విచిత్ర వ్యక్తులు రావటంతో ఆ గిరిజనుల బ్రతుకులు దుర్భరమయ్యాయి.

పొట్టిగా, ఎర్రగా, చప్పిడి ముక్కులతోనున్న ఆ నాగరిక వాసులు అమాయకులైన ఆ గిరిజనులపై అజమాయిషీ చెలాయించడం ప్రారంభించారు..

ఆ లోయలో వారు గుడారాలు వేసుకున్నారు.

“ఆ భూమి తమదనీ, ఆ ప్రదేశంలో పశువులను మేపుతున్నందుకు ఆ గిరిజనులు పన్నులు చెల్లించాలని” ఆజ్ఞను జారీ చేసాడు ఆ విచిత్ర వ్యక్తుల నాయకుడు.

నేలా, నింగీ, గాలీ, నీరూ అందరి సొత్తని నమ్మే అమాయక జీవులు వారు. కొన్ని వందల, వేల సంవత్సరాలుగా హాయిగా, స్వేచ్ఛగా బ్రతుకుతున్న వన్యజీవులు వారు.

‘తాము పుట్టిన భూమిలో. తాము పెరిగిన అడవిలో తమ పశువులను మేపుకోవడానికి, ఎవరో ముక్కూ, మొహమూ తెలియని ఈ పరాయి మనుషుల ఆంక్షలు యేమిటో’ అర్థం కాలేదు వారికి.

పన్నులు కట్టడానికి నిరాకరించారు వారు. నాగరిక వాసులు వారిపై దాడి చేశారు. గిరిజనులు ఎదిరించారు.

పోరు ప్రారంభమయింది.

ఈటెలూ, బరిసెలూ, విల్లంబులూ ధరించిన ఆ గిరి

జనులు ఆ నాగరికుల మర తుపాకులముందు నిలువలేక పోయారు వారు లొంగిపోక తప్పింది కాదు.

అలా ఆ పట్నాలను కట్టడంతో ప్రారంభమయింది వారి బానిస బ్రతుకు.

ఆ గిరిజనులను కొట్టి, హింసించీ, బలవంతంగా పని చేయించేవారు ఆ నాగరికులు.

అడవిలో కొంతమేర చెట్లూ చేమా కొట్టివేయబడి విశాలమైన మైదానంలా చేయబడింది.

ఒకరోజు ఆకాశంలోనుండి చక్కర్లు కొట్టుకుంటూ వచ్చి ఆ మైదానంలోనికి దిగిందొక పెద్ద మర పక్షి. దాని వంక, అందులోనుండి దిగుతున్న మనుషుల వంక ఆశ్చర్యంగా చూశారు వారు.

అది హెలీకాప్టర్ అని. దానిమీద మనుషులు గాలిలో ప్రయాణం చేస్తారనీ తెలియదు వారికి.

వారి ఉద్దేశంలో ఆకాశంలోనుండి దిగినవారు దేవతలయినా అయి వుండాలి, లేదా మాంత్రికులయినా అయి వుండాలి.

దేవతలయితే మనుషులను రక్షిస్తారు గాని, యిలా మనుషుల ప్రాణాలు తీయరు గాబట్టి వారు మాంత్రికులనే నమ్మకం వారిలో గట్టిగా యేర్పడిపోయింది.

ఆటవికులు ముఖ్యంగా నమ్మేదీ. భయపడేదీ మంత్రాలకూ, తంత్రాలకే! ఆ మరపక్షిని చూసిన క్షణంనుండీ ఆ నాగరికులంటే వారికి మరింత భయం ఏర్పడింది.

ఆ రోజు రాత్రి హెలీకాప్టర్ లోనుండి దిగిన ఆఫీసర్ గౌరవార్థం విందు యేర్పాటు చేయబడింది.

గుడారాల ముందు కాంప్ ఫైర్ను వెలిగించారు. నెగడు చుట్టూ కాంప్ ఛైర్లు వేయబడ్డాయి.

దోరగా వేయించిన లేడి మాంసం పింగాణీ ప్లేట్లలో వడ్డించబడింది. వేరు రుబియ్యం. అన్నం, పాముల పులుసూ, మసాలలో తాళించబడ్డ రెక్కల పురుగులూ - అంతా లొట్టలువేసుకొని తింటున్నారు. ఓ ప్రక్క రమ్ సీసాలు ఖాళీ అవుతున్నాయి.

సన్నగా కురుస్తున్న మంచులో. గొంతులో దిగిన రమ్ గుండెలను వేడెక్కించింది. నరాలను పురెక్కించింది.

"మదిర, మాంసం అయాయి. యిక మగువ?" అన్నాడు 'మ' కారాలమీద మమకారం వున్న ఆ ఆఫీసరు.

వెంటనే కొందరు తుపాకులు తీసుకొని గూడెంకు బయలుదేరారు. ముగ్గురు గిరిజన యువతులను బలవంతంగా యెత్తుకవచ్చారు.

ఒక యువతి అదమరచి భర్త గుండెలపై తలవాల్చి నిద్రిస్తూంది. ఆకలని నిద్రలేచిన బాబుకు పాలిస్తూంది ఒక యువతి. తల్లి ప్రక్కలో కమ్మని కలలు కంటూ నిద్రపోతూంది ఒక కన్నెపిల్ల.

తమ కళ్ళముందే తమ జాతి స్త్రీలను రాక్షసంగా యెత్తుకపోతుంటే నిస్సహాయంగా కన్నీరు కారుస్తూ నిలుచుండిపోయారు ఆ గూడెం మనుష్యులు.

మాంత్రికులను ఎదిరిస్తే ఆ గూడెంనే భస్మీపటలం చేస్తారన్న భయం వారిని నిర్వీర్యులను చేసింది.

వివస్త్రలు చేయబడ్డ ఆ యువతులు కాంప్ ఫైర్ వెలుగులో తమ నగ్నత్వాన్ని దాచుకోలేక, కామపిశాచాల్లా తమను ఆక్రమించుకోబోతూన్న వారిని అడ్డుకోలేక నిస్సహాయంగా రోదించసాగారు.

ప్రాణం కన్నా మానం మిన్న అని భావించే ఆ పల్లె

పడతులు, చీకటి తెరలు తొలగకముందే సుమద్రోగోంగ్ లోయలోకి దూకి ఆత్మహత్య చేసుకున్నారు.

అంత అమానుషంగా ఆ గిరిజనుల మాన, ప్రాణాలను దోచుకుంటున్న నాగరికులు.... ఎవరో కాదు.

చైనా దేశపు సైనికులు!

## 2

న్యూ ఢిల్లీ ....

సౌత్ ఎవెన్యూలోని సి.బి.ఐ. ఆఫీసులో రివాల్వింగ్ ఛెయిర్ లో కూర్చుని వున్నాడు సి బి.ఐ చీఫ్ కరుణాకర్. అతడి చేతిలోని పైపు పొగలు క్రక్కుతూంది.

అతడి ఎదురుగా సి.బి.ఐ. ఆఫీసర్ రాంకుమార్ కూర్చుని వున్నాడు. వారిద్దరి మధ్యనున్న టేబిల్ మీద ఒక గ్రీన్ కలర్ ఫైలు తెరిచి వుంది. మరో ప్రక్క ఇండియన్ మ్యాప్ పరిచి వుంది.

ఆ ఫైలు వంకా, తమ బాస్ వంకా ఉత్సుకతతో చూస్తున్నాడు రాంకుమార్.

ఆరోవిల్లిలోని రాక్స్ రాకెట్ ను ఛేదించి, ఆ ముఠాను ప్రభుత్వానికి అప్పగించేశాక, పదిహేను రోజులు సెలవు తీసుకొని ఊటీకి బయలుదేరాడు అతడు.

హాయిగా ఊటీలో విశ్రాంతి తీసుకుంటున్న అతడికి వెంటనే ఢిల్లీ వచ్చి ఆఫీసుకు రిపోర్టు చేయమని మెసేజ్ వచ్చింది. వెంటనే ఢిల్లీ బయలుదేరి వచ్చేసాడతడు.

'అంత అర్జంటుగా తనను యెందుకు పిలిపించి వుంటారా' అని ఆలోచిస్తున్నాడతడు.

ఒక్కసారి చిన్నగా దగ్గాడు కరుణాకర్. అది తన ఎటెన్షన్ కోసమేనని రాంకుమార్ కు తెలుసు.

'చెప్పండి' అన్నట్లు బాస్ వంక చూసాడతడు.

కరుణాకర్ చెప్పడం ప్రారంభించాడు:

"రాజకుమార్ !

ఈ మధ్య నీవు పేపర్లలో చదివే వుంటావు. అరుణాచల ప్రదేశ్ లోని సుమ్‌దోరోంగ్ లోయ ప్రాంతంలోనికి చైనా సైనికులు చొచ్చుకొని వచ్చారు.

అక్కడ ఒక హెలీపాడ్ కూడా నిర్మించినట్లు విశ్వసనీయంగా తెలుస్తూంది. ఈ విషయం అప్పుడే పార్లమెంట్ లో చర్చకు కూడా వచ్చింది.

ఆ ప్రాంతం అరుణాచల్ ప్రదేశ్ లోని తవాంగ్ జిల్లాలోనిది. భారత చైనాల యొక్క ఈశాన్య సరిహద్దు ప్రాంతం అది.

అడపా, దడపా చైనా సైనికులు మన సరిహద్దులను అతిక్రమించి లోనికి రావటం, మన సరిహద్దు దళాలు కాల్పులు జరపటం జరుగుతూనే వున్నాయి.

కాని ఈసారి మన భూభాగంలో ఒక హెలీపాడ్ కూడా నిర్మించబడిందంటే అది చాలా ఆందోళనాకరమైన సమస్య. చైనా సైనికులు ఆ పల్లె ప్రజల దగ్గర పన్నులు కూడా వసూలు చేస్తున్నారట.

అంటే....ఆ ప్రాంతం తమదేనని చైనా ప్రపంచానికి నమ్మించడానికి ప్రయత్నిస్తూందన్న మాట.

హిందూ, చీనీ భాయీ, భాయి అంటూనే వెన్నుపోటు పొడిచే నయవంచకులు వారు.

1962 లో కారాకోరం వరకూ సుమారు పదివేల చదరపు మైళ్ళ భూభాగాన్ని ఆక్రమించుకున్నారు. అదేమని అడిగితే కయ్యానికి కాలుదువ్వారు. యుద్ధానికి సిద్ధమయ్యారు.

కాని ఈ రోజు మనం వారికి భయపడనవసరం లేదు.

వారికి ఒక్క సెంటు భూమికూడా ధారాదత్తం చేసే హీనస్థితిలో లేదు మన దేశం!"

"ఇంకేం సర్! వెంటనే మన సైన్యాలను పంపి అక్కడనుండి వారిని తరిమికొడితే సరి!" ఉత్సాహంగా అన్నాడు రాంకుమార్.

అతడి వంక గుర్రుగా చూశాడు కరుణాకర్. ఆమాత్రం ఆలోచన మాకు లేదంటావా అన్న భావం వుంది ఆ చూపులో.

"మామూలు పరిస్థితులలో అయితే మనం అలాగే చేసి వుండేవారం రాంకుమార్!

బట్, దిసీజ్ ఎ క్రిటికల్ పొజిషన్.

సీ దిస్ మ్యాప్!" అంటూ టేబిల్ మీది మ్యాప్‌ను రాంకుమార్ వైపు త్రోశాడు.

రాంకుమార్ ఆ మ్యాపును తీసుకొని పరీక్షగా చూశాడు. అందులో భారత సరిహద్దు రేఖలు ఎర్రని గీతలతో గుర్తింపబడి వున్నాయి. ఆ రేఖలను చూస్తున్న అతడి కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

ఆ మ్యాప్‌లో....

అరుణాచల్ ప్రదేశ్‌లోని కొంత భాగం చైనా భూభాగంగా గుర్తింపబడి వుంది. చైనా సైనికులు దురాక్రమణ చేసి హెలీపాడ్ నిర్మించిన తవాంగ్ జిల్లా కూడా చైనా భూభాగంగానే ఆ మ్యాప్‌లో ముద్రించ బడింది.

"అది ఎవరో అనామకులు ముద్రించిన మ్యాప్ కాదు రాంకుమార్!

మన మిత్రదేశమైన సోవియట్ రష్యా చేత ముద్రించ బడ్డ మ్యాప్ అది. ప్రతి మూడేళ్ళకు ఒకసారి రివైజ్డ్

వరల్డు మ్యాప్‌ను పబ్లిష్ చేస్తుంది యునైటెడ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్.

అయితే ఈ మ్యాప్ ముద్రణ అధికారుల అజాగ్రత్త వలన జరిగిందా? లేక యితరత్రా యేమైనా రాజకీయ కారణాలున్నాయా అన్నది ముమ్ముందు తేలాల్సిన విషయం.

కాని యిప్పుడు....మనం తవాంగ్ జిల్లాలోని చైనీయుల స్థావరం మీదకు సైనిక దాడి జరిపితే, చైనా కూడా యుద్ధానికి సిద్ధపడుతుంది యుద్ధం మన లక్ష్యం కాదు.

రష్యా ప్రభుత్వం ముద్రించిన ఆ మ్యాప్ ఆధారంగా ఐక్యరాజ్యసమితిలో మన దేశంమీద ఫిర్యాదు చేస్తుంది చైనా.

ఆ భూభాగం తమదనీ, తాము అక్కడి ప్రజలనుండి పన్నులను కూడా వసూలు చేస్తున్నామనీ, ఆ ప్రదేశంలో ఒక హెలీపాడ్‌ను కూడా తాము నిర్మించామనీ, సాక్ష్యాధారాలతో తమ వాదనను నిరూపించడానికి ప్రయత్నిస్తుంది.

ఒకప్రక్క శాంతి ప్రవచనాలను వల్లిస్తూ, భారతదేశమే అన్యాయంగా తమ భూభాగంపై దురాక్రమణ సల్పుతుందని మనపై అభాండం వేయడానికి ప్రయత్నిస్తుంది.

యుద్ధం ఫలితం ఎలా వున్నా, నిజానిజాలు ఏమైనా ప్రపంచ దేశాలకు చైనీయులు నిర్మించుకున్న హెలీపాడ్ మన భూభాగంలో వారి సైనిక స్థావరాలు సాక్ష్యాలుగా కన్పిస్తాయి. మన పరిస్థితి ఇరకాటంలో పడుతుంది.

మన సైనికులు రంగంలోనికి దిగితే, ఆ విషయం వెంటనే చైనా సైనికులు పసిగడతారు.

అందుకే. మూడో కంటికి తెలియకుండా ఆ సైనిక స్థావరాన్ని, హెలీపాడ్ తో సహా సర్వనాశనం చేయాలి చాలా రహస్యంగా.

ప్రభుత్వం మన సి.బి.ఐ.కు ఈ పనిని అప్పగించింది. నేను నీకు అప్పగిస్తున్నాను.

రాంకుమార్!

ఏం చేస్తావో, ఎలా చేస్తావో నీ యిష్టం. ఐ వాంట్ దట్ హెలీపాడ్ స్మాష్డ్ అవుట్."

అంతటితో తన పని అయిపోయిందన్నట్లు రిలాక్సింగ్ గా వెనక్కి వ్రాలాడు కరుణాకర్. కుర్చీలోనుండి లేచి నిలబడ్డాడు రాంకుమార్.

"వస్తాను సర్. ఐ విల్ డూ ద బెస్టు."

రాంకుమార్ ముఖంలో పట్టుదల, కర్తవ్యదీక్ష కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నాయి.

కోటు జేబులోనుండి ఒక బ్రౌన్ కవర్ ను తీసి రాంకుమార్ కు అందించాడు కరుణాకర్.

రాంకుమార్ ఆత్రంగా ఆ కవర్ను తెరిచాడు. గులాబిరంగు కాగితంపై టైప్ చేయబడ్డ అని అక్షరాలు.

'రాంకుమార్ కు ఆర్మీ కమాండర్ హోదాను కల్పిస్తూ ఆ క్షణంనుండీ అతడి ఆజ్ఞలను తూ.చ. తప్పకుండా పాటించమని, బోర్డర్ సెక్యూరిటీ దళాలకూ, అరుణాచల్ స్టేట్ పోలీసు విభాగానికి భారత రాష్ట్రపతి పేర జారీ చేయబడ్డ ఆజ్ఞా పత్రం' అది.

"ఐ థింక్ ఇట్ విల్ డూ ఫర్ యూ!" నవ్వుతూ అన్నాడు కరుణాకర్. చిరునవ్వు నవ్వాడు రాంకుమార్.

తన బాస్ కు సెల్యూట్ చేసి, చకచకా నడుచుకుంటూ ఆ గదిలోనుండి వెళ్ళిపోయాడు అతడు.

# 3

మసక చీకట్లు ముసుగుకుంటున్న వేళ.

సుమదోరోంగ్ లోయలోనికి ప్రవేశించాడు ఒక యువకుడు.

మొలకు చుట్టుకున్న మోకాళ్ళు దిగని ముతక నేత గుడ్డా, మెడలో పూసల పేర్లూ, చెవులకు రాగిపోగులూ, తైల సంస్కారం ఎరుగని వత్తయిన జుట్టూ.... అచ్చం అస్సామీ గిరిజన యువకునిలా వున్నాడతడు.

సుమదోరోంగ్ గూడెం పొలిమేరల్లో అతడిని అటకాయించారు చైనా సైనికులు. అతడిని నఖశిఖపర్యంతం సోదా చేశారు.

అతని భుజానవున్న కావడిలో అరమగ్గిన రేగుపళ్లూ. ఒక సొరకాయబుర్రలో పట్టిన పుట్టతేనె. పులియబెట్టిన యాక్ పశువుల పాలూ తప్ప, అనుమానింపదగ్గవేమీ కనిపించలేదు వారికి.

గూడెం నాయకుడు గోమా గోకు మారపు బంధువుననీ, తన పేరు బిగూ అని చెప్పాడతడు.

కాసిన్ని రేగుపళ్ళనూ, ఇంత పుట్టతేనెనూ తీసుకొని విడిచిపెట్టారు ఆ సైనికులు.

కావడి మోసుకుంటూ వస్తున్న ఆ నూతన యువకుని వంక ఆశ్చర్యంగా చూశారు ఆ గూడెం మనుషులు. అతడు తిన్నగా నాయకుని గుడిసె ముందుకుపోయి ఆగాడు.

నాయకుని గుడిసె మిగిలినవారి గుడిసెలకన్నా విశాలంగా, ఎత్తుగా వుంది. గుడిసెముందు ఎత్తయిన అరుగు వేదికలా వుంది. చుట్టూ నాలుగడుగుల ఎత్తున వెదురుబొంగులు కంచెలా పాతబడ్డాయి.

ఆ గుడిసెలోని విలక్షణత్వాన్ని చూసే, అది ఆ గూడెం నాయకుని నివాసమని సులువుగా పోల్చుకున్నాడు ఆ యువకుడు.

గూడెం వాసులంతా ఆ యువకుని వెనకనే వచ్చి నాయకుని గుడిసెముందు గుమిగూడారు.

నాయకుడు గోమాంగో గుడిసెనుండి బయటకు వచ్చాడు. ఆ యువకుని వంక ఆశ్చర్యంగా చూశాడు.

నాయకుని చూసి. మోకాళ్ళపై వంగి, తలను వంచి ఒక విచిత్రమైన అభివాదం చేశాడు ఆ యువకుడు.

ఈశాన్య భారతంలోని ఆదివాస తెగలలో అతి ప్రాచీనమైనదిగా చెప్పబడే సంతాల్ జాతివారు చేసే అభివాదం అది.

ఆ యువకుని వంక సాదరంగా చూశాడు నాయకుడు. గూడెం వాసులు కూడా ఆ యువకుని వంక గౌరవ భావంతో చూశారు.

ప్రాచీనమైన సంతాల్ జాతివారంటే ఆ గిరిజనులకు విపరీతమైన గౌరవం.

బిగూను కూడా సంతాల్ జాతి యువకునిగా భావించి అతడిపట్ల ఆదరణ చూపారు ఆ గూడెం వాసులు. నాయకుడు బిగూను తన గుడిసెలోనికి ఆహ్వానించాడు.

చమరీ మృగపు చర్మాలపైన కూర్చున్నారు వారు యిద్దరూ. వారితో పాటుగా గూడెం పెద్దలనిపించుకున్న అయిదారుగురు గిరిజన వృద్ధులు కూడా ఆ గుడిసెలోనికి వచ్చి కూర్చున్నారు.

ఇక విషయం చెప్పమన్నట్లుగా ఆ యువకుని వంక సాలోచనగా చూశాడు నాయకుడు.

“నా పేరు బిగూ.

డోంగ్రీ బాబా అడవులనుండి వస్తున్నాను. సంతాల్ దేవత టాండ్ బాబా దీవెనలను మీకు తెచ్చాను."

ఆ యువకుని అరచేతులను భక్తితో కళ్ళకు అద్దుకున్నాడు నాయకుడు గోమాంగో. మిగిలిన వృద్ధులు కూడా అతడి అరచేతులను కళ్ళకు అద్దుకున్నారు.

ఒక్కసారి వారి వంక క్రీగంట చూశాడు ఆ యువకుడు.

"మీ కష్టాలు తీరాలంటే, మీ బాధలు పోవాలంటే సంతాల్ దేవత టాండ్ బాబాకు జాతర చేయండి.

ఆ అడవి దున్నల రేడు మీకు మేలు చేస్తాడు. ఈనాటికి సరిగ్గా ఆరవరోజున అమావాస్య వస్తోంది. ఆ రోజే మన జాతర జరగాలి.

కారు చీకటిలో, కారు ఎనుమును ఎక్కి, కాలయముడిలా వస్తాడు టాండ్ బాబా. శత్రువులను శిక్షించి, ఆశ్రితులను రక్షిస్తాడు"

అతడి మాటలను వింటుంటే వారి ముఖాలు ఆనందంతో విప్పారసాగాయి.

తమను ఉద్ధరించడానికి ఆ టాండ్ బాబా స్వయంగా పంపిన దేవదూతలా కనిపించాడు ఆ యువకుడు.

అతడు సాలోచనగా వారి వంక చూశాడు.

"అయితే ఈ జాతర యెందుకు చేస్తున్నామనేది పైకి పొక్కకూడదు. అది రహస్యంగా వుంచాలి చివరకు మన గూడెం వాసులకు కూడా తెలియకూడదు.

మామూలుగా జాతరను చాటించండి. చుట్టాలనూ, పక్కాలను పిలుచుకోండి.

టాండ్ బాబాను సేవించుకోవడానికి ఎన్నో జాతుల వారు, ఎందరో క్రొత్త ప్రాంతాలవారు వస్తారు. వారిని

అడ్డు పెట్టకండి. వారికి ఆశ్రయం యివ్వండి. అప్పుల్లా ఆదరించండి.

టాండ్ బారో మేలు చేస్తాడు."

అతడి మాటలకు అంతా అంగీకారంగా తలలు ఆడించారు.

"మరొక్క మాట!

"ఎవరు అడిగినా నేను నాయకుడు గోమాంగోకు దూరపు బంధువునని చెప్పండి.

ఈ జాతర చేయమని నేను చెప్పినట్లు యెవరిదగ్గరా నోరు జారకండి" అంటూ, చివరిసారిగా వారిని హెచ్చరించాడు ఆ యువకుడు.

మరునాడు ఉదయమే....టాండ్ బారో దేవత జాతర అమావాశ్య నాడు జరుగుతుందని గూడెంలో చాటింపు వేయబడింది.

## 4

అడవిలో ఒంటరిగా నడుచుకుంటూ పోతున్నాడు సంతాల్ యువకుడు బిగూ.

అతడి భుజానికి సారకాయబుర్ర వ్రేలాడుతూంది. వీపుకు కట్టివున్న వెదురు బుట్టలో యేవో అరముగ్గిన ఫలాలు వున్నాయి.

అడవిలో పళ్ళు ఏరుకోవటానికో, తేనెను పట్టటానికో వెళ్తున్నాడనుకుంటారు అతడిని చూసినవారు.

చాలా సేపటినుండి అలా నడుస్తున్నాడన్న దానికి గుర్తుగా అతడి శరీరం చమటలు పట్టివుంది.

అతడు ఒక ప్రదేశానికి వచ్చాక ఆగాడు. ఎత్తుగా వున్న ఒక చెట్టు పైకి ఎగబ్రాకాడు. గుబురుగా వున్న కొమ్మల మాటున దాక్కున్న అతడిని గుర్తించడం ఇప్పుడు

# 16

## ఎవరికైనా అసాధ్యమే!

తన భుజానికున్న సొరకాయ బుర్రను పైకితీశాడు. దాని అడుగు భాగాన్ని పట్టుకొని గట్టిగా త్రిప్పేసరికి అది స్ప్రింగులున్న కప్పులా పైకి ఊడివచ్చింది.

అది చూడటానికి సొరకాయ బుర్రలా కన్పిస్తున్నా అందులో రెండు అరలున్నాయి. పై అరలో తేనె వుంటుంది. దానిని చూసినవారెవరికైనా ఆ సొరకాయలో యింకొక అర వుందనే అనుమానం కూడా రాదు.

క్రింది అరలోని బైనాక్యులర్‌ను పైకి తీశాడతడు. అది అత్యంత శక్తివంతమైన మిలటరీ బైనాక్యులర్. కొన్ని మైళ్ళదూరంవరకూ వున్న భూభాగాన్ని చాలా స్పష్టంగా అందులోనుండి చూడవచ్చు.

అతడు బైనాక్యులర్‌తో ఒక ప్రదేశంవైపు తదేకంగా చూడసాగాడు.

అతడు చూస్తున్న ప్రదేశం .... చైనా సైనికుల స్థావరం!

బలమైన ఐరన్ ఫెన్సింగ్ మధ్య రంగు రంగుల కుడారాలు కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నాయి. అవి చైనా సోల్జర్స్ విశ్రాంతి తీసుకొనే బారెక్స్. వాటి చుట్టూ సాయుధులైన కొందరు సైనికులు పహరా తిరుగుతున్నారు.

ఆ స్థావరానికి కొన్ని గజాల దూరంలో మైదానంలా చదును చేయబడ్డ ప్రదేశం ఉంది. ఒక ప్రక్కగా ఎత్తయిన సిగ్నలింగ్ టవర్ ఉంది. అది ... హెలీపాడ్.

హెలీపాడ్ ప్రక్కనే ఒక వుడెన్ షెడ్ ఉంది. అందులోనుండి వస్తున్న శబ్దాన్నిబట్టి అది జనరేటర్ షెడ్ అని ఊహించాడు అతడు.

సైనిక స్థావరానికి, హెలిపాడ్‌కు కావాల్సిన విద్యుత్ సరఫరా ఆ జనరేటర్ నుండే వస్తుంది.

ఆ స్థావరం, హెలిపాడ్, చుట్టూ కాపలా వున్న సైనికుల పొజిషన్స్... అన్నీ ఒక చిత్రంలా అతడి మెదడులో ముద్ర పడిపోతున్నాయి.

స్థావరం వద్ద, హెలిపాడ్ వద్ద కాపలా కాస్తున్న సైనికులను లెక్కించాడు అతడు. మొత్తం అరవై మందికి పైనే వున్నారు.

ఆ అరవై మంది ఒక బ్యాచ్ అనుకుంటే, ఒక్కొక్క బ్యాచ్ ఎనిమిది గంటలు పెట్రోలింగ్ చేస్తుంది అనుకుంటే. మొత్తం మూడు బ్యాచ్‌లు కలిసి సుమారు రెండు వందలమంది సైనికులు వున్నారన్న మాట.

అతడు మనసులోనే లెక్కలు వేస్తున్నాడు.

ఆ రెండు వందలమంది సైనికులనూ ఎదుర్కోవడం పెద్ద సమస్య కాదు. కాని తమ మీద ఎటాక్ ప్రారంభమయిన మరుక్షణం చైనా సైనికులు ఆ విషయాన్ని ట్రాన్స్‌మీటర్స్ ద్వారా తమ హెడ్ క్వార్టర్స్‌కు తెలియజేస్తాయి.

ఇండో-చైనా బోర్డర్ ప్రాంతమైన ఆ సుమదో రోంగ్ లోయలోనికి చైనా సైనిక దళాలు చొచ్చుకు రావటానికి ఎంతో కాలం పట్టదు. అన్నిటినీ మించి వారు నిర్మించుకున్న హెలీపాడ్ ఉండనే ఉంది. హెలీకాప్టర్స్ ద్వారా అక్కడికి సైనికులు డంప్ చేయబడతారు.

సో... తమమీద ఎటాక్ ప్రారంభమయిందని వారు గ్రహించే లోగానే ఆ సైనికులను గట్టిగా అంతం చేయాలి.

తన అనుమానం నిజమయితే ఆ సిగ్నలింగ్ టవర్ లోనే ఆ సైనికులు వార్తలను పంపడానికి ఉపయోగించే ట్రాన్స్‌మిటర్ ఉండి తీరాలి.

ఇఫ్....సో...

ముందుగా నాశనం చేయాల్సింది....ఆ సిగ్నలింగ్ టవర్‌ను అనుకున్నాడతడు మనసులో.

అతడి మెదడులో యిప్పుడొక క్రొత్త వ్యూహం రూపు దిద్దుకుంటూంది.

'ఈ ఏటాక్ గూర్చి ఆ గిరిజనులకు ఏ మాత్రము కూడా తెలియకూడదనీ, నాగరికుల కొట్లాటలతో తమ భూమి అపవిత్రం కావడం ఆ గిరిజనులు సహించరనీ' అతడికి తెలుసు

అస్సాం పురాతత్వ శాఖాధికారి ప్రబోద్ కుమార్ మహంతో చెప్పిన మాటలు అతడి చెవులలో యింకా గింగురు మంటూన్నాయి.

నాలుగు రోజుల క్రితం....

అస్సాంలోని నవ్ గంగ్ పట్టణంలో....

పచ్చని లాన్‌లో వేయబడ్డ పేము కుర్చీలలో కూర్చుని కమ్మని అస్సామీ టీని త్రాగుతూ ప్రొఫెసర్ మహంతో ఇలా అన్నారు:

"ఈ గిరిజనులు ఒక విచిత్రమైన స్వభావం కలవారు. నాగరిక వాసుల ఛాయలు కూడా తమపై పడటం వీరు సహించలేరు.

నిరక్షరాస్యులైన వీరికి పరిస్థితిని విడమరచి చెప్పినా, అర్థం చేసుకొని మనకు సహకరిస్తారనే ఆశలేదు.

ఆ కన్య సీములో అత్యంత రహస్యంగా మన ప్రణాళిక పూర్తి కావాలంటే, మనకు ఆ గిరిజనుల ఆశ్రయం,

సహాకారం ఉండి తీరాలి.

కాని, వచ్చిన చిక్కేమిటంటే, వారు మన మాట వినరు. మనతో సహకరించరు."

"పోనీ, వారు ఎవరి మాటలను గౌరవిస్తారు ప్రొఫెసర్?" అన్నాడు ఆ యువకుడు.... పాట్ లోని టీని కప్పులోనికి వంచుకుంటూ.

ఒక్క క్షణం కన్నులను అరమోడ్చి ఆలోచించాడు మహంతో.

అవిభక్త అస్సాంలోని ప్రాచీన వన్యజాతులను గుర్తుకు తెచ్చుకుంటున్నాడు అతడు.

"గోండ్ .... మిజో .... నాగా .... స .... స ....

సంతాల్!"

అతడి పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

"ఆ సంతాల్ జాతి వారంటే వారికి విపరీతమైన గౌరవం. వారి మాటలను వేదవాక్కుల్లా వింటారు.

కాని.... ఆ సంతాల్ జాతివారు వీరికంటే మూర్ఖులు. నాగరికులంటేనే వారికి విపరీతమైన అసహ్యం."

త్రాగుతున్న టీకప్పును టీపాయ్ మీద ఉంచాడు ఆ యువకుడు.

"ఆ సంతాల్ జాతి గూర్చి కాస్త వివరంగా చెప్పండి ప్రొఫసర్" అన్నాడు.

సంతాల్ల గురించి తనకు తెలిసిన వివరాలన్నింటినీ విపులంగా చెప్పాడు మహంతో.

చివరగా యిలా అన్నాడు:

"మైడియర్ యంగ్ మాన్!

ఒక్క విషయం గుర్తుంచుకో.

ఈ గిరిజనులు దేనినైనా భరిస్తారు. ఎన్ని కష్టాలనైనా

సహిస్తారు. కాని తమ మతానికీ, నాగరికతకు ఎవరైనా, ఏదైనా ద్రోహం తలపెట్టారని తెలిస్తే మాత్రం వారు సహించరు.

మతం పేరుతో తమను మోసం చేసే వారిని సర్వనాశనం చేయనిదే వారు వదలిపెట్టరు.

బీ.... కేర్ ఫుల్!...."

సరిహద్దులలో నున్న ఆ గిరిజనుల మత విశ్వాసాలను గాయపరచడం ప్రభుత్వానికి కూడా యిష్టంలేదన్న విషయం అతడికి గుర్తుంది.

ప్రొఫెసర్ మహంతో వద్ద శలవు తీసుకొని అతడు వచ్చేశాడు. ఆ రోజు రాత్రే.... ప్రొఫెసర్ మహంతో విచిత్రంగా అదృశ్యమయ్యాడు.

## 5

సుమదోగోంగ్ పర్వతాలను ఒరుసుకొని, గల గలా ప్రవహిస్తోంది లూహిత్ నది.

ఎక్కడో మానస సరోవర ప్రాంతంలో జన్మించిన ఆ నది, టిబెట్ పీఠభూమిలో సంగ్ పో నది పేరుతో ప్రవహించి, అరుణాచల్ ప్రదేశ్ లో లూహిత్ గా రూపాంతరం చెంది, ఆ తరువాత అస్సాం భూభాగంలోనికి చొచ్చాక, బ్రహ్మపుత్రా నదికి ఉపనదిగా మారుతుంది.

ఆ నదీ జలాలను యెంతో పవిత్రమైనదిగా భావిస్తారు ఆ గిరిజనులు. ఆ నది ఒడ్డునే టాండ్ బారో దేవత జాతరకు యేర్పాట్లు జరుగుతున్నాయి.

నది ఒడ్డున కొంత మేర చెట్టూ, చేమా కొట్టివేయబడి పెద్ద మైదానంలా నేలంతా చదును చేయబడింది. ఓ ప్రక్కగా నైఋత్యంలో ఎనిమిదడుగుల టాండ్ బారో

కొయ్య విగ్రహాన్ని చెక్కుతున్నాడు గూడెంలో మంత్రతంత్రం తెలిసిన ఒక గిరిజనుడు. డప్పులూ, వాసె కోలలూ సిద్ధం చేయబడ్డాయి.

అమావాశ్య ముందురోజునుంచే సందడి మొదలయింది. చుట్టాలూ, పక్కాలతో గూడెం కళకళలాడుతుంది.

నాగాలూ, మిజోలూ, అస్సామీలూ....ఒక్కటేమిటి యెన్నో జాతులవారు గుంపులు గుంపులుగా కుమద్రో కొంగకు చేరుకున్నారు.

అంతకుంది క్రొత్తవారు ఒక్కసారిగా వచ్చేసరికి పరీక్షించడం చైనా సైనికులకు సాధ్యపడలేదు.

'జాతరకు క్రొత్తవారు రాకూడదని ఆంక్షలు విధిద్దా మంటే, అది వారి మత విశ్వాసాలపై దెబ్బతీసినట్లు అవుతుంది. అప్పుడు మొత్తం ఆ గిరిజన జాతులన్నీ తనపై తిరుగుబాటు చేయవచ్చు.'

జాతర ఎలాగూ ఒక్క రోజులో అయిపోతుంది: కాబట్టి క్రొత్తవారంతా యెవరి స్వస్థానాలకు వారు వెళ్ళి పోతారు. ఈ ఒక్కరోజు చూసీ చూడనట్లు ఆ గిరిజను లను వదిలేస్తే సరి' అనుకున్నారు చైనా సైనికులు.

నదీ తీరాన... పెద్ద తీర్థమే కూడింది.

శాల, పలాశ దారువుల క్రింద చిన్న చిన్న కొట్లు వెలిశాయి. పూసల పేరులు, పిల్లంగోరులు, అద్దాలు, సిల్వర్ గిన్నెలూ, రంగు రంగుల అద్దకాలు వేసిన ముతక గుడ్డలూ తుంగ చాపలమీద కుప్పలుగా పోసి అమ్ము తున్నారు షావుకార్లు.

అడవి కన్నె పడుచులు తలలో సీయపుష్పాలు, ధాతుక పుష్పాలు తురుముకుని వచ్చారు. కొందరు తల మీద వంకర ముడివేసి, కొయ్య దువ్వెనను చుట్టి అలంక

రించుకున్నారు.

తీర్థం చూడటానికి వచ్చిన కొందరు చైనా సైనికులు బలంగా, అందంగా, యవ్వనంతో మిస మిసలాడుతున్న ఆ గిరిజన యువతుల వంక ఆబాగా చూడసాగారు.

పిల్లలు నువ్వుల వుండలు, పాకం పట్టిన సెనగవుండలూ కొనుక్కొని తింటున్నారు.

తీర్థానికి కొద్ది దూరంలో మద్ది చెట్ల తోపులో ఒక చోట, చాలామంది చేరి వంటలూ భోజనలూ కావిస్తున్నారు. వాళ్ళకోసం తీర్థంలో ఒకప్రక్క కూరలూ మజ్జిగా అమ్మే దుకాణాలు వున్నాయి.

పచ్చి మద్ది ఆకులలో పొట్లాలు కట్టిన తరిగి ఎండబెట్టిన చేపలు, చిన్న చిన్న గుడ్లు అమ్ముతున్నారు. ఎర్రచీమ గుడ్లు ఇక్కడి వాళ్ళకి చాలా ఇష్టం. ఇవికాక, బొప్పాయి పళ్ళు ఎండురేగు పళ్ళు, జామపళ్ళు, పుట్టతేనె వుండనే వున్నాయి.

ఇక్కడ రొక్కంలో వ్యాపారంలేదు. దుకాణదార్లు తమ సరుకును డబ్బుకు బదులు ఆవాలు తీసుకొని అమ్ముతున్నారు. పురాతనమైన బార్టర్ సిస్టమ్ యిక్కడ యింకా అమలులో వుంది.

ఈ పద్ధతిలో వాళ్ళు అమ్మేసరకు విలువకి అనేకరెట్లు విలువగల ఆవాలు సంపాదిస్తున్నారు.

తెలివిగలవాడు. తెలివి తక్కువవాణ్ని మోసగించి, ఎక్స్ప్లాయిట్ చేసి లాభంపొందే ఆధునిక ఆర్థిక సిద్ధాంతానికి అంకురార్పణ సరిగ్గా యిలాంటిచోటే జరిగి వుంటుంది.

ఆ తీర్థం మొత్తంమీద ఒకే ఒక కొట్టులో మాత్రం

ఒక గోండ్ వృద్ధుడు అవాల కొట్టు పెట్టాడు. కాని అతడి దగ్గర అవాలు కొనేవారే లేరు.

అవును మరి. ఆ గిరిజన సీమలలో ద్రవ్యమారకానికి మీడియంగా వ్యవహరించే అవాలను కొనే మూర్ఖులెవరు వుంటారు? కొండవాలుల అంతట యెక్కడ చూసినా కావలసినంత అవ పంట.

తీర్థానికి వచ్చిన చాలామంది యువతీ యువకులు ఆ వృద్ధుడితో పరిహాసాలాడి పోతున్నారు.

"ఏం తాతా! బేరం ఎలాగుంది?"

"ఆఁ... ఇప్పుడేం బేరం."

"చీకటి పడితే బాగుంటుందా?"

"జాతర మొదలవ్వాలికదా, అప్పుడుంటుంది అసలు బేరం!"

"అదే ...ఎప్పుడో?"

"ప్రసాదం పంచాలి, తినాలి. ఆ తరువాత కదా మిగులూ, తగులూ బేరం యేదైనా!"

"బేరం ఎక్కడో?"

"యింకా ఇక్కడేముంది? అక్కడే!"

ఈ మాటలకే పక పకా నవ్వుకుంటూ వెళ్ళిపోతున్నారు ఆ యువతీ, యువకులు.

అయితే విచిత్రమయిన విషయం యేమిటంటే ఆ వృద్ధుడిని పలుకరించి, పరాచికాలాడిన యువతీ, యువకులంతా యివే ప్రశ్నలు అడిగారు. అతడు ఇవే సమాధానాలు చెప్పాడు.

ఆ మాటలద్వారా ఒక రహస్యమయిన వర్తమానాన్ని వారు ఒకరి కొకరు అందించుకుంటున్నారన్న

అనుమానం ఎవరికైనా వచ్చే ఆస్కారమే లేదు.

చీకటి పడటంతో నే కొట్టును మూసేసాడు ఆ వృద్ధుడు.

## 6

షవర్ లో నుండి వర్షం జల్లులా నీరు పడుతూంది. షవర్ క్రింద నిలబడ్డ అపర్ణాసేన్ నగ్నదేహం పాల రాతిలా మెరుస్తుంది.

బాత్ రూమ్ తన్ను కీ హోల్ నుండి ఆమె నగ్న సౌందర్యాన్ని ఆబగా చూస్తున్నాడు ప్రొఫెసర్ మహంతో.

తలపైనుండి భుజాల మీదికి జాలు వారుతున్న నీరు కంఠాన్ని చుట్టి, పయోధరాల మధ్యనుండి ఒక ధారలా సన్నని పొట్టమీదకు జారుతుంటే నిమ్నోన్నత పర్వత సానువుల మధ్య ఉరకలు వేస్తూ ప్రవహించే బ్రహ్మపుత్ర గుర్తుకు వచ్చింది అతడికి.

వీపున పడిన జల్లులు, వెన్ను నుండి క్రిందకు వరదలా దూకి, ఎత్తయిన పిరుదులను దాటిపోలేక, నడుమున మెలి తిరిగి వడిలై, కటిలో సుడిలై, ఆపై ఊరువులమీద ధారలుగా విడిపోతున్న స్నానపు నీటిలో గంగానదిని ఊహించుకుంటున్నాడతడు.

ఎంతయినా జియాలజిస్టు కదా!

అపర్ణాసేన్ అతడి సెక్రటరీ.

నిండుగా కప్పుకున్న చీరలో నుండి కనిపించని ఆమె అందాలను ఊహించుకుంటూ నే మగవారు తమ మతులను పోగొట్టుకొనే అందం ఆమెది.

ఇక, ఆమె నగ్న సౌందర్యాన్ని చూస్తే.... పిచ్చెక్కి పోదూ! ప్రస్తుతం మహంతో స్థితి అలాగే ఉంది.

కోరికతో అతడి శరీరం సలసల కాగిపోతుంది. పురి

ఎక్కన నరాలు జివ్వుమంటున్నాయి.

ప్రొఫెసర్ మహంతో దొంగచాటుగా తనను చూస్తున్నాడని అపర్ణాసేన్ కు తెలుసు. అతడిని మరి కాస్త అల్లరి పెడదామన్న చిలిపి కోరిక ఆమెలో చోటు చేసుకుంది.

ఒక్కసారి తమకంగా కళ్ళు విరచుకుని అతడికి ఎదురుగా తిరిగింది.

అంతే!

అతడి గొంతులో తడి ఆరిపోయింది. ఊపిరి తీయడం కూడా మరచిపోయాడతడు.

పదిమందికీ విద్యా, బుద్ధులు నేర్పాల్సిన ప్రొఫెసర్, బాత్ రూమ్ సందులోనుండి చాటుమాటుగా ఒక అమ్మాయి నగ్న సౌందర్యాన్ని చూసే పీపింగ్ టామ్ స్థితికి దిగజారాడంటే.... అందులో అతని తప్పేంలేదు.

వారం రోజుల క్రితం....

ప్రొఫెసర్ మహంతో, అతడి సెక్రటరీ అపర్ణాసేన్ ఒక గదిలో బంధింపబడ్డారు.

ఒక విధంగా వారు బందీలు కారు. ఆ గదిలో వారికి సకల సదుపాయాలూ అమర్చబడ్డాయి.

ఫ్రిజ్, టీ.వీ. టేప్ రికార్డర్, బుక్స్, వారికి యిష్టమైన భోజనం....ఒక్కటేమిటి? వారికి ఏ లోటూ లేదు ఆ గదిలో నుండి బయటకు పోవడానికి స్వేచ్ఛ తప్ప.

తమను ఎవరు, ఎందుకు అక్కడ బంధించారో అతడికి అర్థం కాలేదు.

అయితే ఇప్పుడు అతడు దాన్ని గూర్చి ఆలోచించటం లేదు. అతడి ఆలోచనలు యిప్పుడు అపర్ణా సేన్ చుట్టూ తిరుగుతున్నాయి.

అందమైన ఒక యువతితో ఒకే గదిలో ఏకాంతంగా ఒక రాత్రంతా వుండాల్సివస్తే బ్రహ్మకైనా దిమ్మ తెగులు పుడుతుంది.

ఆఫ్టరాల్! అతడు ఉప్పూ, కారం తింటున్న మామూలు మనిషి. కాకుంటే, తనకున్న సోషల్ స్టేటస్ నుండి క్రిందకు దిగిరావడానికి అతడికి ఆరు రోజులు పట్టింది.

అయితే....

తన అందాల సెక్రటరీ అపర్ణాసేన్ సి.బి.ఐ.కు చెందిన ఇన్‌ఫార్మర్ అనీ, తన రహస్యాలు తెలుసుకునేందుకు తనపై ప్రయోగించబడ్డ అస్త్రమనీ అతడికి తెలియదు.

అందుకే అమాయకంగా ఆమెకోసం ఆత్రుతలు చూస్తున్నాడతడు.

తమకు యెవరిమీదనైనా అనుమానం కలిగినప్పుడు, అలాంటివారి దగ్గర అపర్ణాసేన్‌లాంటి వారిని ప్లాంట్ చేస్తుంది. సి.బి.ఐ వారిని ఇన్‌ఫార్మర్స్ అంటారు.

తాము పనిచేసే సంస్థల లేక వ్యక్తుల రహస్యాలను సి.బి.ఐ కు అందజేసినందుకుగాను ఆ ఇన్‌ఫార్మర్స్‌కు పెద్ద మొత్తంలో పారితోషికాలు ముడుతుంటాయి.

అపర్ణాసేన్ కూడా అలాంటి ఇన్‌ఫార్మర్!

గది బయట మహాంతో పడుతున్న అవస్థను తలచుకొని ఆమె తనలో తాను నవ్వుకుంది.

ఈ ఎసైన్‌మెంట్‌కు తనను నియమిస్తూ సి.బి.ఐ చీఫ్ కరుణాకర్ అన్నమాటలు ఆమెకు గుర్తుకు వచ్చాయి.

'అపర్ణా! నేను చెప్పేది జాగ్రత్తగా విను.

ఇండో-చైనా సరిహద్దు రేఖను మెక్‌మోహన్ లైన్ అంటారు. ఇంతవరకూ ఆ రేఖ ఆధారంగానే మన రెండు

దేశాల సరిహద్దులూ నిర్ణయింపబడుతున్నాయి.

అయితే.... ఈ మధ్యలో చైనా ఆ రేఖను దాటి మన భూభాగాన్ని అక్రమంగా ఆక్రమించుకోవాలని ఎత్తులు వేస్తుంది. సరిహద్దులను మార్చి, క్రొత్త మాప్‌లను ముద్రించింది.

ఈ సమయంలోనే మరో ఆందోళనకరమైన విషయం మా సి.బి.ఐ. దృష్టికి వచ్చింది.

అది: ప్రొఫెసర్ మహంతో వ్రాస్తున్న 'ది జియోగ్రఫీ ఆఫ్ నార్తు—ఈస్టరన్ ఇండియా' అన్న పుస్తకం.

భారత ఈశాన్య సరిహద్దుల గురించి క్షుణ్ణంగా చర్చింపబడిందట ఆ పుస్తకంలో. అంతేగాక మెక్‌మోహాన్ సరిహద్దు రేఖ గూర్చి కొన్ని క్రొత్త వ్యాఖ్యానాలు వ్రాయబడ్డాయట అందులో

ఆ వ్యాఖ్యానాలు చైనాకు మేలుకూర్చేవిగానూ, మన దేశాన్ని ఇబ్బందిలో పెట్టేవిగాను వున్నాయట!

మన శత్రు దేశానికి అనుకూలంగా మహంతో ఆ పుస్తకం ఎందుకు వ్రాస్తున్నట్లు?

అతడు శత్రు దేశం మనిషా? అది నీవు తెలుసుకోవాలి. వెంటనే మాకు తెలియజేయాలి.

అంతేకాదు. ప్రొఫెసర్ మహంతో భారత దేశంలో పేరుపొందిన జియాలజిస్టులలో ఒకరు. అలాంటి వ్యక్తి వ్రాసిన ఆ పుస్తకం వెలుగులోనికి వచ్చిందంటే.... దాని ఆధారంగా చైనా ఐక్యరాజ్య సమితిలో మన దేశంమీద దుమారం లేపుతుంది. మహంతోకు అంత విలువ వుంది.

'మహంతో వ్రాసిన పుస్తకం ఆధారంగా మెక్‌మోహాన్ రేఖను పరిశీలిస్తే అరుణాచల్‌ప్రదేశ్ చైనా భూభాగంలోనిదేనని' చెప్పు ఏ చైనా విదేశాంగ మంత్రో

అయినా మనం ఆశ్చర్యపోనవసరంలేదు.

ఆ పరిస్థితి రాకముందే మనం జాగ్రత్తపడాలి.

సో....ఆ పుస్తకంలోని పూర్తి వివరాలు, ఏ ఆధారాలతో మహాంతో క్రొత్త వ్యాఖ్యానాలు వ్రాయడానికి సాహసిస్తున్నాడో ఆ ఎవిడెన్షియల్ డాక్యుమెంట్స్ నాకు కావాలి.

అపర్ణా!

నీ చాకచక్యంమీద మన దేశ భవిష్యత్ ఆధారపడి వుంది. బీ కేర్ ఫుల్ !"

ఆలోచనలనుండి తేరుకున్న అపర్ణ టవల్ ను వంటికి చుట్టుకుని బయటకు నడిచింది.

తన వంక తడబడుతూ చూస్తున్న మహాంతోను చూసి చిలిపిగా నవ్వింది ఆమె. ఆ నవ్వు అతడికి కొండంత ధైర్యాన్ని యిచ్చింది.

టవల్ ను విడిచి పలుచని నైటీని ధరించింది ఆమె. ట్రాన్స్‌పరెంట్ నైటీలోనుండి ఆమె నిండయిన యౌవన బిగువులు బరువుగా కదులుతూ అతడిని మరింత రెచ్చగొట్టాయి.

ఇక ఆగలేక, పట్టలేని తమకంతో ఆమెను కౌగలించుకున్నాడతడు. లతలా అతనిని పెనవేసుకుపోయింది ఆమె. ఆత్రంగా ఆమె నైటీ గుండీలను ఊడదీసాడతడు.

అయితే....ఆ గదిలో. జరుగుతున్న వారి రాసక్రీడ అంతా వీడియో కెమేరాతో షూట్ చేయబడుతుందన్న విషయం వారిద్దరికీ తెలియదు.

## 7

చీకటి పడింది.

జాతర ప్రారంభమయింది.

కాగడాల వెలుగులో పసుపూ, కుంకుమా లక్కా, నల్లజీడి రంగూ పూయబడ్డ టాండ్ బారో దారు విగ్రహం ధగ ధగా మెరుస్తూంది,

కుసంభ పూలూ, మోదుగ పూలూ కలిపి కట్టిన మాలలతో ఆ విగ్రహం అలంకరింపబడింది. విగ్రహం పాదాలచెంత నున్న పెద్ద రాతిచిప్పలోని కణ కణ లాడుతున్న నిప్పులమీద వృద్ధ పూజారి గుగ్గిలపు పొడిని జల్లుతున్నాడు.

పొడిని చల్లినప్పుడల్లా, తెల్లని పొగ కుప్పుమని పైకి లేస్తుంది. కమ్మని గుగ్గిలపు వాసన నలుదిక్కులా వ్యాపిస్తుంది.

డప్పులూ, డోళ్ళూ, వాసెకోళ్ళూ, పిల్లనగ్రోవులూ, శంఖాలూ, కొమ్ముబూరలూ .... అన్నీ ఒక్కసారిగా మ్రోగుతుండటంతో పుట్టిన ఒక విచిత్రమైన శబ్దం అక్కడున్న వారందరిలో ఒకవిధమైన ఆవేశాన్ని పుట్టిస్తుంది.

పులియబెట్టిన యాక్ పశువుల పాలూ, ఇప్పసారా కావలసినవారికి కావలసినంత పోయబడుతూంది.

ఆడా, మగా తేడా లేకుండా అంతా ఆనందంగా మధువును గ్రోలుతున్నారు. మధువుతో మత్తెక్కిన కళ్ళతో తూలుతూ, సోలుతూ ఆడుతున్నారు, పాడుతున్నారు.

గంతే ఓపిక లేని ముసలివారు, తీరిగ్గా కూర్చుని, కాల్చిన అడవికోళ్ళ మాంసాన్ని నములుతూ ఆ సంబరాన్ని చూస్తున్నారు.

టాండ్ బారో విగ్రహానికి కాస్త దూరంలో ఒంటరిగా కూర్చుని వున్నాడు ఈ సంబరానికి అసలు కారకుడైన సంతాల్ యువకుడు బిగూ.

జట్లు కట్టుకుని నాట్యం చేస్తున్న కొందరు యువతీ యువకులు మాటి మాటికీ అతనివంకే చూస్తున్నారు.

వారంతా పరాయి ప్రాంతాల నుండి వచ్చిన వివిధ జాతులకు చెందినవారు. తీరంలో ఆవాలకొట్టు పెట్టిన గోండ్ వృద్ధునితో పరిహాసాలాడినవారు వారే.

ఆ యువతీ యువకులంతా తన మెసేజ్ కోసమే ఆత్రంగా యెదురుచూస్తున్నారని బిగూకు తెలుసు.

కాని, అతడు యింకొకరి దగ్గరనుండి మెసేజ్ కోసం యెదురుచూస్తున్నాడు. అతడికి మెసేజ్ నందించాల్సిన వ్యక్తి, జాతరకు దూరంగా మద్దిచెట్ల తోపులోనున్నాడు.

ఆ వ్యక్తి....గోండ్ వృద్ధుడు.

చీకటిలో, ఒంటరిగా ఆవాల బస్తాల మధ్య కూర్చున్న అతడిని చూసిన ఒకరిద్దరు....'పాపం అమ్ముడు పోని ఆవాలకు కాపలాగా కూర్చున్నాడు' అనుకున్నారు.

కాని, అతడి ముందున్న ఆవాల బస్తాల మధ్య ఒక హైపవర్ ట్రాన్స్‌మీటర్ వుందని దాని ద్వారా ఒక సీక్రెట్ ఎసైన్‌మెంట్‌కు చెందిన అతి ముఖ్యమైన సమాచారం ఎక్స్ఛేంజ్ చేయబడుతూందని యెవరూ ఊహించలేరు.

అతడు షిల్లాంగ్ నుండి వచ్చే ఒక మెసేజ్ కోసం యెదురుచూస్తున్నాడు,

ఒక్కొక్క క్షణం గడుస్తోన్న కొద్దీ అతడిలో టెన్షన్ అధికమవసాగింది.

# 8

ఎత్తయిన ఆమె గుండెలమీద అలసటగా తల వాల్చాడు అతడు. ఒక గొప్ప అనుభవానికి సుస్తుగా

మిగిలిన చిరుచెమట బిందువులు అతడి నుదుట మిల మిలా మెరుస్తోన్నాయి. సంతృప్తిలో కూడిన చిరునగవు ఆమె పెదవులమీద నర్తిస్తోంది.

అరమోడ్చిన కనురెప్పలను పైకెత్తి అతనివంక ప్రేమగా చూసిందామె. కుడిచేతితో లాలనగా అతడి తల ముంగురులను సవరించింది.

ఆమె చేయి ఎత్తడంలో బరువుగా కదిలిన పయోధరాలు అతిడి చెంపలను తాకుతూ, నాశికను మీటుతూ, చుబుకాన్ని స్పృశిస్తూ, కపోలాన్ని ముద్దిడుతూ అతిడిని ఉక్కిరిబిక్కిరి చేశాయి.

మెత్తని ఎత్తులను అతడి పెదవులు సుతిమెత్తగా వత్తడంతో ఎదలో పుట్టిన పులకరింత నిలువెల్లా ప్రాకటంతో ఆమె మత్తుగా మూల్గింది.

గాలి కూడా ఆ గదిలో క్షణంసేపు స్తంభించి పోయింది. అప్పుడు....ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ ఆమె ఎర్రని పెదవులు మెల్లగా విచ్చుకున్నాయి.

"మనలను యిక్కడ యెవరు బంధించారో మీకు తెలుసా ప్రొఫెసర్?"

"ఊహుఁ!"

తెలియదన్నట్లు తలను అడ్డంగా ఊపాడు అతడు.

"నాకు తెలుసు!"

"ఎవరు?" అడిగాడతడు ఆశ్చర్యంగా.

"ఇండియన్ సి.ఐ.బి.!!"

అంతే! ఛిల్లున ఎవరో కొరడాతో వెన్నుమీద చరిచినట్టయింది అతడికి.

ఒక్క వుదుటున లేచికూర్చున్నాడతడు. ఆమె మాత్రం అలాగే పడుకుని వుంది.

ఆ భంగిమలో ఆమె అద్భుతంగా వుంది. ఫ్లోరో సెంట్ దీప కాంతిలో ఆమె నగ్న దేహం తళ తళా మెరుస్తూంది.

అయితే ఇప్పుడు అతడి దృష్టి ఆమె నగ్న సౌందర్యం మీద లేదు. ఆమెవంక కలవరంగా చూశాడతడు.

"అవును ప్రొఫెసర్!

మీరు చైనా దేశపు ఇన్‌ఫార్మర్ అని సి.బి.ఐ.కి తెలిసిపోయింది.

సి.బి.ఐ. ఏజెంట్ రాంకుమార్ మిమ్మల్ని కలసి, సుమదోలాంగ్ లోయ గురించి మాట్లాడాడు గుర్తుందా? అతడు మీ ప్రహరీ గేటు దాటకముందే మీరు స్పృహ తప్పి పడిపోయారు.

ఎందుచేత?

మీరు తాగిన టీలో అతడు తెలివిగా మత్తుమందు కలపడంచేత. తెలివితప్పిన మిమ్మల్ని యిక్కడకు రహ స్యంగా చేర్చారు. ఎందుకు?

మీరు రాంకుమార్ గురించి, సుమదోలాంగ్ లోయ లోని చైనా సైనికులకు మెసేజ్ పంపించకుండా, సి.బి.ఐ. యిక్కడ మిమ్మల్ని బంధించింది.

మీరు శత్రుదేశం మనిషని సి.బి.ఐ.కు ముందుగానే తెలుసు. అయినా రాంకుమార్ మిమ్మల్నే సంప్రదించాడు.

ఎందుకో తెలుసా?

అతడికి కావలసిన వివరాలు చెప్పగలిగే వ్యక్తి మీరొక్కరే గనుక."

ఆమె చెబుతున్న ఒక్కొక్క మాట వింటున్నకొద్దీ భయంలో అతడి ముఖం పాలిపోసాగింది.

"ఇదంతా నీకెలా తెలుసు?" హీన స్వరంతో అన్నా

డతడు.

"నేను సి.బి.ఐ. మనిషిని కనుక!" కూల్ గా అంది ఆమె.

అంతే! ప్రక్కలో బాంబుపడ్డట్లు ఉలిక్కిపడ్డాడు అతడు. అతడి ముఖంలో రక్తం యింకిపోయింది. ఆమె వంక బ్లాంక్ గా చూశాడతడు.

అతడి వంక చూసి చిన్నగా నవ్వింది ఆమె.

"దేశ ద్రోహానికి శిక్షను అనుభవిస్తూ జీవితాంతం ఖైదీగా బ్రతకటం కష్టం కదూ!"

ఆమె వంక కలవరంగా చూశాడతడు.

'అపర్ణ సి.బి.ఐ. ఇన్ ఫార్మర్ అని చెబుతూంది. సాధారణంగా ఇన్ ఫార్మర్స్ పని చేసేది డబ్బుకోసం. మరి...ఆ డబ్బుతోనే అపర్ణను లొంగదీసుకుంటే...?

అతడికి అపర్ణ చాలా కాలంగా తెలుసు.

పేదరికంలో పుట్టి, పెరిగిన ఆమెకు పేదరికం అంటే తగని అసహ్యం.

సి.బి.ఐ. యిచ్చే డబ్బుకు ఆశపడి, తనను ట్రాప్ చేయడానికి, తన శరీరాన్ని సైతం తనకు ఎర చూపిందంటే ఆమె కరెన్సీకోసం యేమయినా చేస్తుందన్న మాట.

మానంపట్ల గౌరవంలేని మనిషికి, దేశంపట్ల మాత్రం భక్తి యెలా వుంటుంది?'

అతడిలో యేదో ఆశ రెప రెపలాడసాగింది.

"అపర్ణా! ఈ చెరనుండి నన్ను తప్పించగలవా?" ఆమె కళ్ళలోకి చూస్తూ అడిగాడతడు.

"తప్పిస్తే.... నాకేమిటి లాభం?"

"లాభం వుంది అపర్ణా!

నీవు జీవితాంతం ఖర్చుపెట్టినా తరగనంత డబ్బు యిప్పిస్తాను. కావాలంటే నాతోపాటు నిన్నూ చైనా తీసుకువెళ్తాను. అక్కడనుండి నీవు యే స్విట్జర్లాండ్లో, అమెరికాలో పోయి హాయిగా బ్రతకవచ్చు.

మనిషి సుఖపడాలంటే డబ్బు కావాలి అపర్ణా! నేనూ.... నా దేశం అనుకుంటే నీ బ్రతుకు గొర్రె తోక బెత్తెడు లాగానే వుంటుంది. నాతో చేయి కలుపు. కలలోకూడా వూహించని అంత సుఖం నిన్ను చేయిస్తాను."

ఆమె కళ్ళు ఆశగా మెరిశాయి.

రెండు నిమిషాలు ఆమె మౌనంగా ఆలోచిస్తూ వుండిపోయింది. తరువాత మెల్లగా పెదవులు విప్పింది.

"ఓ.. కే. ప్రొఫెసర్!

మీ ఆఫర్ నాకు నచ్చింది. మిమ్మల్ని యిక్కడ నుండి తప్పిస్తాను."

"ఎలా? ఎప్పుడు?" ఆత్రంగా అడిగాడతడు.

"దానికి ఒకే ఒక మార్గం వుంది ప్రొఫెసర్."

"ఏమిటది?"

ఆమె ప్రొఫెసర్ వంక ఒక్కసారి సాలోచనగా చూసి, చెప్పడం ప్రారంభించింది.

"నేను ఎలాగూ వారి మనిషినే గాబట్టి, నేను బయటకు పోవడానికి అభ్యంతరపెట్టరు వారు.

నేను సుముద్రోగోంగ్ లోయలోని చైనా సైనికులను కాంటాక్టు చేసి మీరు బంధింపబడ్డ విషయం వారికి చెబుతాను. ఈ ఇంటి టోపోగ్రాఫీ అంతా నాకు తెలుసు గాబట్టి, చైనా కమెండోల సాయంతో మిమ్మల్ని యిక్కడనుండి విడిపిస్తాను."

ఆమె మాటలకు అతడి ముఖం ఆనందంతో విప్పారింది.

"అయితే.... ఈ పని నేను చేయాలంటే మీరు నాకో విషయం చెప్పాలి."

'ఏమిటన్నట్లు' ఆమె వంక ఆశ్చర్యంగా చూశాడు.

"మీరొక పుస్తకం వ్రాస్తున్నారే.... 'ది జాగ్రఫీ ఆఫ్—నార్తు—ఈస్టరన్ ఇండియా' దానికి సంబంధించిన ఎవిడెన్షియల్ డాక్యుమెంట్స్ వున్న ఫైలును యెక్కడ దాచారో చెప్పాలి.

నేను బయటకు వెళ్ళి, ముందుగా ఆ ఫైలును చేజిక్కించుకున్న తరువాతే మీ విడుదలకు ప్రయత్నాలు మొదలు పెడతాను."

"అది... అది నీకెందుకు?"

ప్రొఫెసర్ వంక చూసి చిన్నగా నవ్వింది ఆమె.

"ప్రొఫెసర్! చైనీయులు మీకు యింత విలువ నివ్వడానికి కారణం ఆ బుక్.... అది లేనినాడు మీరు చిల్లి గవ్వకూడా వారికి కొరగారు.

అది మా ట్రంప్ కార్డు

మిమ్మల్ని విడిపించాక, ఒక వేళ మీరు నన్ను మోసం చేస్తే నా గతేం కాను?

అందుకే, ఆ ఫైలును నా దగ్గరుంచుకుంటాను. నాకు రావాల్సిన డబ్బు ముట్టిన మరుక్షణం మీకా ఫైలు అందచేయబడుతుంది. జస్టు ఎ సేఫ్టీ ప్రికాషన్."

కొన్ని క్షణాల క్రితం తనను కవ్వించి, తన కౌగిలిలో కరిగిపోయిన అమాయక యువతిలా కనిపించటంలేదు ఆమె. అతడి కళ్ళకు యిప్పుడొక ఆరితేరిన స్పైలా కనిపిస్తోంది ఆమె.

"నీవు నన్ను నమ్మనప్పుడు, నేను మాత్రం నిన్ను నమ్మి ఆ ఫైలు రహస్యాన్ని ఎందుకు చెప్పాలి?" అసహనంగా అడిగాడతడు.

ఆమె అతడి వంక కూల్‌గా చూసింది. సన్నని దరహాసం ఒకటి ఆమె పెదవులపై మెరిసింది. 'ఓరి పిచ్చివాడా' అన్నట్లుంది ఆమె చూపు.

"మీరు నన్ను నమ్మాలి ప్రొఫెసర్!

ఎందుకంటే మీరు తప్పించుకోవడానికి నేను తప్ప మరో మార్గంలేదు కనుక. యూ షుడ్ బిలీవ్ మీ."

అతడు నిస్సహాయంగా నిలుచుండిపోయాడు.

'అతనికి తెలుసు ఆ రహస్యాన్ని చెప్పేస్తే తనకేమీ విలువ వుండదని. కాని, ఆమె అన్నట్లు తనకు మరో మార్గంలేదు.'

"నా బెడ్ రూమ్‌లో మంచం క్రింద, కార్పెట్‌ను తొలగించి చూస్తే అక్కడో చెక్క తలుపు వుంటుంది. అది తెరిస్తే అక్కడో షెల్ఫ్ వుంటుంది. దానిలో వుంది ఆ ఫైలు. ఇది దాని తాళంచెవి."

జేబులో నుండి ఒక తాళంచెవిని ఆమెకు అందిస్తూ మెల్లగా అన్నాడతడు.

ఆమె ఆ 'కీ'ని అందుకుంది. దానిని రెండు పెదవులకు అనించుకొని ముద్దాడింది.

"థాంక్యూ ప్రొఫెసర్ వస్తాను" అంటూ రెండడుగులు ముందుకు వేసి, ఏదో గుర్తుకు వచ్చినట్లు టక్కున ఆగిపోయింది.

ఆమె చూపులు ఎదురుగానున్న డే అండ్ డేట్స్ క్యాలెండర్ పై నిలిచిపోయాయి.

"మై గాడ్! ఈ రోజు అమావాస్యా?" అంటూ

గిరుక్కున ప్రొఫెసర్ వైపు తిరిగింది.

అమావాస్య అయితే ఇదేమిటో అర్థంగాక ఆమె వైపు ఆశ్చర్యంగా చూస్తున్నాడతడు.

"సుమదోరోంగ్ లోయలోని చైనీయుల స్థావరం మీదకు ఈ రోజే సి.బి.ఐ. దాడిచేయబోతూంది.

యిప్పుడెలా?

ఆ స్థావరం ఇండియన్ సి.బి.ఐ. వశమైతే మీ గురించి వారికి మెసేజ్ ఎలా అందించను?"

అతని వంక ఆందోళనగా చూస్తూ అంది ఆమె.

"డోంట్ ఫియర్ అపర్ణా! ఏ.బి.ఐ. ఆ స్థావరాన్ని స్వాధీనం చేసుకోలేదు" అన్నాడతడు ధీమాగా.

"ఏం?" అందామె అతడి వంక అర్థంకానట్లు చూస్తూ.

అతడు రెండడుగులు ముందుకువేసి, ఆమెకు దగ్గరగా వచ్చాడు. లోగొంతుతో నెమ్మదిగా ఇలా అన్నాడు:

"ఆ స్థావరంలో ఒక సిగ్నలింగ్ టవర్ వుంది. దానిలోని ట్రాన్స్‌మిటర్ ద్వారా ప్రతి అరగంటకొకసారి తమ హెడ్ క్వార్టర్స్‌ను కంటాక్టు చేస్తారు అందులోని సైనికులు.

సి.బి.ఐ ఆ స్థావరంమీద ఎటాక్ చేసి ఆ టవర్‌ను నాశనంచేస్తే, ప్రతీ అరగంటకూ రావాల్సిన మెసేజ్ రాక చైనా అధికారులకు అనుమానం వస్తుంది.

అంతే! కేవలం అరగంటలో యుద్ధం ప్రారంభమవుతుంది. మెక్ మోహన్ సరిహద్దు రేఖను దాటి చైనా సైనిక దళాలు భారత భూభాగం లోనికి చొచ్చుకు వస్తాయి.

సరిహద్దు ప్రాంతంలో కేవలం నామమాత్రపు పెట్రోలింగ్ స్క్వాడ్స్‌ను మాత్రమే వుంచుతుంది భారత

ప్రభుత్వం. ఆ కొద్దిమంది సైనికులూ వెల్లువలా వచ్చిపడే చైనా సైనిక పటాలాలను ఆపలేరు."

"ప్రతి అరగంటకూ వారు హెడ్ క్వార్టర్స్‌కు పంపే ఆ కోడ్ మెసేజ్ యేమిటి ప్రొఫెసర్?" ఏదో యథాలాపంగా అన్నట్లు అడిగిందామె.

"ఆపరేషన్ క్రాస్ ఎమ్.ఎమ్.

అక్యుపేషన్ ఎ.పి.ఎస్.వి."

అని టక్కున అనేసి, గాభాలున నాలిక కర్చుకున్నాడతడు. రహస్యంగా వుంచాల్సిన ఆ కోడ్ మెసేజ్‌ను ఆత్రంలో నోరు జారినందుకు తనను తానే తిట్టుకున్నాడతడు.

చిద్విలాసంగా నవ్వుతూ ఆమె తలుపు వద్దకు నడిచింది. మంత్రం వేసినట్లు మూసిన తలుపులు తెరుచుకున్నాయి. ఆమె బయటకు అడుగు పెట్టింది.

సరిగ్గా రెండు నిమిషాల తరువాత, ప్రక్క గదిలోని వైర్‌లెస్ సెట్ ద్వారా సుమదోగోంగ్ లోయలోనికి ఆమె ఒక మెసేజ్‌ను పంపించడం ప్రారంభించింది.

# 9

పద్దికొట్ల తోపులో ఆవాల బస్తాల దగ్గర ఉండాల్సిన గోండ్ వృద్ధుకు జాతరలోనికి అడుగు పెట్టడం చూస్తూనే సంతాల్ యువకుడు బిగూ కళ్ళు విచిత్రంగా మెరిశాయి.

బిగూ లేచి నిలబడ్డాడు.

జాతర జోరుగా సాగుతోంది.

సురాపానంతో మత్తెక్కి, ఒళ్ళు తెలియని స్థితిలో చిందులు వేస్తున్నారు ఆ గిరిజనులు.

బిగూతోపాటు, కొందరు గిరిజన యువతీ యువకులు

నెమ్మదిగా జాతరనుండి బయటపడి, మద్దిచెట్ల తోపు లోనికి జారుకోవడం అక్కడివారు యెవరూ గ్రహించ లేదు. ఒక వేళ చూసినా పట్టించుకునే స్థితిలో లేరు వారు.

అంతా తోపులోనికి చేరుకున్నాక "మెసేజ్ వచ్చింది. మనం ప్రొసీడ్ కావచ్చు" అన్నాడు గోండ్ వృద్ధుడు.

"మరి కోడ్?" ఆత్రంగా అడిగాడు బిగూ.

"ఆపరేషన్ క్రాస్ ఎమ్.ఎమ్.

ఆక్యుపేషన్ ఎ.పి.ఎస్.వి." అన్నాడు లోగొంతుతో ఆ వృద్ధుడు.

'ఎమ్.ఎమ్. అంటే మెక్ మోహన్ లైన్. మరి.... ఎ.పి.ఎస్.వి. అంటే...." ఒక్క క్షణం కన్నులు మూసు కొని ఆలోచించాడు బిగూ.

"అరుణాచల్ ప్రదేశ్ సుందోరోంగ్ వాలీ దటీజ్ ఎ.పి.ఎస్.వి." అప్రయత్నంగా అన్నాడతడు.

చుట్టూ వున్న యువతీ, యువకుల వంక సాభి ప్రాయంగా చూశాడతడు. వారికి ప్రత్యేకంగా మాటలతో చెప్పే పని లేకపోయింది. ముందుగానే ఒక పథకం వేసుకొన్నట్లు వారు రెండు జట్లుగా విడిపోయారు.

ఆ తోపులో పొదల క్రింద దాయబడ్డ నాటి కుండలను పెకిలీశారు యువతులు. పులియబెట్టిన యాక్ పశువుల పాలూ, ఇప్పసారా, జీలుగు కల్లూ వాటి నిండుగా వున్నాయి.

గోండ్ వృద్ధుడు ముందుగా నడుస్తూ దారిని చూపు తుంటే, అతడి వెనుక ఆ యువతులూ, వారి వెనుక మరి కొందరు యువకులూ ఆ కుండలను పట్టుకొని నడుస్తు

న్నారు.

మరి కొందరు యువకులను తీసుకొని బిగూ చెట్ల మాటున అదృశ్యమయ్యాడు.

అయితే ఆ రెండు బ్యాచ్‌ల గమ్యమూ ఒక్కటే. అది చైనా సైనికుల స్థావరం!

సరిగ్గా ముప్పయి నిమిషాల ప్రయాణం తరువాత వారా స్థావరాన్ని చేరుకున్నారు.

గేటు దగ్గర తమను అడ్డగించిన సైనికులతో.... "దేవర ప్రసాదం దొరా. మీకోసమే తెచ్చాం. ఈ లోయలోని అందరికీ ప్రసాదం పంచడం మా ఆచారం!" అన్నాడు గోండ్ వృద్ధుడు.

వెంటనే ఆ విషయం బారక్స్‌లో పడుకున్న అధికారికి తెలియజేయబడింది. అతడు ఆవులిస్తూ బయటకు వచ్చాడు. అతడితో పాటు మరికొందరు సైనికులు కూడా.

ఎదురుగా అందమయిన గిరిజన యువతులను చూడగానే వారి నిద్రమత్తు ఎగిరిపోయింది.

మోకాళ్ళు దాటని మొలబట్టలోనుండి నున్నగా, బలంగా నిగనిగలాడుతున్న తొడలూ బిగుతైన కంచుకంలోనుండి ఉబికివచ్చి, ఆపైన సిగ్గేసి కాబోలు గుల్ల పేర్ల మాటున దాక్కోవాలని విశ్వప్రయత్నం చేస్తున్న గుండెల ఎత్తులూ.

ఆ పడుచుల అందాలు వారికి నోరూరించాయి.

ఆ స్థితిలో కూడా ఆ అధికారి ఒక్క క్షణం ఆలోచించాడు.

'వారిచ్చిన ప్రసాదం తీసుకోకపోతే వారి మత విశ్వాసాలపై దెబ్బతీసినట్లవుతుంది. అది గిరిజనులకు సహించరాని విషయం.

ఈ చిన్న విషయంకోసం వారిని ఎందుకు హర్ట్ చేయాలి? ఆ ప్రసాదం స్వీకరిస్తే సరి" అనుకున్నాడు ఆ అధికారి.

ఆ యువతులు కడవలు క్రిందకు దించారు. మట్టి పిడతలలో ఆ మదిరను పోసి ఆ సైనికులకు అందించసాగారు. బారెక్స్‌లలో నిద్రపోతున్న సైనికులంతా బయటకు వచ్చారు.

"అదీ వారి ఆచారమేమో" అనుకున్నాడు ఆ అధికారి, ఓ పిడతలోని ఇప్పసారా రుచిచూస్తూ.

అందమైన మగువలు, చిరునవ్వులు చిందిస్తూ ప్రక్కన నిలుచుని మదిరను అందిస్తుంటే.... కాదనే మగాడెవరు?

వారు అనుమానాలను, ఆలోచనలను ప్రక్కకు నెట్టేసి చిత్తుగా త్రాగారు.

అయితే ఆ కడవలోని మదిరలో మత్తుమందు కలపబడిందని, అది త్రాగిన కొద్ది నిమిషాలలో తామంతా తెలివితప్పి పడిపోతామనీ ఆ చైనా సైనికులకు తెలియదు.

మత్తుగా తూగుతున్న ఆ సైనికుల వంక చూస్తూ చిన్నగా నవ్వుకున్నాడు గోండ్ వృద్ధుడు.

అదే సమయంలో....

ఆ స్థావరానికి మరో మూల, సిగ్నలింగ్ టవర్ వెనుక నున్న పొదల మాటున పొంచి వున్నారు మరికొందరు యువకులు. వారిని లీడ్ చేస్తున్న బిగూ మెల్లగా లేచి నిలబడ్డాడు.

అతడు రెండడుగులు ముందుకు వేశాడు. అదే క్షణంలో టవర్ దగ్గరున్న గార్డ్ బిగూను చూశాడు. రైఫిల్ ను బిగూ గుండెలకు గురిపెట్టాడు.

# 10

ఆ గది తలుపులు తెరచుకున్నాయి.

లోపల ఉత్కంఠతో యెదురుచూస్తున్న ప్రొఫెసర్ మొహంతో ఉలిక్కిపడి చూశాడు.

గదిలోనికి ఇద్దరు వ్యక్తులు ప్రవేశించారు.

వారు: అతడు యెదురుచూస్తున్న అపర్ణా సేన్ గాని, చైనా కమెండోలుగాని కారు. అంతకుముందు అతనెన్నడూ చూడని అపరిచిత వ్యక్తులు. వారు నీలిరంగు సూట్లను ధరించారు.

"ఎవరు మీరు?" అన్నాడతడు వారి వంక అసహనంగా చూస్తూ.

వారు కోటు జేబులోనుండి తమ ఐడెంటిటీ కార్డులను తీసి అతడికి చూపించారు. వాటిని చూసిన అతని ముఖం నల్లగా మారిపోయింది.

వారు....సి.బి.ఐ ఆఫీసర్లు.

"ప్రొఫెసర్! మీకు స్వేచ్ఛ కావాలా?" సంభాషణను ప్రారంభిస్తూ అడిగాడొక వ్యక్తి.

ఆ మాటలలో అపహాస్యం లేదు. ఎగతాళి లేదు. వారి వంక నిర్లిప్తంగా చూశాడతడు.

"నిజం ప్రొఫెసర్! మీకు స్వేచ్ఛ యివ్వబడుతుంది. యూ విల్ బీ ఫ్రీ. అయితే మీరు కొన్ని నిబంధనలకు అంగీకరించాల్సి ఉంటుంది."

"ఏమిటా నిబంధనలు?"

"దట్స్ గుడ్! నౌయూ ఆర్ ఆన్ ద ట్రాక్. ఆ నిబంధనలు చెప్పేముందు మీకు వాస్తవ పరిస్థితిని వివరిస్తాను ప్లీజ్ ఫాలో మీ కేర్ ఫుల్లీ.

మీకు తెలుసుగా....సుమదోరాంగ్ లోయ లోని

చైనా సైనిక స్థావరంపై సి. బి. ఐ. ఎటాక్ చేయబో తుంది. బహుశా ఈ క్షణానికి ఆ ఎటాక్ ప్రారంభం అయివుంటుంది.

యిక, చైనా సరిహద్దులలో మన సైనిక దళాలు అప్రమత్తం చేయబడ్డాయి. అయితే మీరు ఊహించి నట్లుగా యిప్పుడు అక్కడున్నవి కేవలం పెట్రోలింగ్ స్క్వాడ్స్ కావు.

వైజయంతీ టాంకులు ఏంటీ ఎయిర్‌క్రాఫ్ట్ గన్స్, రాడార్ కేంద్రాలుగల సైనిక స్థావరాలు యేర్పాటు చేయబడ్డాయి.

చైనా దాడి ప్రారంభించిన మరుక్షణం నిప్పులవర్షం కురిపించడానికి మిగ్, మిరేజ్, జాగ్వర్ విమానాలు సిద్ధం చేయబడ్డాయి.

ఇదంతా మీకెందుకు చెబుతున్నానంటే, చైనా సైనికులు వచ్చి, మిమ్మల్ని విడిపిస్తారనే ఆశ మీలో యేమైనా వుంటే అది సాధ్యంకాదని తెలియజేయడానికి.

ఇక .... మీ సెక్రటరీ అపర్ణాసేన్ మా మనిషి. మిమ్మల్ని నమ్మించి మీ దగ్గరనుండి రహస్యాలను గ్రహించడానికి మేమాడించిన నాటకంలో అద్భుతంగా తన పాత్రను పోషించింది.

మీ బెడ్ రూమ్‌లోని రహస్యపుటరలో దాచిన ఎవిడెన్షియల్ డాక్యుమెంట్సన్నీ యిప్పుడు మా చేతిలో వున్నాయి. అవి లేనినాడు మీ పుస్తకానికి బేస్ లేదు.

ఇప్పుడు మీ రా పుస్తకాన్ని పూర్తిచేసి, పబ్లిష్ చేసినా, ఏ ఆధారాలతో మీరీ తప్పుడు వ్రాతలన్నీ వ్రాసారని యెవరయినా మీమీద కేసు పెడితే—ఆఫ్ కోర్స్ తెర వెనుక నుండి మేమే ఆ కేసును పెట్టిస్తాం'

అప్పుడు మీరు నోరు వెళ్ళబెట్టాలి.

దేశ సమగ్రతకు భంగం కల్గించే వ్రాతలు వ్రాసినందుకు (అదీ యే ఆధారాలూ లేకుండా—) జైలు శిక్షను అనుభవించాలి.

ఒక వేళ, వీటన్నిటికీ తెగించి, మీరు మొండిగా ప్రవర్తిస్తే, ఈ ఫోటోలు అన్ని పత్రికలలోనూ ప్రచురింపబడతాయి. మీరు పని చేసే యూనివర్సిటీ గోడలపై, మీరు నివసించే యింటి పరిసరాలలో ఈ ఫోటోలు వాల్ పోస్టర్లై మీ బ్రతుకును బజారుకీడుస్తాయి.

ఒక్కసారి ఈ ఫోటోలను చూడండి."

వణుకుతున్న చేతులతో ఆ ఫోటోలను అందుకున్నాడు ప్రొఫెసర్ మహంతో.

అపర్ణ బాత్ రూమ్‌లో స్నానం చేస్తుండగా దొంగతనంగా చూస్తూ పీపింగ్ టామ్ ఫోజులో ఒకటి.

అపర్ణా, అతడు నగ్నంగా రతికేళిలో వుండగా వివిధ కోణాల్లోంచి తీయబడ్డ ఫోటోలు కొన్ని.

వాటిని చూస్తుంటే అతడి గొంతులో తడి ఆరిపోయింది.

"ఇవి గాక మీ శృంగారమంతా వీడియో చిత్రంగా కూడా తీయబడింది. చూస్తారా ప్రొఫెసర్!"

"వద్దు!" అన్నాడతడు కంగారుగా.

'సంఘంలో పరువూ, మర్యాదగల ప్రొఫెసర్‌గా బ్రతికిన తను ఈ ఫోటోలతో పూర్తిగా అపహాస్యం పాలవుతాడు.

ఇలాంటి బజారు మనిషి వ్రాసిన పుస్తకానికి విలువేమిటని లోకం కోడై కూస్తుంది. కనీసం సి.బి.ఐ అలా కూసేలా చేస్తుంది.

దేశం వదలి పోవడానికి తనకు యెలాగూ అనుమతి లభించదు. అయితే జైలు, లేకుంటే ఈ అవమాన జీవితం' అతడు తన భవిష్యత్ ను సమీక్షించుకుంటున్నాడు.

"నేను.... నేను....ఏం చేయాలి?" అన్నాడతడు హీన స్వరంతో.

ఆ ఆఫీసరిద్దరూ చిన్నగా నవ్వారు.

'అతడిని చక్రబంధంలో ఇరికించి, ఇదీ నీ పరిస్థితి అని భయపెడితే. అతడు లొంగక తప్పదు. ఇప్పుడు యే నిబంధనలు చెప్పినా అతడు చచ్చినట్లు ఒప్పుకుంటాడు. అతన్ని ఆ స్థితికి రప్పించడమే సి బి ఐ. ప్రత్యేకత.'

"ప్రొఫెసర్! మీరా పుస్తకాన్ని పూర్తి చేసి పబ్లిష్ చేయాలి. అయితే అందులో ఇండో-చైనా ఈశాన్య సరిహద్దుల గురించి ఏం వ్రాయాలో మేం చెబుతాం. అది మీరు ఆ పుస్తకంలో యథాతథంగా వ్రాస్తున్నారు.

యిక మీరు అస్సాం నుండి భోపాల్ యూనివర్సిటీకి ట్రాన్స్‌ఫర్ చేయబడతారు. అయితే అనుక్షణం మీ కదలికలను గమనిస్తూనే వుంటాం. బీ కేర్ ఫుల్.

అయితే యింకొక్క మాట!

మీ బుక్ పబ్లిష్ అయి, ఐక్యరాజ్య సమితిలో ఈ ఈశాన్య సరిహద్దుల గురించి తీవ్రంగా చర్చించబడేంతవరకూ....అంటే సుమారు సంవత్సరం పట్టచ్చు. అంతవరకూ....

మీరు అండమాన్ జైలులోని మన ఖైదీల జీవితాలను అధ్యయనం చేయడానికి అండమాన్స్ పంపించబడతారు.

తప్పించుకు పోదామని ప్రయత్నిస్తే....ప్రాణానికే

మోసం వస్తుంది ప్రొఫెసర్!"

వారి మాటలను వింటూ అతడు నిర్వీర్యుడై పోయాడు శక్తిలేనట్లు నీరసంగా బెడ్ పై వ్రాలిపోయాడు.

అతనికి స్పష్టంగా తెలుస్తుంది ఒక్కటే. 'ఇప్పుడు తన బ్రతుకు తన చేతిలో లేదు. సి.బి.ఐ. దయాదాక్షిణ్యాలమీద వుంది. దేశద్రోహానికి ఇదే తగిన శిక్ష!'

తమ పని పూర్తయిందన్నట్లు ఆ ఆఫీసర్స్ ఇద్దరూ గది బయటకు నడిచారు.

# 11

బిగూ గుండెలకు రైఫిల్‌ను సూటిగా గురిపెట్టి, ఆ గార్డు ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తున్నాడు.

రెండు చేతులనూ పైకెత్తి నిశ్చేష్టుడై నిలబడి పోయాడు బిగూ. అతనికి ఏం చేయాలో తోచడంలేదు.

'తన ప్రాణాలను ఎలా రక్షించుకోవడమా' అని ఆలోచించటంలేదు అతను. అది పెద్ద సమస్యకాదని అతనికి తెలుసు అతడు కనుసైగ చేస్తే చాలు. పొదలలో దాక్కున్న అతడి అనుచరులు ఆ గార్డును అంతం చేస్తారు.

కాని ఈ మధ్యలో ఆ గార్డు తుపాకీని పేల్చాడంటే, ఆ గుండు తన గుండెకు తగలకపోయినా, ఆ తుపాకీ శబ్దం విని టవర్‌లోని గార్డ్స్ ఎలర్టు అవుతారు. ఎవరో శత్రువులు తమను ముట్టడించారని గ్రహిస్తారు. వెంటనే ఆ మెసేజ్‌ను హెడ్ క్వార్టర్స్‌కు పాస్ చేస్తారు.

ఏ మెసేజ్ పాస్ కాకూడదని తాము యింత రహస్యంగా, యిన్ని కష్టాలు కోర్చి, యింత పకడ్బందీగా ప్లాన్ చేశారో ఆ శ్రమ అంతా వృధా అవుతుంది.

అదీ అతడి ఆలోచన.

ఆ గార్డు నాలుగడుగుల దూరంలోనికి వచ్చేశాడు. ఇక ఆలోచించడానికి కూడా అతడికి వ్యవధి లేదు. ఏదో ఒకటి చేయాలి. అతడి మెదడు తీవ్రంగా పనిచేస్తూంది.

గార్డు కుడిచేతి చూపుడువేలు ట్రిగ్గర్ మీద బిగుసుకుంటుంది. క్లిక్ మని సేఫ్టీ కాచ్ తెరచుకున్న ధ్వని.

అప్పుడు గుర్తుకు వచ్చింది అతడికి ఆ కోడ్. చీకటిలో బాణంలా దానిని విసిరాడతను.

"ఆపరేషన్ క్రాస్ ఎమ్.ఎమ్.

అక్యుపేషన్ ఎ.పి ఎస్.వి."

ట్రిగ్గర్ నొక్కబోతున్న గార్డు ఆ మాటలకు ఉలిక్కిపడ్డాడు. అతని వంక ఆశ్చర్యంగా చూశాడు.

ఎదురుగా ఆటవికుని వేషంలో వున్న మనిషి. స్వచ్ఛమైన ఇంగ్లీషులో తన సీక్రెట్ కోడ్ ను చెబుతున్నాడు. అతడి చిన్న కళ్ళు అనుమానంతో చికిలించడంతో మరింత చిన్నవయ్యాయి.

"హూ ఆర్ యూ?" అన్నాడా గార్డు.

"ప్రొఫెసర్ మహంతో పంపగా వచ్చాను" అన్నాడు బిగూ ధైర్యంగా మూడడుగులు ముందుకు వేసి.

మహంతో పేరు చెప్పగానే ఆ గార్డు ముఖం వికసించింది. రైఫిల్ ను క్రిందకు దించి ఆదరంగా చేయిని చాపాడు.

అయితే అతను ఊహించినట్లుగా బిగూ అతడితో కరచాలనం చేయలేదు. అరచేతిని కత్తిలా బిగించి ఆ గార్డు మెడమీద కొట్టాడతడు.

క్షణంలో పదోవంతు కాలంలో అతని చేయి పైకి లేవడం ఆ గార్డు మెడమీద పడటం జరిగిపోయింది. కేవలం కరాటేలో బ్లాక్ బెల్టు వున్నవారు మాత్రమే

చేయగల ఫీట్ అది.

స్పృహతప్పి నేల వ్రాలిపోయిన గార్డు ను సూటును తీసి తాను ధరించాడు. చేతిలో రైఫిల్‌ను ధరించి మెల్లగా సిగ్నలింగ్ టవర్‌ను ఎక్కడం ప్రారంభించాడు.

అతడు మొదటి అంతస్తు చేరుకుని, చేసైగ చేయగానే బల్లుల్లా ప్రాకుతూ పైకి ఎక్కారు అతడి అనుచరులు.

రెండవ అంతస్తువరకు వారికెవరూ ఎదురుపడలేదు.

రెండవ అంతస్తు తలుపులు దగ్గరగా చేరవేసి వున్నాయి. కీ హోల్ నుండి లోపలకు చూశాడు అతడు.

# 12

ఎదురుగా వైర్‌లెస్ సెట్ ముందు ఇద్దరు వ్యక్తులు కూర్చుని వున్నారు. వారికి కొంతదూరంలో నలుగురు గార్డ్సు నిలబడి వున్నారు. ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు వారు.

అదృష్టం! ఆ సమయానికి వైర్‌లెస్ సెట్ ఆఫ్ చేసి వుంది. అతడు రైఫిల్‌ను గోడకు ఆన్చి పెట్టాడు. నడుముకు దోపుకున్న పిస్టల్ లాంటి పరికరాన్ని పైకితీశాడు.

అతని అనుచరుల చేతులలో కూడా అలాంటి ఆయుధాలు సిద్ధంగా వున్నాయి.

బిగూ వెనుతిరిగి తన అనుచరులను లెక్కించాడు.

మొత్తం పదకొండుమంది. తనతో కలిసి పన్నెండు. లోపల వున్నవారు ఆరుగురు. అంటే, ఒక్కొక్కడినీ తాము ఇద్దరు ఎటాక్ చేయవచ్చు.

అతడు తన అనుచరులకు ఏం చేయాలో సైగలతో చెప్పాడు. వారు రెండు జట్లుగా విడిపోయారు.

రెడీ....వన్....టూ....త్రీ....అంటూ లెక్కించాడు

అతడు. అంతే! భళ్లున తలుపులు తెరచుకొని మొదటి జట్టు ఆరుగురూ లోనికి ప్రవేశించారు.

తలుపులు శబ్దం కావడం, వారు లోనికి గెంతటం ఒకేసారి జరిగిపోయాయి. గదిలోని వారు ఉలిక్కిపడి వారివంక చూశారు. ఎదురుగా పిస్టల్స్ పట్టుకొని ఆరుగురు అపరిచిత వ్యక్తులు నిలబడి వున్నారు.

తలుపులు బార్లా తెరవబడటంతో గదిలోని వ్యక్తులు యెక్కడెక్కడున్నదీ గది బయటనున్న రెండవ జట్టులోని వ్యక్తులకు స్పష్టంగా కనిపిస్తుంది.

అందుకోసమే వారు రెండు జట్లుగా విడిపోయింది. మూసివున్న తలుపుల లోపలనున్న శత్రువుల పొజిషన్‌ను అంచనా వేయలేం కదా. దురదృష్టవశాత్తూ తమలో ఎవ్వరి గురితప్పినా, ఏ ఒక్క చైనా సైనికుడు సైరలెన్ సెట్‌ను ఆన్ చేసినా....తమ ప్లాన్ అంతా వృధా అవుతుంది.

రెండవ బ్యాచ్ ఒక్క గెంతులో గదిలోనికి ప్రవేశించి, సూటిగా చైనీయులకు తమ చేతులలోని ఆయుధాలను గురిపెట్టారు.

ట్రిగ్గర్ నొక్కినంతనే సన్నని గుండుసూదుల్లాంటివి 'ఝుంకారం చేస్తూ ఆ పిస్టల్స్‌నుండి వెలువడి చైనీయుల గొంతులను తాకాయి.

ఎ పెర్ఫెక్ట్ టార్గెటెడ్ షూటింగ్!

అవి మామూలు గుండుసూదులు కావు. పొటాషియమ్ సైనేడ్ పూయబడ్డ నీడిల్స్.

అవి తాకిన మరుక్షణం వారి పచ్చని శరీరాలు నల్లగా మాడిపోయాయి. వారి గొంతులనుండి బాధాకరమైన

కేక కూడా వినిపించలేదు. మొదలు నరికిన చెట్లలా వారు నేలమీదకు విరుచుకు పడిపోయారు.

అదే క్షణంలో ప్రాణం పోసుకున్నట్లు ఆ గదిలోని వైర్‌లెస్ సెట్ బీప్....బీప్ మంటూ పలుకసాగింది. వెంటనే బిగూ రిసీవర్‌ను అందుకొని తలకు తగిలించుకున్నాడు.

"ఆపరేషన్ క్రాస్ ఎమ్.ఎమ్."

అని వినిపించింది అతడికి. వెంటనే తడబడకుండా "అక్యుపేషన్ ఎ. పి. ఎస్. వి." అన్నాడు అతడు చైనీయుల గొంతును, ఉచ్చారణను అనుకరిస్తూ.

"ఈజ్ ఎవ్రీథింగ్ ఓకే!"

"య్యాస్....సర్!"

"ఎనీ....మోర్?"

"నో స్పెషల్ మెసేజ్ సర్. నార్మల్ సిట్యుయేషన్ ఓన్లీ."

అంతటితో ఆ సంభాషణ ఆగిపోయింది. అతడు తృప్తిగా నిట్టూర్చి రిసీవర్‌ను పెట్టేశాడు.

ఒక అనుచరుడ్ని పిలిచి, ఆ వైర్‌లెస్ సెట్ దగ్గర వుంచాడు. ప్రతి అరగంటకూ హెడ్‌క్వార్టర్స్‌కు రిపోర్ట్ చేయడమే అతడి పని.

కేవలం తెల్లవారు ఝామువరకూ ఆ పని చేస్తే చాలు. అంతవరకూ చైనా అధికారులకు ఆ మెసేజ్ అందకూడదు. అంతే!

బిగూ అనుచరులతో మూడవ అంతస్తును చేరుకున్నాడు. అది సిగ్నలింగ్ స్టేషన్. అందులో కేవలం ముగ్గురు మాత్రమే వున్నారు.

తలుపులు తోసుకుంటూ నిర్భయంగా వస్తున్న బిగూ

వంక వారు ఆశ్చర్యంగా చూశారు. వారు రైఫిల్స్‌ను అందుకొనేలోగానే సైనేడ్ నీడిల్స్ వారి గొంతులలో నుండి దూసుకుపోయాయి.

బిగూ సిగ్నలింగ్ టవర్ మీదనున్న సెర్చ్‌లైట్‌ను మూడుసార్లు వెలిగించి, ఆర్పాడు.

దాని అర్థం ఆ టవర్ వారి అధీనంలోనికి వచ్చిందన్న మాట.

సైనిక స్థావరంలోనున్న గోండ్ వృద్ధుడు ఆ సిగ్నల్‌ను చూసి తృప్తిగా తలాడించాడు. అప్పటికే వారు ఇచ్చిన మదిరను త్రాగి తెలివితప్పి పడిపోయారు ఆ స్థావరంలోని సైనికులు.

వారినందరినీ కాళ్ళూ చేతులూ బంధించి వారి ట్రక్‌ల లోకి వేశారు. వారి గుడారాలను, కంచెను పీకేసి ఆ సామానంతా ట్రక్‌లలో లోడ్ చేశారు.

ఆ తరువాత ఆ ట్రక్కులు నెమ్మదిగా షిల్లాంగ్ వైపు కదిలాయి. అక్కడినుండి సైనికులు మిలటరీ జైలుకు పంపబడతారు.

తెల్లవారుఝాము నాలుగు గంటలవేళ, సైర్‌లెన్ పెట్ దగ్గర వుంచిన బిగూ అనుచరుడుకూడా ఆ టవర్ నుండి బయటకు నడిచాడు.

సుమారు రెండు ఫర్లాంగుల దూరం వెళ్ళాక తన చేతిలోని చిన్న కాల్‌క్యులేటర్‌లాంటి దాన్ని నొక్కాడు.

అంతే! భూనభోంతరాళాలు బ్రద్దలయ్యేలా శబ్దం చేస్తూ అతడు పెట్టిన మినీ ఆటామిక్ బాంబు ప్రేలింది. సిగ్నలింగ్ టవర్, జనరేటర్ షెడ్, హెలీపాడ్.... అక్కడేమీ మిగలలేదు. కేవలం పెద్ద గొయ్యి మాత్రం మిగిలింది.

అక్కడ ఒక సైనిక స్థావరం వుండేదని ఎవరయినా చెప్పినా నమ్మలేం మనం!

ఆ శబ్దానికి తృళ్ళిపడి, పరుగెత్తుకుంటూ వచ్చారు జాతరలోని ఆటవికులు.

వారి కళ్ళ ఎదురుగా పెద్ద గొయ్యి మాత్రం కనిపిస్తూంది. ఇన్నాళ్ళూ వారిని పీడించిన నాగరికులుగాని వారి టెంట్ గాని....ఏవీ కనిపించలేదు.

గూడెం నాయకుడికి బిగూ మాటలు గుర్తుకు వచ్చాయి.

'కారు చీకటిలో, కారు ఎనుమును ఎక్కి కాల యముడిలా వస్తాడు టాండ్ బారో. శత్రువులను శిక్షించి, ఆశ్రితులను రక్షిస్తాడు.'

ఇదంతా టాండ్ బారో చలవే అనుకున్నాడతడు. భక్తితో శిరసు వంచి టాండ్ బారోకు నమస్కరించాడు.

అలా....ఆ గిరిజనులు నమ్మడమే సి.బి.ఐ.కి కావాల్సింది. అందుకే వారు అంత పటిష్టమైన ప్లాన్ వేశారు.

బిగూ ఉరఫ్ సి. బి. ఐ. ఏజెంట్ రాంకుమార్ తృప్తిగా తన అనుచరుడితో అస్సాం వైపు సాగిపోయాడు చివరి ట్రక్కులో.

—: అయిపోయింది :—

# రెండు చట్టాలు!

వసుంధర

డిటెక్టివ్ వెంకన్న మరోసారి ఆ ఉత్తరాన్ని శ్రద్ధగా చదివాడు.

"డియర్ రాజా!

సరిగ్గా నెలరోజులు గడువిస్తున్నాను. అంతే నీ జీవితం. వచ్చేనెల పదమూడవ తారీఖు మధ్యాహ్నం ఒంటి గంటకు నీ ప్రాణాలు పోతాయి. అంతవరకూ నిన్నేమీ చేయను. అప్పుడు నిన్ను వదిలిపెట్టను. ముందుగానే చెబుతున్నాను కాబట్టి నీ ప్రాణాలు దక్కించుకునేందుకు వృధా ప్రయత్నాలు చేసుకో. ఇది నా సవాలు + హెచ్చరిక!

నీ
శత్రువు."

వెంకన్న తలెత్తి ఎదురుగా వున్న వ్యక్తిని చూశాడు. అతడిది పాతికేళ్ళ వయసు. ఆడపిల్ల అందమున్న ఆ

ముఖంలో లేత మీసాలు తమాషాగా వున్నాయి.

అతడి ముఖంలో భయంకూడా వుంది.

"ఎవరు నీ శత్రువు?" అన్నాడు వెంకన్న.

"నాకు తెలిసి నా శత్రువొక్కడే....అతడి పేరు కరీం సాహెబ్—" అన్నాడా యువకుడు.

"కారీంసాహెబ్ అంటే?"

"మీకు తెలిసిన కరీం సాహెబే!"

వెంకన్న ఉలిక్కిపడ్డాడు.

స్మగ్లర్ కింగ్ కరీంసాహెబ్.

అనుకున్న పని అనుకున్న సమయానికి చేయడం కరీంసాహెబ్ ప్రత్యేకత.

"నీ వతడి అనుచరుడివా?"

"అనుచరుడినైతే శత్రువు నెందుకౌతాను?"

"కరీంసాహెబ్ వంటివారికి పోలీసుల్లో మిత్రులుంటారు. అనుచరులే శత్రువులౌతారు...."

ఆ యువకుడు క్షణం తటపటాయించి-"కాకినాడలో పదిలక్షల విలువచేసే బంగారం బిస్కట్లు పోలీసులు పట్టుకున్నారు. మీకు తెలుసుగదా!" అన్నాడు.

"ఊఁ."

"మండపేటలో నాలుగు కేజీల మారకద్రవ్యాలు పోలీసులు స్వాధీనపర్చుకున్నారు...."

"తెలుసు...."

"కాళీపేటలో నిర్బంధించబడ్డ నలుగురు యువతుల్ని పోలీసులు విడిపించారు...."

"ఇవన్నీ నాకెందుకు చెబుతున్నావు? శ్రీకాకుళంలో చేతులు మారుతున్న దొంగనోట్లనుకూడా పోలీసులు స్వాధీనం చేసుకున్నారని నాకు తెలుసు...."

ఆ యువకుడాశ్చర్యంగా-"దేశంలో ఇంకా చాలా నేరాలు జరుగుతూంటే మీరీ శ్రీకాకుళం విషయమే యెందుకు చెప్పారు?" అన్నాడు.

"అది నీ కనవసరం—" అన్నాడు వెంకన్న.

"ఈ నాలుగు నేరాలూ కరీంసాహెబ్‌కు సంబంధించినవి. అందుకే నేనాశ్చర్యపడ్డాను...." అన్నాడా యువకుడు.

వెంకన్న నవ్వి—"ఈ నాలుగూ కరీంసాహెబ్‌కు సంబంధించినవని నాకూ తెలుసు...." అన్నాడు.

"యూ ఆర్ జీనియస్....ఎలా తెలుసుకున్నారు?"

"నాలుగు నేరాలూ వివిధ ప్రాంతాలలో జరిగినా నిముషాలతోసహా ఒకే సమయంలో జరిగాయి. అది కరీం సాహెబ్ పద్ధతి. ఒకేసారి నాలుగైదు నేరాలు ప్లాన్ చేస్తాడు. అన్నీ ఒక పద్ధతిలో జరుగుతాయి...."

ఆ యువకుడాశ్చర్యంగా—"మీరు చెప్పింది రైటు" అన్నాడు.

"ఎలా తెలుసు నీకు?"

"నాకు కరీంసాహెబ్ తెలుసు!"

"అందుకే నీ వతడి అనుచరుడివా అనడిగాను..."

"కరీంసాహెబ్ యెవరో అతడి అనుచరులకు కూడా తెలియదు...."

వెంకన్న ఆశ్చర్యంగా—"మరి నీకెలా తెలుసు?" అన్నాడు.

"చిన్నతనంలో కరీంసాహెబ్ అనాథగా వున్నప్పుడు అమ్మ చేరదీసింది. అల్లరిచిల్లరిగా తిరుగుతూంటే అమ్మ తిట్టి కొట్టి మందలించేది. ఓసారి కోపం వచ్చి ఇంట్లోంచి పారిపోయాడు. అమ్మ పేపర్లో ఫోటో

చేయించింది. ఎవరో కరీంసాహెబ్‌ను తెచ్చి మా అమ్మ కప్పగించారు. అమ్మ అతణ్ణి దగ్గరగా తీసుకొని— నువ్వెప్పుడూ నన్ను వదిలిపోవు కదూ — అనడిగింది. కరీంసాహెబ్ ఒప్పుకున్నాడు....."

"నువ్వు చెబుతున్నది చాలా ఆశ్చర్యంగా వుంది. ఒక్క నిమిషం...." అని వెంకన్న తన అసిస్టెంట్ల వంక చూసి—"నోట్ చేసుకుంటున్నారా?" అన్నాడు.

సీతమ్మ, రాజమ్మ తలలూపారు.

"ఊఁ" అన్నాడు వెంకన్న.

ఆ యువకుడు కొనసాగించాడు.

ఆ యువకుడి తల్లి పేరు లక్ష్మి. ఆమెకు పిల్లలు లేరు. కరీంసాహెబ్‌ను ఆమె కన్నబిడ్డకుమించి ప్రేమించింది. అప్పట్లో అతడి పేరు సుందర్రావు.

కరీంసాహెబ్‌కు పన్నెండేళ్ళ వయసప్పుడు లక్ష్మి భర్త పోయాడు అప్పుడామె గర్భవతి. బంధువులు వచ్చి ఓదార్చారు. ఆఫీసునుండి రావలసిన డబ్బు విషయంలో మోసగించి వెళ్ళిపోయారు. లక్ష్మి చాలా ఇబ్బంది పడింది.

ఆమెకు మగబిడ్డ పుట్టాడు. రాజా అని పేరు పెట్టుకుందామె. ముప్ఫైఅయిదేళ్ళ వయసులో పుట్టిన ఆ బిడ్డ ఆమెకు ప్రాణంకంటే ఎక్కువ. కానీ వాడినెలా పెంచుతుంది? సుందర్రావు తల్లితో పెద్ద అబద్ధం చెప్పాడు. తనతో దయామయుడొకడున్నాడనీ అతడి దగ్గర తీరిక సమయంలో పనిచేస్తున్నానని చెప్పి తల్లికతడు డబ్బు తెచ్చిచ్చేవాడు. లక్ష్మి అవన్నీ నమ్మింది. సుందర్రావు నేరాలు చేసేవాడు. నేరాలు చాలా తెలివిగా ఎవరికీ పట్టుబడకుండా చేసేవాడు. అలాగే ఎలాగో మెట్రిక్

కూడా ప్యాసయ్యాడు. తర్వాత తనకుద్యోగం దొరికిందని అబద్ధం చెప్పి చదువు మానేశాడు.

నిప్పునూ, నేరాన్నీ కలకాలం దాచడం కష్టం.

లక్ష్మికి సుందర్రావుమీద అనుమానం వచ్చి, ఒకరోజు నిలదీసి అడిగింది. ఒట్టు వేయమనేసరికి సుందర్రావు నిజం ఒప్పుకున్నాడు.

లక్ష్మి అతణ్ని నేరాలు మానేయమంది. అప్పుడు రాజుకు ఆరేళ్ళు.

లక్ష్మినీ రాజునీ గొప్పవాళ్ళను చేయడానికి తను నేరాలు కొనసాగిస్తానన్నాడు సుందర్రావు. లక్ష్మి అతణ్ని ఇంట్లోంచి పొమ్మంది.

సుందర్రావు వెళ్ళిపోయాడు. నాలుగేళ్ళలాగో గడిచాయి.

లక్ష్మి బరువుగా జీవితం వెళ్ళబుచ్చుతోంది. కష్టపడి పనిచేసి కొడుకును గొప్పవాణ్ని చేయాలనుకుంటోంది. కానీ అది సాధ్యపడేలా కనబడ్డంలేదు.

అలాంటి సమయంలో ఒక దూరపు బంధువు లక్ష్మి దగ్గరకు వచ్చాడు. ఆయనకు అయినవాళ్ళెవరూ లేరు. బాగా డబ్బుంది. ఆశ్రయంకోసం వచ్చాడు.

లక్ష్మి జాతకం మారిపోయింది. రాజు అదృష్టం తిరిగింది.

దూరపు బంధువు ఆస్తిని రాజు పేరుమీద రాసి లక్ష్మిని సంరక్షకురాలిగా నియమించాడు. ఆయన లక్ష్మిని తరచు సుందర్రావు గురించి అడుగుతూండేవాడు. అతడి గురించి మంచిగా చెబుతూ ఆమె మనసును మార్చడానికి ప్రయత్నిస్తూండేవాడు. లక్ష్మి అంగీకరించేది. ఒకరోజున ఆమె "వాడికి నేనంటే అభిమానముందనుకోను, లేకుంటే

నన్ను వదిలి వెళ్లేవాడు కాదు. ఇప్పుడు నా వైభవంలో వాడూ పాలుపంచుకుంటే యెంతో సంతోషించేదాన్ని. వాడు తన మార్గాన్ని వదలలేక నన్నే వదలాలనుకున్నాడు—" అంది దూరపు బంధువుతో.

అప్పుడు దూరపు బంధువామెతో—"సుందర్రావుకు నువ్వంటే అభిమానముంది. తన మార్గం నచ్చదని నీ దగ్గరకు రావడంలేదు. నిన్ను సుఖంగా వుంచాలనే అతడు నాకీ ఆస్తిని కట్టబెట్టి నీ దగ్గరకు పంపాడు—" అంటూ అసలు సంగతి చెప్పాడు.

లక్ష్మి తెల్లబోయింది. ఆవేశంలో ఆ ఆస్తిని నిరసించాలనుకుంది. కొడుకు భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని ఆ పని చేయలేకపోయింది.

"నిజంగా నీకు వాడి వివరాలు తెలిస్తే నాకొకసారి కనిపించమను—" అందామె దూరపు బంధువుతో.

ఆ మర్నాడే సుందర్రావు లక్ష్మికి కనబడ్డాడు.

లక్ష్మి అతణ్ని నానామాటలూ అంది.

"అమ్మా! నాకు అడ్వెంచరస్ లైఫంటే యిష్టం. అనుక్షణం ప్రాణాలతో చెలగాటమాడుతూ బ్రతకడంలోనే నాకు థ్రిల్ వుంది. నా దారి గురించి నువ్వు పట్టించుకోకు. నేను నీకు దూరంగానే వుంటాను—" అన్నాడతడు.

"ఏం చేస్తున్నావు నువ్వు?" అంది లక్ష్మి.

సుందర్రావు చెప్పలేదు.

లక్ష్మి రెట్టించి అడిగింది.

"అవన్నీ నీకెందుకమ్మా?" అన్నాడతడు.

"ఎందుకంటే నువ్వు నరహంతకుడివి కాలేదని నాకు తెలియాలి—"

సుందర్రావు నవ్వి—"నరహంతకులంటే నీకెందుకంత ఆవేశం? మనదేశాన్నేలే చాలామంది నరహంతకులే! వాళ్ళను నీలాంటివాళ్ళే ఓట్లేసి ఎన్నుకుంటున్నారు!" అన్నాడు.

"వాళ్ళ నీ సంగతే రావాలి...." అంది లక్ష్మి.

"హత్య చేసినవాణ్ని ఉరితీస్తే అది హత్య అవుతుందా?"

"కాదు—" అంది లక్ష్మి.

"అయితే ఉరితీయబడ్డవాడు హంతకుడు కాకపోతే?"

లక్ష్మి సాలోచనగా—"ఏం చేస్తాం—చట్టానికి కళ్ళు లేవు...."

సుందర్రావదోలా నవ్వి—"కళ్ళులేని ఈ చట్టాన్ని మీరంతా యెందుకు గౌరవిస్తారో తెలియదు నాకు. నేను మాత్రం ఈ చట్టాన్ని నమ్మను. గౌరవించను. నా చట్టం వేరే వుంది. ఆ చట్టానికి కళ్ళున్నాయి...." అన్నాడు.

"అంటే?" అంది లక్ష్మి.

"నేను నరహంతకుడినా అని అడిగావు. నేరస్థుల ప్రాణాలుతీస్తే అది హత్యకాదని కూడా నువ్వే అన్నావు. నేను సామాన్యుల జోలికి వెళ్ళను. ఆత్మరక్షణకో, నేరాన్ని తొలగించడానికో శిక్షలు విధిస్తూంటాను. నా చట్టం వేరు...."

లక్ష్మి ఆశ్చర్యంగా—"ఏం చేస్తున్నావు నువ్వు?" అంది.

"నేను నీకు అన్నీ నిజాలు చెబుతాను. ఎందుకంటే కొడుకుగా నేను నిన్ను నమ్మాలి. నీకంటే నా కెంత గౌరవమో నీకు తెలియాలి. ఇది ఎవరికీ తెలియని గొప్ప

రహస్యం. ఇప్పుడు నా పేరు కరీంసాహెబ్....” అన్నాడు సుందర్రావు.

తెల్లబోయింది లక్ష్మి.

“అబద్ధం....” అందామె.

“రుజువులున్నాయి. నేను చేయబోయే ముఖ్యమైన నేరాలు కాస్త ముందుగా నీకు చెబుతూంటాను. నువ్వు విని ఊరుకోవాలంతే...” అన్నాడు సుందర్రావు.

లక్ష్మికి అతడు కొన్ని నేరాలు చెప్పాడు.

అన్నీ అతడు చెప్పినట్లే జరిగాయి.

లక్ష్మి అతడంటే భయపడింది. అతడి నేరాన్ని బయటపెడతానంది.

“ఎందుకు?” అన్నాడతడు.

“నువ్వు సంఘద్రోహివి—” అందామె.

“సంఘద్రోహులను పట్టుకోవడానికి పోలీసులున్నారు. అది నీ పనికాదు—” అన్నాడతడు.

“పోలీసులకు సాయపడడం నా బాధ్యత—” అందామె.

“నీ కొడుకును కాపాడుకోవడం నీ బాధ్యత కాదా?” అన్నాడతడు.

“ఎందుకు కాదు?”

“అయితే నువ్వే నీ కొడుకును కాపాడుకోవాలి. పోలీసులు రాజును కాపాడలేరు—” అన్నాడతడు.

లక్ష్మికి అర్థమయింది. సుందర్రావుకు తనంటే గౌరవం. కానీ తన్నుతాను రక్షించుకోవడంకోసం రాజుని చంపడానికతడు సిద్ధం.

కొడుకుకోసం ఆమె కరీంసాహెబ్ రహస్యం దాచింది.

"ఏ మనిషీ సంఘంకోసం స్వార్థాన్ని త్యాగం చేయ లేదు. ఒకవిధంగా నేను సంఘ ద్రోహిని. మరోవిధంగా నువ్వూనూ...." అన్నాడతను తల్లితో.

లక్ష్మి తను సంఘ ద్రోహి అయినందుకు బాధపడింది కానీ కొడుకు ప్రాణాల విషయంలో రిస్కు తీసుకోలేదు.

కరీంసాహెబ్ అప్పుడప్పుడు వచ్చి లక్ష్మిని కలుసు కునేవాడు. అతడి కారణంగా ఆమె, రాజా వైభవంగా జీవిస్తున్నారు. కరీంసాహెబ్ తన నేరాలను ముందుగానే ఆమెకు చెప్పి — తన గౌరవాన్ని వ్యక్తపరిచేవాడు. ఈలోగా ఆమె దూరపు బంధువు కాలం చేశాడు.

రాజు పెద్దవాడై బియ్యే ప్యాసయ్యాడు. తల్లి అతడి నుద్యోగం చేయమంది. రాజు ఇష్టపడలేదు.

కరీంసాహెబ్‌కు ఇది తెలిసింది.

"వాడికుద్యోగం చేయాల్సిన కర్మ పట్టలేదు—" అన్నాడతడు.

"ఇంతకాలం నేను వాడిని వాడి కాళ్ళమీద నిల బెట్టాలని చూస్తున్నాను—" అంది లక్ష్మి.

"ఎందుకు?" అన్నాడు కరీంసాహెబ్.

"నేను నమ్మే చట్టం సమ్మతించిన పద్ధతిలో వాడు డబ్బు సంపాదిస్తే—ఆ డబ్బుతోనే బ్రతకాలన్నది నా కోరిక...." అంది లక్ష్మి.

"మరి ఈ డబ్బేం చేస్తావు?"

"నీకే వదిలిపెడతాను...."

"నేను వద్దంటే!"

"అనాథశరణాలయానికి విరాళంగా యిచ్చేస్తాను."

కరీంసాహెబ్ ఆలోచించి—"అంతపని చేయకు.." అన్నాడు.

"చేస్తాను—" అంది లక్ష్మి.

"దీనికి నేనో ఉపాయం చెబుతాను—" అన్నాడు కరీంసాహెబ్.

ఆ ప్రకారం కరీంసాహెబ్ సాయంతో మరో ఊళ్ళో రాజుకుద్యోగం దొరికింది. లక్ష్మి అతడికదగ్గరే వెళ్ళింది. ప్రస్తుతముంటున్న ఇంటిని అద్దెకివ్వడం జరిగింది.

రాజు జీతం నెలకు ఎనిమిదివందల రూపాయలు. అందులో ఇంటద్దె రెండువందలరూపాయలు. మిగిలిన ఆరువందలతోటే అతడూ, తల్లీ బ్రతకాలి.

అంతకాలం వైభవంగా బ్రతికిన రాజుకి జీవితం నచ్చలేదు.

"మనకు బోలెడు ఆస్తి వుంటే దాన్ననుభవించకుండా ఈ రకం జీవితమెందుకు?" అన్నాడతడు తల్లితో.

"ఇది స్వయంకృషి—" అంది తల్లి.

"అమ్మా సుఖంగా బ్రతుకుదాం. దేవుడిచ్చిన ఆస్తి వుండగా వేరే స్వయంకృషి ఎందుకు?" అన్నాడు రాజు.

"అది దేవుడిచ్చిన ఆస్తి కాదు. దెయ్యమిచ్చింది—" అంది లక్ష్మి.

"అంటే?" అన్నాడు రాజు.

లక్ష్మి అతడికి కరీంసాహెబ్ వివరాలన్నీ చెప్పింది. తన ఆశయాలు చెప్పింది. రాజు తల్లికి నమస్కరించి—
"నేనుద్యోగంలో కొనసాగుతాను. దెయ్యమిచ్చిన ఆస్థిలో ఇక పైసాకూడా ముట్టను—" అన్నాడు.

లక్ష్మి సంతోషించింది.

కొన్నాళ్ళకు కరీంసాహెబ్ ఆమెను కలుసుకుని—
"ఏమంటున్నాడు నా తమ్ముడు? నచ్చిందీ జీవితమంటే సరే—లేదా హాయిగా నేనిచ్చే ఆస్తిననుభవించండి-"

అన్నాడు.

"రాజాకీ జీవితం వచ్చింది...." అంది లక్ష్మి. తను రాజాకు కరీంసాహెబ్ గురించి చెప్పినట్లుకూడా ఆమె చెప్పింది.

అతడు కంగారుపడి—"ఈ విషయం నీకూ నాకూ తప్ప మూడో వాడికి తెలియకూడదనుకున్నాను ...." అన్నాడు.

లక్ష్మి, రాజా, కరీంసాహెబ్—ముగ్గురూ మాట్లాడుకున్నారు.

రాజా కరీంసాహెబ్ బ్రతుకు బయట పెడతానన్నాడు.

లక్ష్మి రాజాతో—"నేను బ్రతికుండగా నువ్వాపని చేయడానికి వీల్లేదు—" అంది. ఆ ప్రకారం ఆమె రాజా చేత ఒట్టేయించుకుంది.

తల్లి ద్వారా కరీంసాహెబ్ ఘోరాలు రాజాకు తెలుస్తూండేవి. అతడి రక్తం ఉడికిపోతూండేది.

ఇలా వుండగా ఒకరోజున రాజా తల్లి మరణించింది.

కరీంసాహెబ్ రాజాకంటె ఎక్కువగా ఏడ్చాడా రోజు. లక్ష్మి అంత్యక్రియలు వైభవంగా జరిగాయి.

"నువ్వీ జీవితం మానేసెయ్. హాయిగా బ్రతుకు—" అన్నాడు కరీంసాహెబ్ రాజాతో.

"అమ్మ చచ్చిపోయింది. ఇంక నీ బ్రతుకు బయట పెడతాను—" అన్నాడు రాజా కరీంసాహెబ్‌తో.

"అమ్మ చచ్చిపోయింది కాబట్టి నేనూ నిన్ను వదలను. నా జోలికి వచ్చేవా — నువ్వుండవు...." అన్నాడు కరీంసాహెబ్.

రాజా వెంటనే సాహసించలేదు. కరీంసాహెబ్ బ్రతుకెలా బైటపెట్టాలా అని ఆలోచిస్తున్నాడతడు.

ఒకరోజున కరీంసాహెబ్ అతడివద్దకు వచ్చి-"అమ్మ నా గురించిన విశేషాలు డైరీలో రాసుకుంది. నేను చెప్పేవి, చెప్పినవి జరగడం వగైరాలన్నీ అమ్మ డైరీల్లో వుంటాయి. ఆ డైరీలన్నీ నాకు కావాలి...." అన్నాడు.

రాజు ఇవ్వనన్నాడు.

కరీంసాహెబ్ ఇల్లంతా వెతికాడు. దొరకలేదు.

"నిప్పుతో చెలగాటమాడకు. నాకా డైరీలు కావాలి. ఇవ్వకపోతే నీ ప్రాణాలు తీస్తాను—" అన్నాడు కరీం సాహెబ్.

అతడు రాజుకు వారంరోజులు టైమిచ్చాడు.

తల్లి డైరీ రాసుందనికూడా రాజుకు తెలియదు. ఇంట్లో యెంత వెదికినా ఆ డైరీలు దొరకలేదు. ఎక్కడుంటాయో అతడికి తెలియటలేదు. ఆ డైరీలుంటే కరీంసాహెబ్ బ్రతుకు బయటపెట్టడం సులభమవుతుందని అతడి ఆశ.

వారంరోజుల గడువూ అయిపోయింది.

రాజు కరీంసాహెబ్‌కు డైరీలు దొరకలేదని చెప్పాడు.

"నువ్వు నిజం చెబుతున్నావో, అబద్ధం చెబుతున్నావో నాకెలా తెలుస్తుంది? ఇందుకొక్కటే మార్గం. ఈ రోజు నీకు నాలుగు నేరాలు చెబుతాను. అవి నా కారణంగా నాలుగు ప్రాంతాల్లో జరుగుతాయి. వాటి గురించి సమాచారం పోలీసులకందకపోతే— నేను నిన్ను నమ్ముతాను...." అన్నాడు కరీంసాహెబ్.

"అందితే?" అన్నాడు రాజు.

"డైరీలడుగుతాను...."

రాజు సమాచారం పోలీసులకందించాడు. పోలీసులా నాలుగు నేరాలూ జరక్కుండా ఆపారు.

కరీంసాహెబ్ మండిపడుతూ వచ్చి రాజును డైరీ అడిగాడు.

"డైరీల సంగతి నాకు తెలియదు. తెలిస్తే ఈపాటికి వాటిని పోలీసుల పరం చేసేవాణ్ని-" అన్నాడు రాజా.

"నువ్వు నాకు మిత్రుడివి కాదు. శత్రువ్వి-" అన్నాడు కరీంసాహెబ్.

"నీకు నువ్వే శత్రువ్వి—" అన్నాడు రాజా.

"నువ్వలాగనుకున్నా సరే—ఇక మీదట నీ దృష్టిలో నా పేరు కరీంసాహెబ్ కాదు. శత్రువు ..." అన్నాడు కరీంసాహెబ్.

ఆ తర్వాత ఈ ఉత్తరం వచ్చింది.

ఆ యువకుడు కథ చెప్పడం పూర్తయింది.

"నీ కథ చాలా రసవత్తరంగా వుంది. నీకు కరీం సాహెబ్ మనిషికూడా తెలిసినపుడు పోలీసుల కతడి గురించి ఎందుకు చెప్పవు?" అన్నాడు వెంకన్న.

"కరీంసాహెబ్‌కు కాకినాడలో కర్రల అడితివుంది. అతడెంతో నిజాయితీపరుడు, మంచివాడుగా ఆ చుట్టు పక్కల పేరుపొందాడు. అతడికి సంబంధించి అంతకు మించి బుజావు చేయడం కష్టం—" అన్నాడు రాజా.

"అది పోలీసులు చూసుకుంటారు...." అన్నాడు వెంకన్న.

"తన గురించి అంతకుమించి తెలుసుకోవడం పోలీసుల వల్ల కాదని అతడన్నాడు. తనను నడిపించే శక్తివేరే ఉన్నదనీ—ఆ విషయంలో తను అసహాయుడిననీకూడా అతడన్నాడు ''

"ఇప్పుడు నీవు ప్రాణాల గురించి భయపడు

తున్నావా?"

"లేదు. కరీంసాహెబ్‌ను బైటపెట్టాలని నా కోరిక. అందుకు నేనేమైపోయినా ఫరవాలేదు. నేను నా ప్రాణాల గురించి భయపడడంలేదు. కానీ అవి వృథాగా పోకూడదని నా అభిలాష. నేనొక్కడినీ కరీ సాహెబ్ నెదిరిస్తే ప్రాణాలు పోవడం మినహా మరే ప్రయోజనమూ వుండదు...." అన్నాడు రాజా.

"నేనిప్పుడేం చేయాలి?"

"కరీ సాహెబ్‌ను బైటపెట్టండి...."

"బైటపెడితే?"

"నేను వాడని ఆస్తి నా పేరున వుంది. అందులోంచి మీరు కోరిన ఫీజివ్వగలను...." అన్నాడు రాజా.

"పాతిక వేల రూపాయలివ్వగలవా?"

"ఇవ్వగలను...." దృఢంగా అన్నాడు రాజా.

"అయితే సరే — కరీ సాహెబ్ వివరాలు నాక్కావాలి. నేనతన్ని స్వయంగా కలుసుకుని మాట్లాడుతాను" అన్నాడు వెంకన్న.

"వెంకన్నగారూ — మీ గురించి చాలా విన్నాను. ఈ విషయంలో మీరే నాకు సాయపడగలరు. కరీం సాహెబ్ నా జీవితానికింక ఇరవై ఎనిమిదిరోజులు గడువు మాత్రమే యిచ్చాడని మీరు గుర్తుంచుకోవాలి —" అన్నాడు రాజా.

"నేనేం గుర్తుంచుకోవాలో నాకు తెలుసు. నాక్కావలసిన వివరాలు చెప్పు —" అన్నాడు వెంకన్న.

అతడు చెప్పే వివరాలు శ్రద్ధగా నోట్ చేస్తున్నారు రాజమ్మ సీతమ్మ.

తర్వాత రాజా వెళ్ళిపోయాడు.

"కథ చాలా ఆసక్తికరంగా వుంది కదూ!" అన్నాడు వెంకన్న.

"అవును..."

"మరోక్కసారి ఆ కథ వింటాను...." అన్నాడు వెంకన్న.

సీతమ్మ, రాజమ్మ ఒక్కసారే మొదలు పెట్టారు.

"అలా కాదు. ఒక్కొక్కరు పదేసి వాక్యాల చొప్పున చదువుతూ వెళ్ళండి. ఒకరి తర్వాత ఒకరు...."

అనిపెంట్నిద్దరూ చదవడం ప్రారంభించారు.

ముందు సీతమ్మ, తర్వాత రాజమ్మ....

వాళ్ళు కథ చదువుతూంటే ఒకే సీరియల్ ను ఇద్దరు సమర్థవంతురాలైన రచయితలు ఒకరి తర్వాత ఒకరు కొనసాగిస్తున్నట్లుంది.

"ఏ మనిషీ సంఘంకోసం స్వార్థాన్ని త్యాగంచేయలేడు. ఒకవిధంగా నేను సంఘద్రోహిని. మరో విధంగా నువ్వూను...." అన్నాడు కరీంసాహెబ్ తల్లితో....

సీతమ్మ చదువుకుపోతూంటే — "ఆగు!" అన్నాడు వెంకన్న.

సీతమ్మ ఆగిపోయి అకడివంక ప్రశ్నార్థకంగా చూసింది.

"రాజమ్మా! అదేవిషయం నువ్వేం రాశావో చదువు" అన్నాడతడు.

ఆ మెకూడా అక్షరాలా అదే రాసింది.

"ఊఁ" అంటూ వెంకన్న ఆలోచనలో పడ్డాడు.

"బాస్ — ఏమిటాలోచిస్తున్నారు?" అంది సీతమ్మ.

"మన కేసు ఈ మాటల ఆధారంగానే ప్రాసీడవాలని నాకనిపిస్తోంది" అన్నాడు వెంకన్న.

"అదెలా బాస్?" అంది రాజమ్మ కుతూహలంగా.

"ఇంతకుమించి అడిగితే నా భార్యకే చెప్పను...." అన్నాడు వెంకన్న.

ఆ వెనువెంటనే బల్లమీద ఫోన్ మ్రోగింది. వెంకన్న పరధ్యానంగా ఫోన్ తీసి—"హలో!" అన్నాడు

"నేను....పద్మావతిని. వంటింట్లోంచి మాట్లాడుతున్నాను. ఒకసారి లోపలకు రండి—"

"ఎందుకు?"

"నాక్కూడా చెప్పనన్న ఆ విశేషమేమిటో చెప్పడానికి...."

వెంకన్న ఫోన్ పెట్టేసి లేచి నిలబడ్డాడు.

"గుడ్ లక్ బాస్!" అంటూ అసిస్టెంట్సిద్దరూ నవ్వారు.

తన ఫోన్ వాళ్ళు విన్నారని ముఖం చూసి తెలుసుకున్నాడు వెంకన్న.

## 2

కాకినాడ సూర్యారావు పేటలో ఉందా కర్రల అడితి.

ఓ పెద్ద పాక....పాకలో కట్టెలు బారులుగా పేర్చి వున్నాయి. ఓ మూలగా బొగ్గుల బస్తాలున్నాయి.

పాకముందు ఓ పెద్ద కొయ్య తక్కెడ వ్రేలాడుతోంది.

వెంకన్న అక్కడకు చేరుకునేసరికి—నలుగురు మనుషులు తక్కెడ చుట్టూ వున్నారు.

వారిలో ఒకడు కూలివాడు. ఒకడు కట్టెలు తూస్తున్నాడు.

మిగిలిన ఇద్దరిలో ఒకడు డబ్బిస్తున్నాడు. ఇంకొకడు

తీసుకుంటున్నాడు.

వెంకన్న డబ్బుతీసుకుంటున్నకణ్ణి సమీపించి—

"నేను సుందర్రావుకోసం వచ్చాను. మీరే కదూ!" అన్నాడు.

"ఊఁ" అని—"ఒక్క నిమిషం. మీరు లోపల కూర్చోండి—" అన్నాడు సుందర్రావు.

వెంకన్న పాకలోకి వెళ్ళాడు.

అక్కడ ఒక బల్ల. బల్ల వెనుక ఒక కొయ్యకుర్చీ బల్లముందు రెండు ఇనపకుర్చీలు. బల్లమీద గల్లాపెట్టె

వెంకన్న ఓ ఇనప కుర్చీలో కూర్చున్నాడు.

కాసేపటికి సుందర్రావు వచ్చి కొయ్య కుర్చీలో కూర్చుని తాళంచెవితో గల్లాపెట్టె తెరచి డబ్బు అందులో వేశాడు. మళ్ళీ గల్లాపెట్టె మూసి తాళం వేసి—తాళంచెవి చొక్కా జేబులో వేసుకున్నాడు.

ఆ కాసేపట్లో వెంకన్న గల్లాపెట్టెనీ, సుందర్రావునూ పరిశీలించేశాడు.

గల్లాపెట్టెలో మడతపెట్టిన కాగితాలు కొన్ని వున్నాయి. డబ్బేమో—కొన్ని పది, అయిదు, రెండు రూపాయలనోట్లు—కొంత చిల్లరా వున్నాయి.

సుందర్రావు ఖద్దరు పంచెమీద ఖద్దరు జుబ్బా వేసుకొని బాగా పూర్వకాలం మనిషిలా వున్నాడు.

"మిమ్మల్ని రాజు పంపించేడా?" అన్నాడు సుందర్రావు

"ఎలా ఊహించేరు?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యంగా.

"మీరు డిటెక్టివ్ వెంకన్న అని నాకు తెలుసు...."

వెంకన్న మాట్లాడకుండా అతడివంకే నిశితంగా

చూశాడు.

సుందర్రావు బయటకు చూస్తూ—"ఒరేయ్ వెంకన్నా రెండు టీలు తీసుకురా—" అన్నాడు.

వెంకన్న ఉలిక్కిపడి అటు చూశాడు.

అప్పుడు కాటాదగ్గర ఒకే మనిషి వున్నాడు.

మాసిన పంచి కట్టుకున్నాడు వాడు. వాడి పంచెకీ, ఒంటికీ బాగ్గులమనీ వుంది. సుందర్రావు మాటలు విని వాడక్కిణ్ణించి కదిలాడు.

సుందర్రావు వెంకన్నవైపు తిరిగి—"క్షమించాలి. నా పనివాడి పేరు వెంకన్న—" అన్నాడు.

"మీ పనివాడి పేరు వెంకన్నైతే నేను క్షమించడ మెందుకు?"

సుందర్రావు మాట్లాడలేదు.

"రోజూ మా యింటికొచ్చే అడుక్కునే వాడి పేరు సుందర్రావు. అందుకు నేను మీ క్షమాభిక్ష కోరలేను కదా!" అన్నాడు వెంకన్న.

సుందర్రావు నవ్వి—"మీరు మాటకు మాట చెప్పాలని అంటున్నారు కానీ — అడుక్కునేవాడికి సుందర్రావు లాంటి మంచి పేర్లుండవు కదా!" అన్నాడు.

"పేరెంత మంచిదైనా వెంకన్నముందు అంతా అడుక్కోవలపిన వాళ్ళే కదా!" అన్నాడు వెంకన్న.

సుందర్రావు ముఖం ఎర్రబడింది—"అంటే? మీరంత గొప్పవారా?"

"నేనంటున్నది తిరుపతి వెంకన్న గురించి...."

సుందర్రావేమీ అనలేక—"రాజు మీకు నేను కరీం సాహెబునని చెప్పి పంపివుంటాడు. ఇదీ నా జీవితం. చూశారుగా!" అన్నాడు.

"రాజా మీకు చెప్పిన మాటలే నాకు చెప్పాడు...."

సుందర్రావు నవ్వి—"రాజా ఊహాజీవి-" అన్నాడు.

"నేనూ ఊహాజీవినే!" అన్నాడు వెంకన్న—"ఉదాహరణకు నేను మీ ఖద్దరు లాల్చీలో బంగారపు దారాలు చూడగలను. గల్లా పెట్టెలో దేశానికి సంబంధించిన రహస్య పత్రాలను దర్శించగలను.."

"ఊఁ" అన్నాడు సుందర్రావు నవ్వుతూ.

"మీ కట్టెల్లో మాదకద్రవ్యాలు, బొగ్గుల్లో వజ్రాలు కనిపెట్టగలను...."

"యూ ఆర్ వెల్‌కం...."

"ఇంకా చెప్పడం అవలేదు...."

సుందర్రావు కుతూహలంగా వెంకన్నవంక చూశాడు.

"మీ పనివాడి పేరు వెంకన్న కాదు. నన్ను చిన్నబుచ్చాలని వాడినలా పిలిచారు...." అన్నాడు వెంకన్న.

సుందర్రావు ముఖం అవోలాగైపోయింది—"మీ తెలివిని నేను తక్కువ అంచనా వేశాను. మన్నించండి. మా పనివాడి పేరు సుబ్బన్న. నేను వాడినే పేరుతో పిలిచినా పలుకుతాడు...."

వెంకన్న యేదో అనబోయేసరికి సుబ్బన్న టీలు తీసుకొని వచ్చాడు.

ఇద్దరూ టీలు తాగారు.

"మనం మా యింటికి వెడదాం. ఇక్కడేమీ మాట్లాడుకోవద్దు...." అన్నాడు సుందర్రావు.

వెంకన్న తలాడించాడు.

సుబ్బన్న రిక్షా పిల్చుకుని వచ్చాడు.

ఇద్దరూ రిక్షాలో సుందర్రావింటికి వెళ్ళారు.

సుందర్రావుది పెంకుటిల్లు. లోపల నీటుగా వుంది.

అతడికి భార్య—ఇద్దరు బాయిలు.

ఇద్దరూ వీధిగదిలో కూర్చున్నారు.

"నేను కరీం సాహెబ్‌ను కాను. అది రాజా భ్రమ" అన్నాడు సుందర్రావు.

"అతడికా భ్రమ నెవరు కలిగించారు?"

సుందర్రావు మాట్లాడలేదు.

"ఈ ఊళ్ళో మీకు ముగ్గురు స్నేహితులున్నారు. ఒకడికి మూడు హోటల్సున్నాయి. రెండో అతడికి ఆయిల్ మిల్లుంది. మూడో అతడికి రెండు బట్టలకొట్లు, ఒక ఫ్యాన్సీ దుకాణం వున్నాయి...." అన్నాడు వెంకన్న.

"అయితే"

"వాళ్ళు మీ స్నేహితులు కాదనీ—అనుచరులనీ నేను ఋజువు చేయగలను...."

సుందర్రావులిక్కిపడి—"ఎలా?" అన్నాడు.

"నా పద్ధతులు నాకుంటాయి...."

"ఇంకా మీరేమి ఋజువు చేయగలరు?"

"మీ ముగ్గురు స్నేహితులూ మూడు తీగలు. ఆ తీగల్ని కదిపితే మూడు కాదు—ముప్ఫైడొంకలు కదుల్తాయి.." అన్నాడు వెంకన్న.

"నిజమే—తీగ కదిపితే డొంక కదిలిందన్న సామెత వుంది...."

"సామెతలు తెలుసుకుని లాభంలేదు. అర్థంచేసుకోవాలి..."

సుందర్రావు నవ్వి—"అర్థంచేసుకోవలసింది మీరు" అన్నాడు.

"అర్థంచేసుకున్నాను...."

"అర్థంచేసుకుంటే భయపడతారు...."

"భయం నా వృత్తికి విరుద్ధం...!"

"ఆటంబాంబు పేల్తుంటే అక్కడే నిలబడడం ధైర్యం అనిపించుకోదు—" అన్నాడు సుందర్రావు.

"మీరేం చెప్పదల్చుకున్నదీ సూటిగా చెప్పండి...."

"నా స్నేహితులు ముగ్గురూ మూడు తీగలన్నది నిజం. వాళ్ళను కదిపితే ముప్ఫైడొంకలు కదుల్తాయన్నదీ నిజం. కానీ ఆ డొంకలూ, తీగలూ నా దరిదాపుల కూడా రావు. నేనెప్పటిలాగే కట్టెల అడితి నడుపుకుంటూంటాను...."

"అయితేనేం — నీకు చేతులూ, కాళ్ళూ విరిగిపోతాయి...."

"మల్లె అంటుని దూసిపారేస్తే—అది కొత్త చిగుళ్ళు వేసి—మరింతగా పరిమళించే మల్లెల్ని పూస్తుంది—" అన్నాడు సుందర్రావు.

"అంటే?"

"మీరు తీగల్ని, డొంకల్ని పట్టుకుని లాభంలేదు. నావంటి వాళ్ళను నాశనంచేయాలి. అప్పుడే అనుకున్న పని సాధించగల్గుతారు. కానీ నావంటివాళ్ళను నాశనం చేయడం మీకు సాధ్యంకాదు...."

"ఎందుకని?"

"మీ ఋజువులు మీకే పనికొస్తాయి. పదిమంది ముందూ వుంచడానికి పనికిరావు...."

"ఏమిటి మీ ధైర్యం?"

"నా ధైర్యం నా చుట్టూ వున్న ప్రజలు. నేను నాశనంకావాలంటే వాళ్ళు మారాలి. వాళ్ళు మారరని నాకు తెలుసు."

"మీ ధైర్యం మిమ్మల్ని కాపాడదు...." అన్నాడు

వెంకన్న.

"మీరు నన్నేమీ చేయలేరు. నేను మళ్ళీ మళ్ళీ నా కార్యక్రమాలు కొనసాగించగలను. పునరుద్ధరించగలను."

వెంకన్న ఆలోచించసాగాడు.

"వెంకన్నగారూ! నేనూ ఈ సంఘంలో ముఖ్య భాగాన్ని. నన్ను కదిపితే సంఘం పునాదులు కదులాయి ..."

"మీలాంటి పునాదులను కదిపి—కొత్త పునాదులు వేయడంలోనే సంఘానికి ప్రగతి వుంది—" అన్నాడు వెంకన్న.

"అది మీవల్ల కాదు. ఎందుకంటే మీరు నాతో తలపడడంతోనే జీవితకాలం వృథా అవుతుంది. ఒకవేళ నన్ను మీరంతం చేశారనుకుందాం. అంతమాత్రాన కరీంసాహెబ్ అంతంకాడు. నేను కరీంసాహెబ్‌ను కాను. అతడి ముఖ్యానుచరుణ్ని ...."

"అంటే?"

"రాజకీయపరంగా ఈ దేశానికో ప్రధానమంత్రి, దేశంలోని ప్రతిరాష్ట్రానికీ ఓ ముఖ్యమంత్రి వున్నారు. ఇంకా రాష్ట్రాల్లో జిల్లాలు, తాలూకాలు ఉన్నాయి. ఇదేవిధంగా కరీంసాహెబ్ కూడా ఒక సామ్రాజ్యాన్నేలుతున్నాడు. అతడు ప్రధానమంత్రి అయితే నేనొక మామూలు సర్పంచిని. అంతే! తన సామ్రాజ్యం బాగోగులు చూసుకుంటూ అతడు యెన్నో ప్రణాళికలు వేస్తాడు. అంతర్జాతీయపర్యటనలు చేస్తాడు. అదలాగుంచండి ఒక మామూలు సర్పంచినే ఎదుర్కోలేనిమీరు—ప్రధానమంత్రి జోలికి వెళ్ళగలరా?"

వెంకన్న నవ్వి—"ఒకసారి రంగంలోకి దిగేక నేను

కొనక్కి తగ్గను. మిమ్మల్ని అంతంచేస్తే సంఘం పునాదులు కదిలినట్లే నేను రంగంలోకి దిగితే సామ్రాజ్యాల పునాదులే కదలవచ్చునేమో! ఎవరు చూడొచ్చారు....?" అన్నాడు.

"ఆలోచించండి. మీరు రంగంలోకి దిగిన దెందుకు? రాజాను రక్షించాలని. అతణ్ని రక్షించడానికి ప్రయత్నించండి...."

"రాజాను రక్షించాలంటే మీతో తలపడాలిగా?" సుందర్రావు బదులివ్వలేదు. అదోలా నవ్వాడు.

"రాజాను వదిలిపెడతానని మాటివ్వండి. నేనూ రంగంలోంచి తప్పుకుంటాను. నా క్లయింట్‌ను నేను రక్షించుకోవాలిగా!"

"రాజా నెలా వదిలిపెడతాను? అతడు నాకు ప్రమాదకారి. అమ్మరాసిన డైరీలను నాకు స్వాధీనం చేయడం లేదు...."

"అవి స్వాధీనంచేస్తే అతణ్ని వదిలిపెడతారా?"

"అతణ్ని వదిలిపెడితే కరీంసాహెబ్ నన్ను క్షమిస్తాడా అన్నదికూడా నేను చూసుకోవాలి...."

"అందుకు నేనేం చేయాలి?"

"నేనేమీ సలహా యివ్వలేను. ఆలోచించి మీ తెలివికి తోచినట్లు చేయండి .... రాజా రక్షించబడితే నాకూ యిష్టమే! అతడు నా తమ్ముడు...."

"నీ తమ్ముడికోసం నాతోపాటు నువ్వూ ఆలోచించలేవా?"

"మీ సామ్రాజ్యానికీ మా సామ్రాజ్యానికీ తేడా ఉంది. కరీంసాహెబ్ సామ్రాజ్యంలో చట్టం బలమైనది. వ్యక్తినిమించినది మా సామ్రాజ్యం. స్వార్థంకోసం

ద్రోహం చేయం. కరీంసాహెబ్ రాజా విషయం స్వయంగా చూసుకుంటున్నాడు. ఆ ఉత్తరం అతడే రాశాడు. ఒకసారి అతడు రంగంలోకి దిగేక — నేను రాజా గురించి ఆలోచించను కూడా ఆలోచించను. అది శిలాశాసనం.." అన్నాడు సుందర్రావు.

"అంటే నాకోసం, రాజుకోసం మీరేమీ చేయలేరు...."

"నాతో మాట్లాడడంవల్ల మీ సమయం వృథా. అప్పుడే రాజుమీద విషప్రయోగం ప్రారంభమైందని నా అభిప్రాయం...." అన్నాడు సుందర్రావు.

"విషప్రయోగమంటే?"

"వచ్చే నెల పదమూడవ తారీఖు మధ్యాహ్నం ఒంటిగంటకు రాజా ప్రాణాలు పోవాలి. అంటే కరీంసాహెబ్ అప్పటికప్పుడు వెళ్ళి అతణ్ని చంపుతాడనుకోను. ఇప్పట్నుంచీ విషప్రయోగం ప్రారంభమవుతుంది. సరిగ్గా ఆ సమయానికి ప్రాణంపోతుంది...."

వెంకన్న తెల్లబోయి లేచి నిలబడి—"వస్తాను...." అన్నాడు.

"మంచిది. మీకు శుభమూ, జయమూ కోరుకుంటున్నాను...." అన్నాడు సుందర్రావు నవ్వుతూ.

## 3

మేలిమి బంగారు ఛాయ.

ఆ ఛాయ స్పష్టంగా కనబడేటంత పల్చని చీర.

ఆమె శరీరాన్ని పురుష దృష్టికి అతీతంగా వుంచడంలో చీర విఫలమవుతుందని ముందే తెలిసి ముందు జాగ్రత్తగా కాపాడ్డానికి వచ్చిన వీరసైనికుల్లా వున్నాయి పెట్టీకోటు, జాకెట్టు....

ఆమె క్లబ్బు డ్యాన్సర్లా లేదు, కాల్ గర్ల్‌గాలా లేదు.

ఆమె పేరు సునీత.

సామాన్య మధ్యతరగతి యువతి ఆమె.

ఆమె ఎదురుగా రాజు వున్నాడు.

అది రాజు ఇల్లు కాదు.

ఒక హోటలు గది....

రాజామెనక్కడకు రమ్మన్నాడు. ఆమె వచ్చింది.

అతడు మంచంమీద కూర్చున్నాడు.

ఆమె ఎదురుగా నిలబడింది.

ఆమె ముఖంలో చిరునవ్వు....అతడి ముఖంలో కుతూహలం....

"సునీతా-నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?" అన్నాడతడు.

"నిజం సంగతి నాకు తెలియదు. ప్రేమ సంగతి తెలుసు—" అందామె.

సునీతకు తలిదండ్రులు లేరు. అన్నగారివద్ద వుంటోంది.

అన్నకు పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు. పెద్దవాడికి మూడేళ్ళు. రెండోవాడికి పదినెలలు.

సునీత అన్న మంచి ఉద్యోగంలో వున్నాడు. అందువల్ల అతడి జీవితం మధ్యతరగతికి ఓ మెట్టు పైనే వుంది.

సునీతకు మంచి సంబంధం చేయాలని అన్న అభిలాష.

సంబంధం చవకలో కుదరాలని వదిన పట్టుదల.

రెండింటికీ పొంతన కుదరడంలేదు.

వదినకు సునీతంటే ద్వేషంలేదు. భయముంది.

అలాగని ఆమె సునీతకు భయపడదు. సునీత పెళ్ళి భర్త సంపాదనను దోచేస్తుందేమోనని ఆమె భయం.

అందుకే....

ఆమె తను ఖరీదైన చీరలు కొనుక్కొని సునీతకు సాదా బట్టలు కొంటుంది. ఇంటిపని, పిల్లల పని అంతా సునీత చేతే చేయిస్తుంది.

“ఈ ఆట్టహాసం, ఈ వైభవం నావే కానీ నీవి కావు. ఆ విషయం నీకు వంటబట్టాలి. లేకుంటే నువ్వెక్కడా అడ్జస్టు కాలేవని నా భయం. నీ భావి జీవితానికిది శిక్షణ.” అనేది వదిన సునీతతో.

తన భావి జీవితానికది సూచనగా కనబడి సునీత భయపడేది. ఆమె మనసులో తను వదినకు మించి వైభవంగా జీవించాలని ఆశించేది.

ఈలోగా వారికి లక్ష్మి పరిచయమయింది.

రాజా సునీత వదినకు నచ్చాడు.

లక్ష్మికి సునీత నచ్చింది.

రాజా సునీతకు నచ్చాడు. కానీ అతడి ఆర్థికస్థితి నచ్చలేదు.

లక్ష్మి రాజును సునీతతో తిరగడానికి ప్రోత్సహించింది.

అవగాహన పేరిట యిద్దరూ కలిసి నదీతీరాల కబుర్లు చెప్పుకున్నారు.

రాజుకు సునీత అందం నచ్చింది. కానీ ఆమె ఆశయాలతణ్ణి భయపెట్టేవి.

తా కెలాంటి జీవితాన్ని కోరుకుంటున్నదీ సునీత అతడికి చెప్పింది.

అలాంటి వైభవాన్నతడు కలిగుండీ వదులుకున్నాడు.

సునీత రాజును తనకు విముఖుణ్ణి చేసుకోవాలని ఈ విషయం చెప్పలేదు. తెల్సుకుంటే యే మగాడైనా

డబ్బు సంపాదించగలడని ఆమె నమ్మకం. తన ప్రోత్సాహంతో అతడిలోని సంపాదనా శక్తిని వెలికితీయాలని ఆమె ప్రయత్నం.

ఆమె ప్రయత్నాలు రాజును భయపెట్టాయి.

తల్లితో ఆమె తనకు నచ్చలేదని అతడు చెప్పాడు.

లక్ష్మి అతణ్ని బలవంతపెట్టలేదు.

సునీత, రాజు కలుసుకోవడం బాగా తగ్గిపోయింది.

సునీత అన్న ఆమెకోసం సంబంధాలు చూస్తున్నాడు.

అతడికి పన్నెండేళ్ళ వయసులో పుట్టింది సునీత. ఆమెనతడు అపురూపంగా యెత్తుకుని మోశాడు. కన్నకూతురిమీదుండేటంత అభిమానమూ ఆమెకతడిపై వుంది.

చెల్లికోసం చచ్చు సంబంధాన్నతను తేలేడు.

అలాగని భార్య మాటలు కాదనలేదు.

ఈలోగా లక్ష్మి చచ్చిపోయింది.

ఇప్పుడు సునీత మరోసారి రాజును కలుసుకుని—

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను—" అంది.

రాజాశ్చర్యపడి—"ఎందుకు?" అన్నాడు.

"ఏమో—అది నాకు తెలియదు లక్ష్మి అత్తపోయిందనగానే నాకు నీ మీద జాలిపుట్టుకొస్తోంది. నిన్నోదార్చాలనిపిస్తోంది. ఇలా ఇకెవరి విషయంలోనూ అనిపించలేదు. అంటే నేను నిన్ను ప్రేమిస్తున్నానన్న మాట!"

"మరి నీ ఆశలు, ఆశయాలు వేరు...." అన్నాడు రాజా.

"అదంతా నా భ్రమ. నాకిప్పుడే ఆశలూ, ఆశయాలూ లేవు. నువ్వే నాకు నచ్చావు. మనం పెళ్ళిచేసుకుందాం—" అంది సునీత.

"వద్దు—సునీతా! నామీద జాలితో ఇప్పుడీ నిర్ణయం

తీసుకుంటున్నావు తప్ప నువ్వు నన్ను ప్రేమించడంలేదు. పుట్టుకతో వచ్చిన ఆశలు మధ్యలో పోవు. నాతో జీవితం కలకాలం ఇలాగే ఉంటుంది. వైభవంగా జీవించే వాళ్ళను చూసినప్పుడల్లా నీ మనసు చలిస్తూంటుంది. మన మధ్య కలతలు రేగుతాయి ..."

"రేగవు—...." అంది సునీత.

అతడెన్ని చెప్పినా ఆమె ఒప్పుకోలేదు.

"నీ కర్థం కావడంలేదు. మన పెళ్ళి మనకు సుఖాన్నివ్వదు—" అన్నాడతడు చివరికి.

"నాకిప్పుడర్థమయింది. నువ్వు నన్ను ప్రేమించడం లేదు...." అంది సునీత ఏడుపు గొంతుతో.

"నీవంటి అందగత్తెను ప్రేమించలేని మగాడుండడు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావంటే నేనే నిన్ను శంకించాలి...."

"ఎందుకని?"

"నీ ప్రేమకు నేను తగను .."

"అది నా కనిపించాలి. నువ్వెలా చెప్పగలవు? నేను నిజం చెబుతున్నాను. నిన్ను ప్రేమిస్తున్నాను—" అంది సునీత.

"అయితే ఒక పరీక్ష పెడతాను...." అన్నాడు రాజా.

సునీత ఒప్పుకుంది.

రాజా మెకు పల్చటి చీర కొనిచ్చి—అది కట్టుకుని తను చెప్పిన హోటలు గదికి రమ్మన్నాడు.

ఆమె వస్తుందని అతడనుకోలేదు. ఆమె నిజంగా వచ్చింది.

"సునీతా—నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?"

అన్నాడతడు.

"నిజం సంగతి నాకు తెలియదు. ప్రేమ సంగతి తెలుసు—" అందామె.

"నేనిక్కడ నిన్నేమైనా చేస్తే?"

"నా ప్రేమ నిన్ను నమ్ముతుంది—"

"నేను నిన్ను మోసం చేస్తే?"

"నా ప్రేమ నువ్వు నన్ను మోసం చేయలేవంటోంది."

"అయినా చేస్తే?"

"చెయ్యి చూద్దాం—" సవాలు విసిరినట్లుంది సునీత.

రాజా మంచంమీంచి లేచి నిలబడి ఆమెను సమీపించాడు.

మేలిమి బంగారు ఛాయ.

ఆ ఛాయ స్పష్టంగా కనబడేటంత పల్చని చీర.

ఆమె శరీరాన్ని పురుష దృష్టికి అతీతంగా వుంచడంలో చీర విఫలమవుతుందని ముందే తెలిసి ముందు జాగ్రత్తగా కాపాడ్డానికి వచ్చిన వీరసైనికుల్లా వున్నాయి పెట్టీకోటు, జాకెట్టు....

రాజా మెకు బాగా దగ్గరగా వెళ్ళాడు.

ఆమె ముఖంలో భయంలేదు.

మనిషిలో తడబాటులేదు.

అతణ్ని సవాలు చేస్తున్నట్లున్నాయామె చూపులు.

ఆ చూపుల్లో వేశ్య చిలిపితనంలేదు.

పతివ్రత పవిత్రత వుంది.

రాజా నిట్టూర్చి వెనక్కు వెళ్ళి మంచంమీద కూర్చున్నాడు.

"నీ గురించి నాకు తెలిసినంతగా నీక్కూడా తెలి

యను...." అంది సునీత విజయగర్వంతో.

రాజా మె వంకనే చూస్తూ—"ఏ మనిషి గురించైనా అతడికంటే ఇతరులకే ఎక్కువ తెలుస్తుంది-" అన్నాడు.

"కాబట్టి మనం పెళ్ళిచేసుకుందాం—" అంది సునీత.

"సునీతా! నీ గురించి నీకంటే నాకే ఎక్కువ తెలుసు...."

"అంటే?"

"నీ మనసునిండా డబ్బంటే ప్రేమ వుంది. నువ్వు నన్ను ప్రేమిస్తే అది తాత్కాలికం మాత్రమే!"

"అబద్ధం!"

"నిజమని ఋజువు చేయగలను...."

"ఎలా?"

"సునీతా—నా గురించి నీకు తెలియని విశేషాలు కొన్ని వున్నాయి...."

"ఏమిటవి?"

"నాకు డబ్బూ, వైభవం రెండూ వున్నాయి. అవంటే యిష్టంలేక నేనిలా వచ్చేశాను...."

సునీత తెల్లబోయింది.

"ఆ డబ్బంటే నాకిష్టంలేదు. దాన్నెలా వదుల్చుకోవాలా అని చూస్తున్నాను. అదంతా నీకిచ్చేస్తాను. నువ్వు నన్ను మర్చిపో...."

"ఎంతుంటుందేమిటా డబ్బు?"

"ఓ. పెద్ద బంగళా. ప్రస్తుతం దానిమీద నెలకు నాలుగు వేల రూపాయల అద్దె వస్తోంది. బ్యాంకులో డిపాజిట్ల రూపంలో అయిదులక్షలున్నాయి...."

సునీత తెల్లబోయి—"ఇది నిజమా?" అంది.

"నిజం. ఇప్పుడు నీకేమనిపిస్తోంది?"

"నీపై ప్రేమపుట్టడం నా అదృష్టమని!"

"ఏం చేసుకుంటావా డబ్బంతా?"

"సన్నిసడించిన నా కదినకంటె వైభవంగా జీవిస్తాను...."

"ఆ డబ్బు నీది. నీకిష్టమైన వారిని పెళ్ళిచేసుకో...."

"రాజా—నువ్వు నన్ను నమ్మడంలేదు. నేను నిన్ను నిజంగా ప్రేమిస్తున్నాను. నాకా డబ్బవసరం లేదు. నువ్వే కావాలి...."

"కొన్నాళ్ళపాటు ఆ వైభవం అనుభవించి అప్పుడు చెప్పు...."

"నాకా వైభవమే వద్దు...."

"వద్దంటే లాభంలేదు. కనీసం నీ ప్రేమను ఋజువు చేసుకునేందుకైనా ఇందుకు నువ్వంగీకరించాలి...."

చివరకు సునీత అంగీకరించింది.

"నీ అన్నయ్య నీకు చాలా పెళ్ళిసంబంధాలు చూస్తున్నాడు. వాటిలో నీకు నచ్చినదుంటే కట్నంగా ఎంత కావాలంటే అంతా తీసుకో. ఎందుకంటే ఈ ఆస్తిని నేను వచ్చేనెల పదమూడవ తేదీ మధ్యాహ్నం ఒంటిగంటవరకే నీ పరంచేస్తున్నాను. ఆ తర్వాత నీకది దక్కదు...."

"అంటే?"

రాజా మెకు ఓ కాగితం రాసిచ్చాడు. ఆ ప్రకారం అతడు చెప్పిన సమయం వరకూ ఆమె అతడి ఆస్తి వ్యవహారాలు చూసుకుంటుంది.

అతడామెకు బ్లాంక్ చెక్స్‌మీద సంతకాలు పెట్టిచ్చాడు.

"నేను మొత్తం డబ్బంతా తీసుకుని వెళ్ళిపోతే?"

"నువ్వు నన్ను నమ్మావు. నేను నిన్ను నమ్మలేద్దూ!" అన్నాడతడు.

## 4

"మీ కబురందింది—వెంటనే వచ్చాను...." అన్నాడు రాజా.

"మిష్టర్ రాజా! నేను నీ శత్రువుని కలుసుకుని వచ్చాను...." అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"అతణ్ని బాగా హెచ్చరించారా?"

"హెచ్చరించాను. కానీ అతడు భయపడలేదు...."

"నాకు తెలుసు. కరీంసాహెబ్‌కు భయంలేదు...."

"ఉత్తరం అందడానికి కొద్దిరోజులు ముందుకానీ వెనుకకానీ చెప్పుకోతగ్గ విశేషాలేమైనా జరిగాయేమో నువ్వు నాకు చెప్పాలి...." అన్నాడు వెంకన్న.

"ఏమీ లేవు...." అన్నాడు రాజా.

"బాగా ఆలోచించి చెప్పు. ఒకోసారి అతి సామాన్యంగా కనిపించే కొన్ని విశేషాలెంతో ముఖ్యమైనవై వుంటాయి..."

రాజాకు సునీత ప్రేమ గుర్తుకు వచ్చింది. అయితే అంతరంగిక విశేషాలనతడు వెంకన్నకు చెప్పకూడదనుకున్నాడు.

"ఏమీ లేవు...." అన్నాడతడు.

"ఒకోసారి నీకు తెలిసిన వ్యక్తే నిన్ను హత్య చేయవచ్చు. ఆ వ్యక్తి నీ శ్రేయోభిలాషి కావచ్చు. స్నేహితుడు కావచ్చు. ప్రియురాలు కావచ్చు. గడువు సమయం వరకూ నువ్వు చాలా జాగ్రత్తగావుండాలి...." అన్నాడు వెంకన్న.

"వెంకన్నగారూ—నాకు భయంలేదు. జరిగేది జరక్క

మానదు....”

“నువ్వు నాకు సాయపడితే జరిగేది జరక్కుండా ఆపుతాను—....” అన్నాడు వెంకన్న.

“నా ప్రాణాలు నిలబెట్టాలనుకుంటున్న మీకు నేనెలాగైనా సాయపడగలను....” అన్నాడు రాజా.

“అయితే నేను చెప్పేది శ్రద్ధగా విను. ఇక్కడ నా మిత్రుడు డాక్టర్ రంగరాజున్నాడు. ప్రతిరోజూ అతడి చేత వైద్యపరీక్ష చేయించుకో. అనుమానాస్పదమైన ప్రాంతాలకు వెళ్ళకు. ముఖ్యంగా భోజనం విషయంలో జాగ్రత్తగా వుండు. ఎక్కడపడితే అక్కడ తినకు. ఆఖరికి మంచినీళ్ళ విషయంలోకూడా! ఎందుకంటే నీకు స్లో పాయిజనింగయ్యే అవకాశముంది....” అన్నాడు వెంకన్న.

“మీరు చెప్పినవన్నీ పాటిస్తాను—” అన్నాడు రాజా.

“మరోసారి గుర్తుచేసుకో.... ఉత్తరం రావడానికి ముందుగానీ వెనుకగానీ—విశేషాలేమైనా జరిగాయా?” అన్నాడు వెంకన్న.

అప్పుడు కూడా రాజా వెంకన్నకు సునీతగురించి చెప్ప లేదు.

## 5

రాజా ఒంటరిగా నదీతీరంలో కూర్చున్నాడు.

దూరంగా కారొకటి ఆగింది. అందులోంచి దిగివచ్చింది సునీత—అతడి దగ్గరగా!

రాజా తలెత్తి ఆమెను చూసి—“నువ్వా?” అన్నాడాశ్చర్యంగా.

“మీకోసం ఎక్కడెక్కడని తిరిగానో చెప్పలేను”

అంది సునీత. ఆమె కనులలో సంతోషముంది.

"ఎలా వుంది జీవితం?"

"రాజా— ఐ థాంక్యూ వెరీమచ్ .... ఇలాంటి వైభవాన్ని నేను కలలోకూడా ఊహించలేదు." అందామె.

"అయితే యింకేం— త్వరగా నన్ను మోసం చేసి— ఆ వైభవాన్ని నీ స్వంతం చేసుకో. ఈరోజింకా మూడో తారీఖు. ఇంక నీకు పదిరోజులు గడువుంది...."

"రాజా— నాకు నువ్వూ కావాలి. నీ వైభవమూ కావాలి...."

"అది కుదరదు..."

"ప్లీజ్ .... రాజా! మనం పెళ్ళి చేసుకుందాం...."

"నాకంటే మంచివాణ్ణి గొప్పవాణ్ణి పెళ్ళి చేసుకో...."

"అలాగనకు రాజా .... నేను నిన్నే ప్రేమిస్తున్నాను...."

"నన్ను ప్రేమిస్తే నాకులా జీవించాలి. ఈ వైభవం నీకు దూరమవుతుంది."

"ఎందుకు దూరమవుతుంది? నేను నిన్నూ, నీ వైభవాన్నికూడా స్వంతం చేసుకోగలను...."

రాజు సూటిగా ఆమె కనులలోకి చూసి— "నేను— నా వైభవం .... ఈ రెంటిలో ఒకటి వదులుకోక తప్పదంటే నువ్వేం చేస్తావ్?" అన్నాడు.

"వైభవాన్ని వదులుకుంటాను...."

"ఎందుకని?"

'నేను నిన్ను ప్రేమిస్తున్నాను...."

"ఇదేమాట పదమూడో తారీఖున చెప్పు. చాలా సంతోషిస్తాను...." అన్నాడు రాజు.

"పదమూడో తారీఖు సెంకర్మ—జీవితమంతా చెబుతూనే వుంటాను...."

"అలాంటప్పుడు నా వైభవం గురించి ఎందుకాశపడుతున్నావు?"

"నాకు వైభవంమీద మోజుంది. నీవంటే ప్రేముంది. ఆ ప్రేమ నీతో కలిసి వైభవంగా జీవించమంటోంది. ఆ వైభవాన్ని నువ్వు నిరసిస్తూంటే అదే ప్రేమ నా కోర్కెలను త్యాగం చేయమంటోంది...."

"అంటే?"

"నీతో కలిసి జీవిస్తే నాకు సంతోషం. నీతో కలిసి వైభవంగా జీవిస్తే నాకింకా సంతోషం. వైభవం లేకపోవడంవల్ల నా సంతోషం తగ్గవచ్చు. కానీ నీతో కలిసి జీవించడంలోనే నా సంతోషముంది...." అంది సునీత.

రాజా సునీత వంకే చూస్తున్నాడు.

ఆమె కనులతడికి నిజం చెబుతున్నాయి.

## 6

"మిస్టర్ రాజా — సునీత యెవరు?" అన్నాడు వెంకన్న.

"సునీత—మీకెలా తెలుసు?"

"ఆమె నిన్న కార్లో యీ వూరొచ్చింది. తన అన్నను కలుసుకుంది. ఆ తర్వాత నిన్ను కలుసుకుంది. ఆమె యింట్లో ఎవరూ—సునీత గురించి సరిగా చెప్పడంలేదు. ఆమెకింకా పెళ్ళికాలేదు. వీధిలో వాకబు చేయగా ఆమె గురించి కొన్ని వివరాలు తెలిశాయి. ఆమెకూ నీకూ పెళ్ళవుతుందన్నారు. కాలేదు. కట్నమిచ్చుకోలేని స్థితిలో వున్నాడామె అన్న. మంచి సంబంధం కావాలి ఇప్పుడామె మరో వూళ్ళో నీ ఆస్తికి వారసురాలిగా ఉం

టోంది. ఏమిటిదంతా?"

"వెంకన్నగారూ—ఇది పూర్తిగా నా వ్యక్తిగత విషయం...."

"డిటెక్టివుల దగ్గర వ్యక్తిగత విషయాలు దాచిపెడితే వ్యక్తికి గతమేకానీ వర్తమానముండదు—...." అన్నాడు వెంకన్న గంభీరంగా.

అప్పుడు రాజు వెంకన్నకు సునీత గురించి పూర్తి వివరాలు చెప్పాడు.

వెంకన్న కంగారుగా—"సునీత గురించి ఇంతవరకూ నాకెందుకు చెప్పలేదు?" అన్నాడు.

రాజు నవ్వి "వెంకన్నగారూ! సునీత నన్ను చంపుతుందనుకుంటున్నారా?" అన్నాడు.

"ఎవరెవరిని చంపుతారో తెలియదు. ఇలాంటి సమయాల్లో యెవరినీ ఉపేక్షించకూడదు...." అన్నాడు వెంకన్న.

"సునీత నన్ను చంపాలనుకుంటే — నా జీవితమే వ్యర్థం ...ఆమెకోసమే నాకు జీవితమంటే మోజు పుడుతోంది...." అన్నాడు రాజు.

"సునీత మధ్యతరగతి అమ్మాయి. అన్నావదినెలవద్ద వుంటోంది. ఇప్పుడు పొరుగూరికి మారింది. అందుకామె యింట్లో ఎందుకభ్యంతరపెట్టలేదు? పెళ్ళికానిపిల్లనలా ఒంటరిగా వారెందుకుండనిస్తున్నారు? ఆమె గురించి వాకబుచేస్తూంటే ఇంట్లో సరైన వివరాలివ్వరేం? అంటే సునీతకూ, ఆమె అన్నావదినెలకూ వెనుక ఎవరో శక్తి వున్నాడు. వారిని భయపెడుతున్నాడు. ఉన్నట్లుండి సునీత నీమీద మోజు చూపించడానికి కారణం....ఆ వ్యక్తి ప్రోత్సాహమేనని నా అనుమానం. ఆ వ్యక్తి

కరీంసాహెబ్ కావచ్చు...." అన్నాడు వెంకన్న.

రాజు ఆలోచనలోపడ్డాడు.

"నువ్వు సునీతకు దూరంగా వుండడం ఎంతైనా అవసరం!" అన్నాడు వెంకన్న హెచ్చరికగా.

"సునీత విషయంలో మీ హెచ్చరిక పాటించలేను వెంకన్నగారూ! నాకున్న కాస్త జీవితం — ఆమెకు దూరంగా గడపలేను...." అన్నాడు రాజు.

వెంకన్న రాజుకు చాలా చెప్పిచూశాడు. ప్రయోజనం కనపడలేదు.

## 7

"సుందర్రావుగారూ! రాజుకు ఏం జరిగినా నేను సహించను. సంఘం పునాదులు కదిపేస్తాను-" అన్నాడు వెంకన్న ఆవేశంగా.

సుందర్రావతడి వంక ఆశ్చర్యంగా చూసి-"మీ కావేశం తక్కువని విన్నాను. రాజు మీ కేమౌతాడని ఇంత ఆవేశం మీకు?" అన్నాడు.

"అతడమాయకుడు. అతడిపై మీరు సునీత అనే అమ్మాయిని ప్రయోగించారు. ఆమెను ధన ప్రలోభానికి గురిచేశారు. రాజిప్పుడామె మత్తులో వున్నాడు. ఆమె తనను ప్రేమించిందని నమ్ముతున్నాడు. ఆమెకోసం నాబోటి శ్రేయోభిలాషుల హెచ్చరికలనుకూడా లక్ష్య పెట్టడంలేదు—...."

"వెంకన్నగారూ — రాజు చావక తప్పదు. ఇది కరీంసాహెబ్ నిర్ణయం..."

"ఫలితంగా కరీం సాహెబే నిర్ణయాలు తీసుకునేందుకు మిగలకుండాపోతే?" అన్నాడు వెంకన్న.

సుందర్రావదోలా వెంకన్న వంక చూసి—"రాజుకు

చావు తప్పదు. మీరు చేతులు ముడుచుకుని కూర్చోవడమూ తప్పదు—...." అన్నాడు.

"చట్టానికి వ్యతిరేకంగా పనిచేసే ఏ శక్తినీ నేను సహించను!" అన్నాడు వెంకన్న.

సుందర్రావు ముఖం ఎర్రబడింది—"వెంకన్న గారూ! ఏది చట్టం? అమాయకులను మాయమాటలతో బుట్టలో వేసుకుని ప్రజానాయకులై మంది బలంతో కొందరు అవినీతిపరులు, అవకాశవాదులు నిర్ణయించిన దాన్ని మీరు చట్టమంటున్నారు ఆ చట్టం గొప్పదైతే కరీంసాహెబ్ చట్టమూ గొప్పదే!"

"సామాన్యుడి దైనందిన జీవితంలో యిబ్బందులు సృష్టించే ఏ చట్టమూ గొప్పది కాలేదు" అన్నాడు వెంకన్న.

"సామాన్యుడి దైనందిన జీవితంలో ఇబ్బందులు సృష్టించేది మీరు నమ్మే చట్టమే కానీ—మా చట్టం కాదు..." అన్నాడు సుందర్రావు.

వెంకన్న అక్కణ్నించి కదిలాడు. కదిలేముందు మరో సారి—"రాజా ప్రాణాలమీద కరీంసాహెబ్ భవివ్యత్తాధారపడి వున్నదని వెంకన్న హెచ్చరించినట్లు మీరతడికి తెలియచేయడం మంచిది—" అని సుందర్రావు చెప్పాడు.

సుందర్రావు నిర్లక్ష్యంగా నవ్వాడు.

## 8

పదమూడవ తేదీ.

మధ్యాహ్నం ఒంటిగంట....

వెంకన్న అసహనంగా పచార్లు చేస్తున్నాడు—ఇంట్లో.

ఎక్కడా రాజా జాడలేదు. అతడు, సునీత ఎవరికీ

చెప్పకుండా మాయమయ్యారు.

టైము రెండయింది.

బల్లమీద ఫోన్ మ్రోగింది.

"హలో!" అన్నాడు వెంకన్న ఆత్రుతగా.

"వెంకన్నగారూ! నేను రాజును మాట్లాడుతున్నాను. నేను బ్రతికేవున్నాను. నాకూ, సునీతకూ రిజిస్ట్రారాఫీసులో పెళ్ళయిందీరోజునే. ఎవరికీ చెప్పలేదు. ఎవరినీ ఆహ్వానించలేదు. సాక్షి సంతకానికి రిజిస్ట్రార్ ఏర్పాటు చేశాడు. నేను మిమ్మల్ని స్వయంగా కలుసుకుని ఫీజు ఇచ్చుకుంటాను. మీవల్లనే నా ప్రాణాలు కాపాడబడ్డాయి...."

వెంకన్న ఇంకా యేదో అనబోయాడు. అవతల క్లిక్ మంది.

"రాజు ఎలా రక్షించబడ్డాడు?" వెంకన్న ఆలోచిస్తున్నాడు.

అతనింకా ఆలోచనలో వుండగానే బల్లమీద ఫోన్ మ్రోగింది. వెంకన్న రిసీవర్ తీశాడు.

"హలో! వెంకన్నగారేనా— నేను.... సుందర్రావుని. లక్ష్మీరాజుకోసం కరీంసాహెబ్ విషయంలో నోరు విప్పలేదు. ఇప్పుడు రాజు సునీతకోసం జీవించాలనుకుంటున్నాడు. అతడికి బ్రతుకుపై ఆశపుట్టింది. బ్రతుకుపై ఆశ వున్నవాడెవ్వడూ కరీంసాహెబ్ జోలికి రాడు. మీరందరూ నమ్మే చట్టాన్ని నమ్మే రాజు చచ్చిపోయి వల్లే కదా! సామాన్యుడికి కష్టం కలిగించని మా చట్టాన్ని నమ్మే నేను — రాజుపట్ల కృతజ్ఞతాభావంతో అతణ్ని రక్షించడానికే సునీతను ప్రయోగించాను. సునీత కళ్ళి

గించిన ప్రేమ, త్యాగాల భ్రమలో అతను తన ఆశయాలను మార్చుకుని సుఖంగా జీవించగలడు. కాబట్టి మీరుకూడా కరీంసాహెబ్ గురించి మర్చిపోండి....”

వెంకన్న ఏదో అనబోయేలోగా అవతల క్లిక్‌మంది.

వెంకన్న ఆలోచిస్తున్నాడు— రెండు చట్టాల్లో యే చట్టం రాజుకెక్కువ న్యాయం చేకూర్చింది అని!

—: అయిపోయింది :—

# అష్టావధానం

కె.బి.యస్. కుమార్

ద్రౌపది మార్కండేయ శర్మ పేరు విననివారు సాహిత్యంలోగాని లలితకళల్లోగాని కనీసం ప్రవేశం కూడ కలిగినవారు కాదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

మార్కండేయశర్మ అష్టావధాని.

లలితకళల్లో కవిత్వం మొట్టమొదటిగా చెప్పుకో దగ్గది. సాహితీ విలువలు పుష్కలంగా కలిగున్నదే అష్టావధానం.

అష్టావధానం అంటే యెనిమిది విషయాల్లో ఏకాగ్రత కలిగుండటం అని అర్థం. ఎనిమిని విషయాల్లో ఏకాగ్రత కలిగినవాడు కాబట్టి అష్టావధానంచేసే వ్యక్తిని 'అష్టావధాని' అంటారు.

అష్టావధానికి ఏకాగ్రత, సమయస్ఫూర్తి, సాహితీ పరిజ్ఞానం, చాతుర్యం-నాలుగు ఆభరణాలుగా వుండాలి. వీటిలో ఏది లోపించినా అతను అష్టావధానిగా రాణించ లేడు.

మార్కండేయశర్మ యిప్పటికే రాష్ట్రంలోని పలు చోట్ల వందకు పైగా కార్యక్రమాలిచ్చాడు. ప్రతిచోటా ప్రశంసలందుకున్నాడు.

సాహిత్యానికి సంబంధించిన యే గోష్ఠి జరిగినా, యే సదస్సు జరిగినా ఎక్కడ కవి సమ్మేళనం జరిగినా చివరగా దత్తపది మార్కండేయశర్మ అష్టావధానంతో అది ముగియాలి.

అప్పుడే ప్రేక్షకులు చివరి వరకూ కూచుంటారు.

యివాల్టి కార్యక్రమంకూడా అదే!!

"క్రయిమ్ గ్లామర్" డిటెక్టివ్ సాహితీ వినీలాకాశంలో ఇటీవలే వెలసిన మరో తార. ప్రారంభ సంచిక వెలసిన నాలుగు మాసాల్లోనే ఆర్థికంగానూ సామాజికంగానూ బాగా నిలద్రొక్కుకుంది.

ఉగాది పండగ ఒక మాస ముందనగా 'క్రయిమ్ గ్లామర్' ఎడిటర్‌కి క్రొత్త పద్ధతిలో తన పత్రిక తరఫున మార్కండేయశర్మ అష్టావధానం ఏర్పాటు చెయ్యాలన్న సంకల్పం కలిగింది.

వెంటనే స్వయంగా వెళ్ళి కలుసుకొని, మాట్లాడి డేట్ ఫిక్స్ చేయించుకున్నాడు. అప్పటికి 'క్రయిమ్ గ్లామర్' అయిదవ సంచిక ప్రింటింగ్‌లో వుంది. విడుదలయ్యే నాటికి అందులో 'క్రయిమ్ గ్లామర్‌తో అష్టావధానం' అన్న ప్రకటనతో మేటర్ బాక్స్-కట్టబడి—ప్రచురించబడింది.

• • •

సభాస్థలి రంగుబట్టల్తో అట్టహాసంగా వెలిగిపోతోంది.

క్రయిమ్ గ్లామర్ 'తో' అష్టావధానం యేమిటా అన్న ఉత్కంఠతతో పండితులూ పామరులేకాక క్రయిమ్ రచ

యితలూ రచయిత్రులూ క్రయిమ్‌గ్లామర్ మరియు ఇతర డిటెక్టివ్ మాసపత్రికల పాఠకులూ చందాదారులూ తండోపతండాలుగా రవీంద్రభారతికి తరలివచ్చారు.

కార్యక్రమానికి ప్రముఖ డిటెక్టివ్ మాసపత్రిక 'అపస' ఎడిటర్ రెడ్డిగారు అధ్యక్షులుగా, ప్రముఖ డిటెక్టివ్ శ్రీ జలంధర్ ముఖ్య అతిథిగా ఆహ్వానింపబడి వేదిక నలంకరించారు.

ప్రముఖ గాయని, వర్ధమాన రచయిత్రి కుమారి యామిని ప్రార్థనానంతరం అధ్యక్షుని తొలిపలుకులు: శ్రీ రెడ్డి చేశారు.

"....సాహిత్యం మనిషిని సంతోష పెడుతుంది. ఉత్తేజితుణ్ని చేస్తుంది. విజ్ఞానసంపదని అందిస్తుంది. ఏ విషయమైనా సాహిత్యం జతకలిపితే త్వరగా అవగాహన కలుగుతుంది. వ్యాకరణాన్ని నేరుగా చదవటానికి ఆసక్తి కనబరచని పాఠకుడు సైతం — అదే వ్యాకరణాన్ని చక్కని సాహిత్యంలో పొదిగి అందించగలిగితే — ఉత్సాహంగా చదవటాని కుబలాట పడతాడు.

"....ఈనాటి కార్యక్రమం ఉగాది సందర్భంగా యేర్పాటు చెయ్యబడినా ఓ క్రయిమ్ పత్రిక ఆధ్వర్యంలో నిర్వహించబడటం, ఇందులోని అంశాలుకూడ క్రయిమ్‌కి సంబంధించినవే అయ్యుండటం విశేష మేకాదు; ముదావహం కూడ.

"ఈ సందర్భంగా మిత్రుడు, క్రయిమ్‌గ్లామర్ సంపాదకుడు అయిన శ్రీ కందుకూరి జయరామరాజా నభినందిస్తున్నాను.

"....మాసపత్రిక స్థాపనే సాహసకార్యం. అందునా క్రయిమ్ పత్రికైతే మరీను! ఎందుకంటే ఇందులోని

సాధక బాధకాలు నాకు బాగా తెలుసు. అయినా చలించకుండా ఒక విధంగా తెగువతనంతో ఈ సాహస కార్యాన్ని చేపట్టి, సఫలీకృతుడైన మిత్రుడు 'రాజు'ని మనసారా అభినందిస్తున్నాను. మంచి క్రయిమ్ సాహిత్యాన్నందిస్తూ 'క్రయిమ్‌గ్లామర్' మాసపత్రిక అచిర కాలంలోనే కీర్తి శిఖరాల్ని అధిరోహించాలని ఆకాంక్షిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను...."

సభలో చప్పట్లు మారుమ్రోగాయి.

తర్వాత ముఖ్య అతిథి తొలిపలుకులు:

డిటెక్టివ్ జలంధర్ లేచాడు.

"....లలితకళల్లో సాహిత్యానికి తొలిస్థానమున్నట్టే సాహిత్యంలో అష్టావదానానికి తొలిస్థానముంది. సాహితీ విలువల్ని సమగ్రంగా కలిగున్నదే అష్టావధానం!

"ఇది అష్టావధానమే కాదు. ఒకరకంగా అష్టావదానమే! అష్టావదానమంటే ఎనిమిది విషయాల్లో ఏకాగ్రత కలిగుండటం అయితే 'అష్టావదానం' అంటే ఎనిమిదిమంది చేత చంపబడటం అన్నమాట! అంటే ఎనిమిదిమంది పృచ్ఛకులు కల్సి సాహిత్యాన్ని ఎనిమిది రకాల ఆయుధాలుగా పంచుకొని అష్టావధానిపై దాడిచేస్తారు. కోర్టులో పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కీ, డిఫెన్స్ లాయర్‌కీ మధ్య జరిగే పోరాటంలాంటిదే యిది కూడ!!

"ఆ దాడిని ఎదుర్కోవాలి అష్టావధాని, విజయం సాధించాలి.

"అష్టావధానిగా శ్రీ శర్మ విజయాలు నేను పలుమార్లు పత్రికల్లో చూశాను. ప్రత్యక్షంగా చూడటం ఇదే తొలిసారి. అందుకవకాశం కల్పించిన క్రయిమ్ గ్లామర్ యాజమాన్యం వారికి ధన్యవాదాలు తెలియ

చేస్తూ ఇంతటితో ముగిస్తున్నాను...."

సభ మరోసారి మార్మ్రోగింది.

చేతులు జోడించి సభకి నమస్కారం చేస్తూ లేచాడు అష్టావధాని.

వయసు ముప్పయ్యో అయిదుకి మించి వుండవు. అజాను బాహువు, స్ఫురద్రూపని చూడగానే తెల్సిపోతుంది. సాహితీ విజ్ఞానల్ని పుష్కలంగా కలిగున్న అతని వదనం వర్చస్సుతో వెలిగిపోతోంది. చురుకైన కళ్ళు అతనికున్న విజ్ఞానసంపదని మరింతగా ప్రస్ఫుటం చేస్తున్నాయి.

అందమైన నల్లని నొక్కుల జుత్తు. ఎప్పుడూ తెల్లని ప్యాంటు, తెల్లని ఫుల్ షర్టులో వుండే అతడు ఈనాడు తెల్లని గ్లాస్కో పంచె, తెల్లని లాల్చీలో మరింత అందంగా, హుందాగా అగుపిస్తున్నాడు.

సభలో సూదిపడితే వినిపించేంతటి నిశ్శబ్దం ఆవరించుకుంది. అష్టావధాని కంచుకంఠం ఖంగున పలికింది:

" సాహితీమాత పుత్రునిగా నన్నభిమానించి ఆదరిస్తోన్న సోదరులందరికీ నా ధన్యవాదాలు.... 'రసో వై సః' అన్నది వేదవాక్యం. రసమే భగవంతుడు అని దానర్థం. అందులో కవిత్వం కళాసర్వస్వం. విశ్వస్రోతస్విని సమ్యక్సంగమం ఈ కవిత్వమే!

"అందుకే సహజ పాండిత్య బిరుదాంకితుడూ భక్తిమయూగుడూ అయిన బమ్మెర పోతన సరస్వతిని పటుత్వ మహత్వ కవిత్వము నే ఇమ్మని ప్రార్థించి, సరస్వతికీ, సారస్వతానికీ సమైక్యం సుదృఢపరిచాడు. ఆనాటి కవితా సారస్వతం కాలక్రమేణా వివిధ సోయగాల్ని సంతరించుకుంటూ ప్రబంధ కాలానికి యౌవ్వనవతియై. ఆధునిక

కాలంలో 'అవధాన ప్రక్రియ'గా రూపొంది, రసజ్ఞులకే కాక సర్వజనులకూ ఆదరణార్హమైంది.

"అష్టావధానం 'మనస్వి'కి అనిర్వచనీయానందాన్ని, 'తపస్వి'కి ఆత్మానందాన్ని, 'జిజ్ఞాసువు'కి ఉత్సాహాన్ని అందిస్తుంది. ఒక్కసారి ఈ ప్రక్రియను అలవోకగా గమనించినా ఆకర్షింపబడక మానదు.

"ఇలాంటి అవధాన ప్రక్రియలో అవధానితోబాటు మరి ఎనిమిదిమంది భాగం పంచుకుంటారు. ఈ ఎనిమిది మందినీ 'పృచ్ఛకులు' అంటారు. అంటే 'ప్రశ్నించేవారు' అని అర్థం. అష్టావధానంలోని ఎనిమిది అంశాలకీ వీరు అధిపతులుగా వుండి, అవధానిని నడిపిస్తారు.

"ఆ అంశాలేమిటో—వాటి నిర్వాహకులెవరో—మీకందిన కరపత్రాలు చదివిన మీరు తెల్సుకొని వుంటారు. మరికొన్ని క్షణాలు మీరు దయతో సావధానంగా వుండి అష్టావధానంగా ప్రారంభమయ్యే వా అవధానాన్ని కళాహృదయంతో ఆవధరించవలసిందిగా విన్నవిస్తున్నాను...."

సభలో కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి.

## 2

గడ్డం క్రింద చెయ్యాన్చుకొని ఆలోచిస్తోంది కమలిని. నిన్నటి అష్టావధానంతో తన భర్త మరో మెట్టు పైకెక్కాడు.

కళ అనేది ఒక వరం. అది అందరికీ అబ్బేదికాదు. పూర్వజన్మ సుకృతం అది. కళాకారుడు కావటం తన భర్త పూర్వజన్మ సుకృతం అయితే ఆయనకి భార్య కావటం తన పూర్వజన్మ సుకృతం!

....నగరంలో ఎన్నిసార్లు తన భర్త అష్టావధాన కార్యక్రమాలు జరిగినా తనూ హాజరవుతూ వచ్చింది. కాని నిన్నటి కార్యక్రమం వాటన్నిటికీ భిన్నంగా కొంగ్రొత్త ధోరణిలో మొదలై దిగ్విజయంగా ముగిసింది.

ఉగాదినాడు హాస్యాలూ మరణాలూ మొదలైన అంశాలతో కార్యక్రమం నడిచిందన్న అసంతృప్తి కొద్దిగా వున్నా అది లెక్కలోనికి రాని విషయం.

ఎందుకంటే అందరికీ నిన్న ఉగాదైతే తమకిమాత్రం యివాళ!!

కారణం యివాళ తమ పెళ్ళిరోజు!!

మామూలుగా అయితే ప్రతి సంవత్సరం మేరేజ్ ఏనివర్సరిరోజు యిద్దరూ శెలవుపెట్టి యింటి దగ్గర ఆనందంగా గడపాల్సిన రోజు! కాని వారికి కాలేజీలో పనుండటంతో లీవ్ పెట్టలేకపోయారు.

తనూ ఇంట్లో వుండి చేసేదేమీలేక—కాలేజీకి వచ్చేసింది.

వారు గవర్న మెంట్ ఆర్ట్స్ కాలేజీలో లెక్చరరు.

తను వుమెన్స్ కాలేజీలో లెక్చరరు.

ఇంకా సంతానం కాలేదు. ఇప్పుడప్పుడే కావాలనుకో లేదు కూడ!

....టైము చూసుకుంది కమలిని. సాయంత్రం నాలుగు కావస్తోంది. పర్మిషను తీసుకొని వచ్చేస్తానన్నారాయన. ఎందుకు రాలేదు??

ఫోన్ చేద్దామని లేచింది.

ఎదురొచ్చాడు అటెండర్ రామయ్య.

"అయ్యగారొచ్చారా తాతా?" అడిగింది.

భోరుమన్నాడు రామయ్య.

విషయం విని కెవ్వున కేక వేసింది కమలిని.

* * *

అదిరిపడ్డాడు డిటెక్టివ్ జలంధర్.

"వాట్.... చక్రవర్తీ!! ఏ.... ఏమిటి నువ్వంటున్నది?" జలంధర్ నమ్మలేకపోతున్నాడు. చక్రవర్తి జోక్ చేస్తోంటే ఎంత బావుణ్ను అనుకున్నాడు. జారిపడబోతున్న రిసీవర్ని అదిమి పట్టుకున్నాడు.

"....అవును. దత్తపది మార్కండేయ శర్మ హత్య చెయ్యబడ్డాడు...." అవతల్నుండి బాధగా చెప్పాడు క్రయింబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ చక్రవర్తి.

"మై గాడ్! యిది.... వూహించని వార్త. జరగరాని సంఘటన!!"

"త్వరగా ఆనందనగర్ కాలనీ సెవెన్ రోడ్స్ సెంటర్‌కి వెంటనే బైలుదేరి రా." అవతల క్లిక్‌మంది.

జలంధర్ మెదడు మొద్దుబారిపోయింది. నిన్న రవీంద్ర భారతిలో అతని అష్టావధానం, ఆ కరతాళ ధ్వనులు ఇంకా తన హృదయఫలకం నుండి చెదిరిపోలేదు. చెవుల్లో గింగురుమంటూనే వున్నాయి. ఇంతలోనే ఎంతటి దుర్వార్త!?

అప్రయత్నంగా అతని కళ్ళనుండి రెండు అశ్రుబిందువులు నెమ్మదిగా నేలరాలాయి.

భారంగా అడుగులేస్తూ డాడ్జికారు వైపు కదిలాడు.

పదినిమిషాల్లో స్పాట్ చేరుకున్నాడు.

సెవెన్ రోడ్స్ సెంటరు జనంతో క్రిక్కిరిసిపోయి వుంది. డాడ్జిని చూడగానే పోలీసులు మరింత కర్కశంగా గుంపుని చెదరగొట్టి జలంధర్‌కి దారిచ్చారు.

ఆ దృశ్యాన్ని చూశాక అప్రయత్నంగా కళ్ళు మూసుకున్నాడు జలంధర్.

ఎన్నో వేదికలెక్కి, అద్భుతమైన శైలిలో కార్యక్రమాలిచ్చి ఠీవిగా దిగిపోయిన ఆ పాదాలు, ఎన్నో పూలమాలల్ని కప్పుకున్న ఆ విశాలమైన ఛాతి. ఎన్నో శాలువాలని కప్పుకున్న ఆ భుజాలు, ప్రతి కార్యక్రమం సందర్భంగానూ లెక్కలేనన్ని కుసుమ హారాల్ని భారంగా మోసే ఆ మెడా అచేతనంగా వున్నాయి. సాహితీ రంగానికే మణిభూషణంగా భాసించిన అతని మెదడు - తలని చీల్చుకొని బైటికివచ్చి—మట్టిని పులుముకుంది. ఎంతో స్ఫూర్తితో ఒంటినిండా పరుగులు పెడుతూ ప్రేక్షకులకి రసస్ఫూర్తిని కలిగించటానికి దోహదంచేసే ఆ ఎర్రని రక్తం—మట్టిలో కల్సి నల్లగా మారిపోయింది.

తన స్కూటర్ కి పదిగజాల దూరంలో పడివుంది శర్మ శవం.

శవం ప్రక్కనే ఓ స్త్రీమూర్తి—జుత్తు పీక్కుని పిచ్చిదాన్లా వుంది. ఆమె కన్నుల్లో కోపం రుద్రతాండవం చేస్తోంది.

"మీరు మనుషులా పశువులా? చూడండి. చెయ్యి పట్టుకొని చూడండి. నాడి ఇంకా కొట్టుకుంటూనే వుంది. ఆయనింకా బ్రతికే వున్నారు. తప్పుకోండి. ఆయనకి ఊపిరాడనివ్వండి. ఏదైనా టాక్సీ పిలవండి. ఆస్పత్రికి తీసికెడదాం...." కీచుగొంతుతో గట్టిగా కేకలు పెడుతోంది.

ఆమె కమలిని.

జలంధర్ కన్నుల్లో నీళ్ళు చిప్పిల్లాయి. దీనంగా ఆమెకేసి చూశాడు. ఆ క్షణంలో తన వృత్తినే మర్చి

పోయాడాయన. ఆమె ననునయించటంకోసం ఆమెవేపు పడుగులు వేశాడు.

"ప్లావ్ డేర్!!" గట్టిగా అరిచిందామె. "నాకేమైందని నావద్దకొస్తున్నారు? ఆయన్ని చూడండి. లేపండి టాక్సీ పిలవండి...."

బాధనంతా ఒక్క గుటకలో మింగేసి కళ్ళు తుడుచుకున్నాడు జలంధర్.

ఆమె చెప్పినట్టు చెయ్యకపోతే ఆమెకూడ దక్కేలా లేదు. రానురాను రద్దీ ఎక్కువవుతోంది. శవాన్ని యింకాసేపు యిక్కడే వుంచినా ఆమె మానసిక పరిస్థితి దారుణంగా పరిణమించే ప్రమాదముంది.

డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ చక్రవర్తివేపు నడిచాడు జలంధర్.

## 4

"అమ్మగారూ! వ్యానుకోసం ఫోనుచేశాం, మీవార్ని ఆస్పత్రికి తీసుకుపోవటంకోసం" అన్నాడు సార్జంటు సారంగధర.

కమలిని మొహంలో సంతోషం కన్పించింది.

"నిజమా! థాంక్స్, థాంక్స్ ఎ లాట్."

"దయచేసి మీరో అయిదునిమిషాలపాటు కాస్త ప్రక్కకి నిల్చుంటే...."

"ఎందుకూ?"

"అయ్యగారికి జరిగింది ఏక్సిడెంటు కదా! కొన్ని ఫోటోలు తీసుకోవాలి. ఫింగర్ ప్రింట్స్ ఎక్స్పర్టునీ ఫోటోగ్రాఫర్నీ పోలీస్ డాక్టర్నీ కబురుపెట్టాం. వాళ్ళొచ్చాక అదే వ్యానులో ఆస్పత్రికి తీసుకెళ్దాం.."

"అలాగే. అలాగే. త్వరగా కానివ్వండి" ప్రక్కకి

తప్పుతుందామె.

అదే సమయంలో చక్రవర్తితో జలంధర్ మాట్లాడుతున్నాడు.

దాదాపు అరగంట క్రితం చక్రవర్తి స్టేషన్‌లో కూచుని పాత కేసుకి సంబంధించిన ఫైలుని తిరగేస్తుండగా టెలిఫోను మోగింది. ఇక్కడ ఏక్సిడెంటు జరిగిందనీ హంతుడెవరో తెలీదనీ అందులోని సారాంశం. సత్యం శివం సుందరాలకి కబురుపెట్టి హుటాహుటిన బైలుదేరాడు.

సెవన్ రోడ్స్ సెంటర్‌ని క్రాస్ చేస్తూ వుమెన్స్ కాలేజీవైపు వెడుతోండగా మరోవైపునుండి నెంబర్ ప్లేటులేని కారొకటి శర్మ స్కూటర్ని గుద్దేసింది. ఆ జర్క్‌కి అతడు స్కూటర్ మీదినుంచి ఎగిరి అక్కడే వున్న ఓ కిళ్ళీ దుకాణం తాలూకు మెట్టు (step) మూలకి పడ్డాడు. హెల్మెట్ లేని అతని తల సరిగ్గా మెట్టుకి తగిలింది. వెంటనే తల పగిలింది. ఒక చిన్న వికృతమైన కేక మాత్రం వెలువడిందతని పెదవులనుండి.

జనం ఆ దిగ్భ్రాంతినుండి తేలుకొనేలోగానే ఆ కారు అదృశ్యమైపోయింది. కారు డ్రయివర్ని ఎవ్వరూ గుర్తించలేకపోయారు.

ఇదంతా చెప్పి, "శవం చూస్తే ఆ భంగిమలో పడివుంది. కారు మాడబోతే అదృశ్యమైంది. టైరు గుర్తులూ వగైరాలు—గుంపులుగా జనం మూగటంతో వెంటనే చెరిగిపోయాయి. పోనీ స్పాట్‌కి కాస్త అవతల గుర్తులున్నాయా చూసుకుందామనుకుంటే—ట్రాఫిక్కి అంతరాయం కలిగి అన్ని వేపులనుండీ వాహనాలొచ్చి టైరు ముద్రల్ని గందరగోళం చేశాయి.

"కేవలం నంబరు ప్లేటులేని కారు కుదుర్చుకోవటం, ఆ తర్వాత పలాయన మంత్రం పఠించటంతో జరిగింది హత్య అని అనుమానించాను. లేకపోతే ఏక్సిడెంటనుకోవలసిందే కదా!

"అనుమానించటానికి ఆధారాల్లేవు. ప్రశ్నించటానికి మిసెస్ శర్మ మన లోకంలో లేదు. ఏమీ తోచక ఫోను ఎత్తి 'అప్తంఘా! నమోనమః' అన్నాను. ఇక నువ్వే చూడాల్సిందే గురూ!" అన్నాడు చక్రవర్తి జలంధర్ చేతులు పట్టుకొని.

ఇంతలో పోలీసు వ్యాను వచ్చింది. ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్ట్స్ సత్యం, ఫొటోగ్రాఫర్ శివం, పోలీస్ డాక్టర్ సుందరం దిగారు.

అందరూ శవం కేసి నడిచారు.

## 5

డిటెక్టివ్ జ ల ం ధ ర్ ఆలోచనలకి అంతరాయం కలిగిస్తూ లీలగా యేదో కోలాహలం వినిపించి క్రమంగా పెద్దదైంది. కాసేపయ్యాక కాలింగ్ బెల్ మోగింది.

విసుక్కుంటూ తలుపు తెర్చి ఆశ్చర్యపోయాడు జలంధర్.

వాహిని!

జన వాహిని!!

అందరూ విద్యార్థులే! కనీసం పదిహేను శాతం విద్యార్థునలున్నారు!!

"శర్మగారిని చంపిన హంతకుణ్ణి..."

"....వురి తియ్యాలి!"

"దౌర్జన్యం...."

"....నశించాలి!!"

"మారణహోమం ...."

"అరికట్టబడాలి!!"

"విద్యార్థి యూనియన్ ...."

"జిందాబాద్ !!"

"డిటెక్టివ్ జలంధర్ హంతకుణ్ని వెంటనే...."

" ...పట్టుకోవాలి!!!"

నినాదాలు! ఈలలు!! అరుపులు!!! కేకలు!? దుర్భరమైన గోల!!!

గోలని ఆపమన్నట్టు చేత్తో సైగచేశాడు జలంధర్. సద్దుమణగడానికి అయిదు నిమిషాలు పట్టింది.

"మీకంతా నాయకులెవరు?"

"మాకు శ్రీకాంత్. వాళ్ళకి సుజాత!!"

"సరే. వాళ్ళిద్దర్నీ లోపలకి పంపండి. దయచేసి పది నిమిషాలు నిశ్శబ్దంగా బయటే వుండండి...."

ఇద్దరు ముందుకొచ్చారు.

ముగ్గురూ లోపలకి వెళ్ళారు.

"సార్! శర్మగారు మాకు కనిపించే దేవుడు. ప్రతి స్కూలు విద్యార్థీ విద్యార్థినీ ఆయనకి అభిమానే!! నిన్నటి 'సిటీ బ్రయిట్' ఈవినింగ్ ఎడిషన్‌లో ఆయన అకాల మరణ వార్త చదివి నిలువునా కూలిపోయాం. ఆయన ఆత్మశాంతికోసం యివాళ కాలేజీలకీ స్కూళ్ళకీ సెలవు ప్రకటించబోతున్నాం. ఈ కేసు మీ నేతృత్వంలో పరిశోధించబడుతోందని తెలిసింది. మీరు ప్రత్యేక శ్రద్ధతీసుకొని ఈ కేసుని పరిశోధించాలి. హంతకుణ్ని ఉరికంబమెక్కించాలి. జంట నగరాల్లో మొత్తం ఎంతమంది స్టూడెంట్సున్నారో చూచాయగా మీకు తెల్సు. తలా రూపాయి చందావేసుకొని మీకు ఫీజుగా."

శ్రీకాంత్ భుజం పై చెయ్యివేశాడు జలంధర్.

“మైడియర్ బోయ్! నాకు తెలుసు—మీరంతా ఆయన అభిమానులని. ఆయన మీకే కాదు. నాకూ అభిమానే! కాబట్టి నేనూ మీలో ఒకణ్ణే! నాకు మీరు యివ్వాల్సిన పన్లేదు. సరిగ్గా వారంలోగా హంతకుణ్ని చట్టంముందు నిలబెట్టగలనని హామీ ఇస్తున్నాను. మైడియర్ ఫ్రెండ్స్! నిన్న సాయంత్రంనుండే నా మనసు పరిశోధించటం మొదలు పెట్టింది. మీరొచ్చేముందు కూడ నేను ఆలోచనల్లోనే వున్నాను....’

ఉలిక్కిపడింది సుజాత. “క్షమించండి సార్! మేమొచ్చి మీకు అంతరాయం కల్గించాం” అని శ్రీకాంత్ వైపు చూసి “ఇక రండి వెడదాం” అంది.

ఇద్దరూ సింహంద్వారం వేపు అడుగులు వేశారు.

కాసేపట్లో “డిటెక్టివ్ జలంధర్ జిందాబాద్” అన్న నినాదాలు క్రమంగా వినమరుగై పోయాయి.

టెలిఫోన్ కేసి నడిచాడు జలంధర్. ఆస్పత్రి నెంబరుకి డయల్ చేశాడు. ఛీఫ్ పలికాడు.

“హలో డాక్టర్! ఎలా వుంది ఆవిడ పరిస్థితి?”

“ఆమెని మనలోకంలోకి తీసుకురావడానికి పైకో ధాపిస్తూ చాల శ్రమ తీసుకున్నాడు. విషయం పూర్తిగా అవగతిమయ్యాక యిప్పటికి యేడుసార్లు స్పృహతప్పింది. మిష్టర్ జలంధర్! ఆమె గుండె చాల బలహీనంగా వుంది. భర్త మరణ వార్తని ఆమె జీర్ణించుకోలేకపోతోంది” అవతల్నుండి భారంగా అన్నాడు డాక్టరు.

“ఆమెని దక్కించుకోడానికే శవాన్ని మార్చురీకి తరలించటంపోయి వార్డులో ఎడ్మిట్ చేసే పరిస్థితి కల్పించాల్సొచ్చింది కదా!”

"అవును. యిలా చెయ్యటం నా సర్వీసులో యిదే మొదటిసారి. ఓ శవాన్ని—ఇన్ పేషెంటుగా వార్డులో చేర్చుకోవటం."

"పరిస్థితి అలాంటిది డాక్టర్! స్పాట్ లో మాకు ఎలాంటి ఆధారాలూ కన్పించలేదు. ఇప్పుడు ఆశించటం వ్యర్థమే అవుతుంది. అలాంటప్పుడు మేము ముందుకు సాగాల్సింది కేవలం మిసెస్ కమలినితోనే. ఆమెని పోగొట్టుకుంటే హంతకుడు శాశ్వతంగా చేజారే ప్రమాదముంది డాక్టర్!" భారంగా అన్నాడు డిటెక్టివ్.

డాక్టర్ దీర్ఘంగా నిశ్వసించాడు. "కాని, ఆమె యింత మనలోకంలోకి వచ్చినా స్పృహలో వున్న కాలంలో ఆమె కంటికీ మంటికీ ఏకధారగా యేడ్వని నిముషంలేదు. ఇలాంటి పరిస్థితుల్లో ఆమెని మీరు ప్రశ్నలతో వేధించటం డాక్టరుగా నేను అంగీకరించను. ఇలా అంటున్నందుకు మరోలా అనుకోకండి."

"ఆమె ప్రాణాలు మాకూ అత్యంత విలువైనవే డాక్టర్ జీ!! కానివ్వండి. అయినా ఆలస్యం యెలాగూ అయింది" అన్నాడు జలంధర్.

ఫోను పెట్టేసి మళ్ళీ ఆలోచనల్లో పడిపోయాడు.

# 6

"నన్ను గుర్తించారనుకుంటాను—" అన్నాడు.

"మిమ్మల్ని గుర్తించలేకపోవటం ఏమిటి జలంధర్ లోపలకి రండి" అంది యామిని.

"శర్మగారి మరణం మిమ్మల్ని కూడ బాగా కృంగదీసినట్టుంది" ఆమె ముఖకవళికల్ని చూస్తున్నంగా పరిశీలిస్తూ అన్నాడు జలంధర్.

"శర్మగారి మరణం కళారంగానికి తీరని లోటు

జలంధర్ గారూ!"

"వారు మీకెలా పరిచయం?"

"ఆయన కార్యక్రమాలకి నేను హాజరవుతుండేదాన్ని. ఓసారి ఈ ఊళ్ళోనే యువకవి సమ్మేళనం జరిగింది. నేనూ పాల్గొన్నాను. శర్మగారు ముఖ్య అతిథి. నా కవితలు విని ఆయన నన్ను ప్రత్యేకంగా మెచ్చుకున్నారు. వృద్ధిలోకొస్తావని ఆశీర్వదించారు. నాది మంచి కంఠమనీ పాడగలననీ అక్కడున్న వారిలో ఒకరు చెప్పారు. మరింత ఆనందించారు. ఏదైనా కీర్తన పాడమన్నారు. కళ్యాణి రాగంలో "హిమాద్రిసుతే పాహిమాం...." పాడాను. తన్మయులై విన్నారు. అప్పటినుండి ఆయన ఎక్కడ అష్టావధానం చేసినా ప్రార్థనకి నన్నే సజెస్టు చేసేవారు...."

"మీరు రచయిత్రి కదా...."

"వుండండి. కాస్త కాఫీ తీసుకొస్తాను...." అంటూ లోపలికి వెళ్ళింది యామిని. ఈలోగా ఆ గదిని నిశితంగా పరికించాడు జలంధర్.

నిరాడంబరతని, మధ్యతరగతి సంసారాన్ని బాహాటంగా చాటుతోంది ఆ గది. అయినా ఎక్కడి వస్తువులక్కడ అమర్చబడి వుండటంతో అదోరకమైన హుందాతనాన్ని కలిగివుంది.

కాఫీ గ్లాసుతో వచ్చిందామె.

"మీరు రచయిత్రి కదా! ఆ విషయంలో మిమ్మల్ని ప్రోత్సహించలేదా?"

"ఎందుకు లేదు? సాహితీ సంబంధమైన చర్చ ఆయన్నిలోకాన్నే మరపిస్తుంది. కథలు వ్రాయమని నన్ను ప్రోత్సహించిందాయనే!"

"రాశారా?"

"ఆఁ...."

"కరెక్షన్సుకి తనవద్దకి తీసుకురమ్మని చెప్పాడా?"

"అవును...." మెరిసే కళ్ళతో డిటెక్టివ్ని చూసింది యామిని. "అరె ...మీకెలా తెలుసు?" అని అడుగుతున్నాయవి.

"కేవలం వూహ!!" అన్నాడు జలంధర్. "మీరు వ్రాసిన కథ గురించి ఆయన డ్రాయింగ్ రూమ్లో కూర్చొని గంటలతరబడి చర్చించేవారు...."

ఆమె కళ్ళల్లో మరింత మెరుపు!!

"ఆయన సలహాల బలంతో వ్రాసిన కథ—వెంటనే పత్రికలో వచ్చేసింది. అంటే—ఒక కథని సమగ్రంగా రాయగల పరిజ్ఞానాన్ని తక్కువ వ్యవధిలో ఆయన మీకు రంగరించి పోశాడు...."

"అందుకే మీరు డిటెక్టివ్లు కాగలిగారు" అంది యామిని.

"కథ—ఆయన ఎదురుగానే రాశారా?"

"లేదు. ఇంటివద్దే కూచుని రాశాను."

"ఆయన నేతృత్వంలో కథ రాయటానికి మీకెన్ని రోజులు పట్టింది?"

"పదిరోజులు."

"ఆయన వద్దకి ఎన్నిసార్లు వెళ్ళారీ పదిరోజుల్లో?"

"ఏడురోజుల్లో మొత్తం ఎనిమిదిసార్లు?!"

"మీ సంభాషణల్లో మిసెస్ శర్మ భాగం పంచుకునేవారా?"

తల అడ్డంగా వూపింది యామిని.

"మీతో మాట్లాడుతోన్న సమయంలో ఆయన మీకు

అతి సమీపంలో కూర్చోటం, మాటిమాటికీ మిమ్మల్ని తాకాలని ప్రయత్నించటం, మీపట్ల అతి చనువును ప్రదర్శించటం..." ఆగిపోయాడు జలంధర్, ఆమె కళ్ళని చూసి.

అంతవరకూ చురుకుతనాన్ని మెరుపుని కలిగున్న ఆ నేత్రద్వయం హఠాత్తుగా అరుణ వర్ణాన్ని కాగలించు కుంది.

"... షటప్!!" గట్టిగా అర్చిందామె.

ఖంగుతిన్నాడు డిటెక్టివ్ జలంధర్.

# 7

స్పీడామీటర్ యిరవైకీ పాతిక్కీ మధ్య వూగిసలాడు తోంది. రెడ్ విల్స్ సిగరెట్ జలంధర్ వ్రేళ్ళమధ్య పొగలు గ్రక్కుతోంది.

అందమైన యామిని చేత 'షటప్' అనిపించుకున్నందు కాదు, అతడు బాధపడుతున్నది.... శర్మ మేధావి కావచ్చు. బట్ — అతడు యువకుడు! అతడికి బలహీనత లుండొచ్చు. సాహితీ లోకంలో ఆమె ఎదగాలనుకుం టున్నది. కాబట్టి అతనిపట్ల ఆమెకున్న అభిమానం మరో దారి పట్టించి వుండవచ్చు. కమలినికి తెలిస్తే — కేవలం ఈ కారణంచేతనే ఆమె భర్తని దూరంచేసుకునేంత మూర్ఖురాలు కాకపోయినా —

యామిని తరపు వ్యక్తులెవరైనా ఆ కోపాన్ని ఇలా తీర్చుకొనే అవకాశం లభించటానికి ఆస్కారం వుంది.

....లింగ భేదం వున్నంత మాత్రాన ఇద్దరు సాహితీ వేత్తల్ని అనుమానించే కుసంస్కారి కాడు తను. కాని వృత్తిరీత్యా ప్రతిఒక్కర్నీ అనుమానితులుగా వూహించాల్సిన బాధ్యతుంది తనకి. చివరగా యామినితో అదే

మాట చెప్పాడు తను.

ఈ సంఘటనవల్ల శర్మ హత్యకీ యామినికీ ఏ విధంగా నూ సంబంధం లేదని ఋజువైంది. అతనికి స్త్రీలపట్ల మరో భావం లేదని 'గట్టిగా' ఋజువైంది.

'ఇక ఈ కేసులో ప్రశ్నించాల్సిం దెవర్ని....?'

జేబులోంచి-యామినితో ఇప్పించుకున్న అష్టావధానం తాలూకు కరపత్రం బైటికితీశాడు. అందులోని అంశాల్నీ పృచ్ఛకుల పేర్లనీ చదువుకున్నాడు.

"1. నిషిద్ధాక్షరి — శ్రీ ఎమ్. గోపీనాథ్
2. సమస్య — శ్రీ కె.కె. సోమయాజులు
3. దత్తపది — శ్రీ ఆర్. శ్రీరామమూర్తి
4. వర్ణన — శ్రీ యస్. ఆనందరావు
5. పద్యార్థ కథనం — శ్రీ బి. వాసుదేవరావు
6. ఘంటాగణనం — శ్రీ యస్. సత్యమూర్తి
7. అప్రస్తుత ప్రశంస — శ్రీ వై. నద్దుశెట్టి
8. ఆశువు — శ్రీ టి. హనుమంతు."

వీళ్ళందర్నీ తను కల్సుకోవాలి. వీళ్ళలో ఎవరికైనా శర్మపై కసీ, పగ వుండే అవకాశం వుందో లేదో కనుక్కోవాలి. అవసరమైతే వీళ్ళ ద్వారానే అసలు హంతకుణ్ని సాధించాలి. ఎందుకంటే వీళ్ళు మార్కండేయ శర్మతో సన్నిహితంగా మెలిగే మిత్రులు కదా!

'వీళ్ళందరికంటే తను ముందుగా కమలినిని కల్సుకోవాలి. ఆమె చెప్పే మాటల్లోని సారాంశం తన పరిశోధనకి యెంతో ఉపకరిస్తుంది.'

కరపత్రాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు జలంధర్. నేరుగా క్రయిమ్ బ్రాంచ్ హెడ్ క్వార్టర్స్ వైపుకి సాగిపోయింది డాడ్జి.

చక్రవర్తి జలంధర్ కోసమే యెదురుచూస్తున్నాడు. చక్రవర్తి గదిలో కుర్చీల్లో కూర్చున్న ఎనిమిదిమందినీ చూసి వులిక్కిపడ్డాడు జలంధర్.

వాళ్ళందరూ ఆయన్ని చూడగానే నమస్కరించారు.

"వీళ్ళందరూ మొన్నటి శర్మ అష్టావధానంలో పాల్గొన్నవాళ్ళు" పరిచయం చేశాడు చక్రవర్తి.

"మిమ్మల్నందర్నీ కలిసి మాట్లాడాలని కొన్ని నిమిషాలక్రితమే అనుకున్నాను. కాని లీఫ్‌లెట్స్‌లో మీ అడ్రసులు వెయ్యలేదు. థాంక్స్. నాకు చాల శ్రమ తప్పించారు" అన్నాడు జలంధర్ నవ్వుతూనే అందర్నీ పరిశీలనగా చూస్తూ.

ముందుగా ఒక్కొక్కరే తమని తాము పరిచయం చేసుకున్నారు.

కాఫీలు అంతకుముందే ఆర్డర్ చెయ్యబడ్డాయి కాబోలు. ఓ కానిస్టేబుల్ ట్రేలో కప్పులు పెట్టుకొని వచ్చాడు.

"శర్మ మరణవార్త విని చాల బాధపడ్డాం సార్! మిసెస్ శర్మకి మా సానుభూతి తెలియజెయ్యాలని చాలా సార్లు ప్రయత్నించాం కాని విఫలులమయ్యాం. చేసేదిలేక పోస్టులో పంపాం. స్టూడెంట్సు గోల అధికమైపోతోంది రోజురోజుకీ. హాస్టల్లో జరిగిన మర్నాడు స్ట్రైక్ చేయించారు. ఇప్పుడు పేరుకి మాత్రం అటెండవుతున్నారు. పాఠాలు జరగటంలేదు. విద్యార్థులు చెప్పనివ్వటంలేదు. చదవటంలేదు. ప్రశ్నలకి జవాబులు చెప్పటంలేదు. మమ్మల్నే ప్రశ్నిస్తున్నారు...."

"ఏమని?" వాసుదేవరావు మాటలకి అడ్డొస్తూ అడిగాడు జలంధర్.

కాఫీ కప్పు అందుకుంటూ చెప్పాడు సోమయాజులు.

"శర్మని చంపిన హంతకుడు యెప్పుడు పట్టుబడతాడు? అంతవరకూ మేం చస్తున్నాం!! అది ప్రశ్నయితే యే ప్రశ్న అడిగినా ఇదే సమాధానం!"

"మీకు శర్మ ఎంత కాలంగా తెలుసు?"

"దాదాపు రెండు సంవత్సరాలనుండీ!!"

"అతని మన స్తత్వం ఎలాంటిది?"

"చాల నెమ్మద స్తుడు సార్!!" అన్నాడు గోపీనాథ్.

"అతని అలవాట్లు, గుణగణాలు వగైరాల గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"మాకు తెల్సినంతవరకూ అతనికి దురలవాట్లు లేవు. కనీసం సిగరెట్ తాగగా కూడ నేను చూడలేదు" అన్నాడు వాసుదేవరావు.

"మీలో ఎక్కువమంది ఎడ్యుకేషన్ డిపార్టు మెంటులో పని చేస్తున్నవారే! అతనిపై ఎవరికైనా పగ, శత్రుత్వం వుండే అవకాశం వుందా?"

"అది అతనితో అత్యంత సన్నిహితంగా మెలిగే మిత్రులకైతే తెలిసే అవకాశం వుంది" అన్నాడు శ్రీరామమూర్తి.

"మీ ఎనిమిదిమందిలో అలాంటి వాళ్ళు ఎవరు?"

క్లాస్‌రూమ్‌లో విద్యార్థులుమల్లే ముగ్గురు చేతులెత్తారు. వాళ్ళు గోపీనాథ్, ఆనందరావు, సోమయాజులు.

"అభ్యంతరం లేకపోతే మీ ముగ్గురూ యీవాళ రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతంలో నన్ను మా కార్యాలయంలో కలవగలరా? లేదా మీకనువైన చోట కలిసే పక్షంలో నేనే మిమ్మల్ని కలుస్తాను."

"ఎందుకు సార్! మేమే మిమ్మల్ని మీ ఆఫీసులో కలుస్తాం" అన్నాడు ఆనందరావు.

"సరిసరె. ఉగాదినాడు జరిగిన శర్మ చివరి అష్టావధానంపై మీ అభిప్రాయం ఏమిటి?"

"ఇటీజ్ రియలీ ఎ ఫెంటాస్టిక్ ప్రోగ్రామ్ సార్! ప్రోగ్రామ్ జరుగుతున్నంత సేపూ ఓ క్రయిమ్ సినిమా చూస్తున్న అనుభూతి కల్గింది. సాహిత్యంలో శర్మకి తెలియంది లేదని ఈ కార్యక్రమం రుజువుచేసింది" అన్నాడు సోమయాజులు.

ఆ తర్వాత మరి కాసేపు మాట్లాడి వెళ్ళిపోయారందరూ.

"....సరేగాని పోస్టుమార్టమ్ రిపోర్టు వచ్చిందా?" అడిగాడు జలంధర్.

"వచ్చింది...." క్లుప్తంగా అన్నాడు ఇన్స్పెక్టర్ చక్రవర్తి. "హత్యకు కారణం ప్రమాదంతప్ప మరోటి కాదు. అంతకుముందు అతడు మత్తుపదార్థాల్లాటివి సేవించలేదు. అతడి జీర్ణాశయంలో వున్న 'ఆమాశయ పాకం'లో కూడ విషపదార్థమేదీ ఆహారంలో కలవలేదని రుజువైంది. ప్రమాదం జరిగిన చాలాకొద్ది సెకన్లలో అతని ప్రాణంపోయింది ... ఇందులో మనకి పనికొచ్చే సమాచారం యేమీ లేదు గురూ!" చప్పగా అన్నాడు చక్రవర్తి.

"పద—కమలినితో మాట్లాడుదాం...." అన్నాడు జలంధర్.

## 8

"ఈ ఎనిమిది మందినీ అనుమానిస్తున్నావా నువ్వు?" ప్రశ్నించాడు చక్రవర్తి దారిలో.

"అనుమానించడం మన వృత్తిధర్మం."

"సాహితీ మిత్రులు పరస్పరం శత్రువులయ్యే అవకాశం వుందంటావా?"

"పుష్కలంగా. సాహిత్యంలో పోటీ వుంటుంది. పోటీ వున్నచోట అసూయ సహజం. అది జనించినచోట కసి యేర్పడుతుంది. కసి పగగా మారటంలో అతిశయోక్తి లేదు...."

గంభీరంగా తలపంకించాడు చక్రవర్తి.

"అందుకే— వాళ్ళమీద కాస్త నిఘా వుంచు. విషయాలు సేకరించు. ఫలితం వుండకపోయినా నిరాశ చెందకు...."

"అలాగే" అన్నాడు చక్రవర్తి.

ఆ తర్వాత అయిదునిముషాలపాటు ఎవ్వరూ మాట్లాడలేదు. ఎవరికి వారే గంభీరంగా ఆలోచిస్తూ వుండిపోయారు.

అయిదు నిమిషాల్లో శర్మ యింటిముందు ఆగింది డాడ్జి.

మూడు గదులుండొచ్చనిపించే ఆ యింటి చుట్టూ తాంపౌండుంది. అందమైన పూలమొక్కలు సైతం శర్మ లోటుని ఎత్తిచూపుతున్నవా అన్నట్టుగా మంద్రంగా తలూపుతూ డిటెక్టివ్‌లని ఆహ్వానించాయి. వాతావరణం గాంభీర్యాన్ని ముద్రించుకుంది. నిశ్శబ్దం రాజ్యమేలుతోంది.

గేటు తెర్చుకొని లోపలకడుగు పెట్టారు. కిర్రుమన్న చప్పుడుతో మూసుకున్నాయవి.

ఇనుపతలుపులకి కాలింగ్ బెల్ వుంది. దాని ప్రక్కనే అంతకుముందు నేమ్ ప్లేట్ వుండిన గుర్తుగా ఆమేర 'షేల్'గా వుంది.

బెల్ ప్రోగించాడు చక్రవర్తి.

రెండు నిమిషాలు శబ్దరహితంగా వుండి, తర్వాత తలుపులు తెరుచుకున్నాయి.

ధవళ వస్త్రాల్లో మూర్తీభవించిన శోకదేవతలా వుంది కమలిని. కళ్ళు వాచి ఎర్రగా వున్నాయి. కన్నీళ్ళు చెక్కిళ్ళపై ఎండిపోయి చారికలు కట్టాయి. కపోలాలు కందిపోయి వున్నాయి. తైలసంస్కారంలేని జుత్తు అడ్డదిడ్డంగా భుజాలపైనుండి వెనక్కి వ్రేలాడబడి వుంది. 'పదోరోజు వరకే మాకీ అర్హత' అన్నట్టుగా అర్హత కోల్పోయిన నల్లపూసలు, గాజులు వాటి స్థానాల్లో చిక్కు చిక్కుమంటున్నాయి.

వాళ్ళని చూడగానే ఆమెకి మరలా దుఃఖం పొంగి వచ్చింది.

"దయచేసి మమ్మల్ని లోపలకి రానివ్వండి" అన్నాడు జలంధర్.

ఆమె ఏడుస్తూనే ప్రక్కకి తప్పుకుంది.

టేబుల్ పై గుట్టలు గుట్టలుగా కార్డులు, కవర్లు, టెలిగ్రాములు పడున్నాయి. అవన్నీ శర్మ అకాలమరణానికి సానుభూతి నందిస్తూ మంత్రులూ అభిమానులూ పంపించినవిగా అర్థంచేసుకున్నారు.

"నాకెవరిమీదా కక్షలేదు. హంతకుడెవరో తెల్సుకుని నేను సాధించేదేమీలేదు. దయచేసి వెళ్ళండి" ఏడుస్తూనే అందామె.

"క్షమించండి. మిమ్మల్ని మరింత శోకతప్తుల్ని చెయ్యటం మా అభిమతం కాదు. ఒక తుచ్ఛుని కారణంగా ఒక మహామేధావిని కోల్పోయిందీ సమాజం. అర్ధాంగిగా మీరు వారిని చంపినవాణ్ని చూసి సాధించేది

ఏదీ లేకపోయినా, తన పుత్రుడు స్వార్థానికి బలి అయి నందుకు గీర్వాణి కుమిలిపోతోంది. హారతికణిక్ని పట్టుకొని చట్టానికి పట్టించేవరకూ ఆమె పుత్రశోకం తీరదు...."

కమలిని మాట్లాడలేదు.

"మీవారికెవరైనా విరోధులున్నారా? గత కొద్ది రోజులుగా మీవారు అనవసరంగా చిరాకుని ప్రదర్శించటం కాని, అకారాంతరంగా కోపగించుకోవటంకాని, దిగులుగా ముభావంగా ఒంటరిగా కూచుని ఏదేకంగా ఆలోచించటంకాని ఇంటికి ఆలస్యంగా రావటంకాని తనకొచ్చిన ఉత్తరాల్ని ప్రత్యేకంగా దాచివుంచటంకాని అవసరమైన సందర్భాల్లో అనవసరమైన ఉత్సాహాన్ని ఉద్వేగాన్ని ప్రదర్శించటంకాని జరిగిందా?"

అడ్డంగా తలూపింది కమలిని.

"వారికోసం యెవరైనా ఆడస్నేహితులు వస్తూండే వారా?"

"వచ్చేవారు."

"చెప్పండి...." జలంధర్ కళ్ళు మెరిశాయి.

"నీహారిక, మందస్మిత, యామిని."

"ఆ ముగ్గురితో మీవారి ప్రవర్తన ఎలా వుండేది? మీవారితో ఆ ముగ్గురి ప్రవర్తన ఎలా వుండేది?"

"నీహారిక వారి అభిమాని. మందస్మిత వారి ప్రియురాలు...."

"వాట్!?"

"యామిని వారి శిష్యురాలు!!"

"మందస్మిత వారి....?"

"ప్రియురాలు!!"

"మైగాడ్! ఎంత నిర్వికారంగా చెప్పగలుగుతున్నా

రామాట?"

"జలంధర్ గారూ! మందస్మిత ఆయన ప్రేయసన్నాను గాని వారామె ప్రియుడని చెప్పలేదే!"

"అంటే.... అంటే....?"

"ప్రొద్దుతిరుగుడు పువ్వు పగలంతా సూర్యుణ్ని చూస్తూనే వుంటుంది, తన మొహాన్ని త్రిప్పి త్రిప్పి. చంద్రుని మొహం చూసేంతవరకూ కలువ వికసించదు. అయితే? పువ్వు తన చుట్టూ తిరగాలని మాత్రమే సూర్యుడొస్తాడా? కలువ వికసించటంకోసమే చంద్రోదయం అవుతుందా?—ఇదీ అంతే!"

"కాస్త అర్థమయ్యేలా చెప్పండి...." జేబులోంచి రెడ్ విల్స్ పాకెట్ తీశాడు జలంధర్.

"మందస్మిత వారికి దూరపు బంధువు. వరసకి మరదలవుతుంది. వారంటే చచ్చేంత యిష్టం. వారిని చూస్తే ఆమెలో వికారపు చేష్టలు పుట్టుకొస్తాయి...."

"యివన్నీ మీకు...."

"మావారే చెప్పారు. ఆమెపట్ల వారికి మొదట్నుండీ సదభిప్రాయంలేదు. అభిప్రాయాలు కలవని మనువుతో మనుగడ సాగించడం కష్టం. అరిగిపోయిన రికార్డులా వాగటం ఆమె తత్వం. నిండుకుండలాంటి మనస్తత్వంగల మనిషిని చేపట్టాలని వారి అభిలాష. అందుకే నిర్మొహమాటంగా చెప్పేశారుట. కనీసం కోరికైనా తీర్చమని అర్థించిందట. మావారు తిరస్కరించారు. వన్ వే ట్రాఫిక్ పద్ధతిపై 'ప్రేయసి'గా నిల్చిపోయింది...."

"ఆవిడపై మీకనుమానం లేదుగా!?"

"లేదు.."

"మిగతా యిద్దరూ...."

"అలాంటివారు కారు. మావారూ అలాంటివారు కారు."

"మీవారి గది ఓమారు చూడాలి. దయచేసి అనుమతించండి."

"అదుగో గది. ఇదిగో తాళంచెవి. మీరు చూస్తూ వుండండి. ఈలోగా కాస్త కాఫీ తెస్తాను...."

# 9

అందంగా అధునాతనంగా వున్న చిన్న గది అది. గోడలకి లేతాకు పచ్చరంగు డిస్టెంపరు పూయబడి వుంది.

గోడలపై లెక్కపెట్టలేనన్ని ఫోటోలు. అష్టావధానం చేస్తున్నప్పుడూ సన్మానం చేయించుకున్నప్పుడూ సభల్లో మాట్లాడుతూ వున్నప్పుడూ తీయించుకున్న వి-సందర్భాలూ తేదీలతో సహా వ్రాయబడి ఖరీదైన ఫ్రేముల్లో వ్రేలాడుతున్నాయి. ఓ గోడకి సరస్వతీదేవి నిలువెత్తు తైలవర్ణ చిత్రం అమర్చబడివుంది రెగ్యులర్‌గా అగరొత్తులు వెలిగిస్తోన్న చిహ్నాలు గోచరిస్తున్నాయి.

మరోగోడకి వెడల్పైన ర్యాక్. అందులో రకరకాల పుస్తకాలు. సాహిత్యానికేగాక మిగత కళలన్నిటిక్కూడ ప్రాధాన్యతనిస్తూ యెన్నో పుస్తకాలు సేకరించుకున్నాడతడు.

మరోగోడకి గాజుపలకలు బిగించిన షెల్ఫు. అందులో అతనికి వివిధ ప్రదర్శనల్లో వచ్చిన బహుమతులున్నాయి. నాలుగో గోడకి ఖరీదైన ఎలక్ట్రానిక్ గోడగడియారం.

తలెత్తాను జలంధర్. 48-బ్లేడ్ స్నఫ్ కలర్ ఖేతాన్ సీలింగ్ ఫ్యాన్ వాడక నాలుగైదు రోజులైనా కాక ముందే కొద్దిగా బూజుపట్టింది.

గాలి ధారాళంగా వీచే ప్రాంతంలో-అంటే ఫ్యాను

క్రింద కాస్త మూలకి గాద్రెజ్ టేబుల్. దానిముందు రివాల్వింగ్ చైర్. టేబుల్ పైన అలారమ్ టైమ్‌పీస్. టేబుల్ ల్యాంప్, పేపర్ వెయిట్స్ కొన్ని పుస్తకాలు, కొన్ని తెల్ల పేపర్లు, పెన్ స్టాండ్, రూలర్ మొదలైన వున్నాయి.

గదంతా బోసిపోయి వుంది. వస్తువులన్నీ దుమ్ము కొట్టుకొని వున్నాయి.

కమలిని వస్తున్నట్టుగా సవ్వడి వినిపించింది. తిరిగి చూశారు జలంధర్, చక్రవర్తి.

ద్వారం దగ్గరే ఆగిపోయింది కమలిని. ఆమె చేతిలో ట్రే, కాఫీకప్పులు వున్నాయి. ఆమె ఆ గది ఇంతవరకూ తెరవలేదు శర్మపోయాక. ఆ గదిని, అందులోని వస్తువుల్ని చూడగానే బాధావీచికలు ఉత్తుంగతరంగాలై ఆమె హృదయ కడలిలో ఎగసిపడటం ప్రారంభించాయి.

వడివడిగా వెళ్ళి కాఫీకప్పులు అందుకున్నారు ఇద్దరూ. అక్కడ నిలవలేనట్టుగా పరిగెత్తివెళ్ళి సోఫాలో కూలబడిపోయింది కమలిని దోసిట్లో ముఖం కప్పుకొని.

యిప్పుడు సానుభూతి వాక్యాలు పలికినా ఆమె బాధని మరింత ఉధృతమే చెయ్యగలవు. అందుకని ఆమెని కాసేపలాగే బాధపడనిచ్చారు డిటెక్టివ్ ద్వయం.

"శర్మగారికి డైరీ వ్రాసే అలవాటుందా?"

"వుంది...." నెమ్మదిగా కనులు తుడుచుకుని చెప్పిందామె. "అయితే దైనందిన చర్య వ్రాయరు. ప్రోగ్రామ్స్ ఆఫర్ వస్తే అంగీకరించిన తేదీల్ని అందులో నోట్ చేసుకుంటారు."

"మీ అనుమతితో ఒక్కసారి చూస్తాను."

"టేబుల్ డ్రాయర్లో వుంది...." అంది కమలిని.

మళ్ళీ ఆ గదిలోకి అడుగులు వేశాడు జలంధర్.

టేబుల్ డ్రాయర్ కి తాళంచెవుల గుత్తి వ్రేలాడు తోంది. తాళం తీసి డ్రాయర్ లాగాడు. రకరకాల సైజుల్లో యెవరెవరో బహూకరించినవి కాబోలు— ఏడెనిమిది డైరీలున్నాయి. ఒకటి మాత్రం కొద్దిగా మాసి వుండటంతో దాన్ని ప్రతిరోజూ వాడే డైరీగా గుర్తించి చేతికి తీశాడు.

యేర్పేడు (చిత్తూరుజిల్లా) శ్రీవ్యాసాశ్రమంలోని కన్యాగురుకులంలో ఎనిమిది మాసాలక్రితం శర్మ అష్టావధానం సందర్భంగా ఆశ్రమ అధికారులు బహూకరించిన డైరీ అది.

పేజీలు తిరగేశాడు జలంధర్.

వివిధ ప్రాంతాల్లో జరగనున్న తన అష్టావధాన కార్యక్రమాల్ని గుర్తుకోసం ముందుగా వ్రాసివుంచుకున్నాడు. తను అధ్యక్షుడుగా ముఖ్య అతిథిగా హాజరైన కార్యక్రమాలు కూడ నోట్ చేసుకున్నాడు.

ఓచోట అప్రయత్నంగా ఆగిపోయాడు జలంధర్. అతడి భృకుటి ముడిపడింది. ఆ తర్వాత పేజీలు త్రిప్పాడు.

'క్రయిమ్ గ్లామర్' మాసపత్రిక ప్రారంభోత్సవం సందర్భంగా యేర్పాటుచేసిన అష్టావధానం తాలూకు నోట్ అది. ఎడిటర్ కందుకూరి జయరామరాజు తన్ని కలవటమూ శ్రోత్రపద్ధతిలో అష్టావధానం చెయ్యమని కోరటమూ తను అంగీకరించటమూ అంతా వ్రాసి వుందందులో.

కాని డిటెక్టివ్ జలంధర్ దృష్టి నాకర్షించిందీ అతన్లో ఆలోచన్ను రేకెత్తించిందీ ఆ మేటర్ కాదు.

ఆ మర్నాడు-అంటే అష్టావధానం జరిగిన మర్నాడు

అంటే తమ పెళ్ళిరోజునాడు—అతడు తమ వైవాహిక జీవితంలోని మాధుర్యాన్ని గురించి కాని, కమలినితో తన అనురాగబంధాన్ని గురించి కాని తను మేరేజ్ ఏనివర్సరీ దేని ఎలా సెలిబ్రేట్ చేసుకోవాలో తెలియజేసే వివరాలుగాని—మరేమీ వ్రాసుకోలేదు.

ఒక పద్యం మాత్రం వ్రాసుకున్నాడు.

"తుమ్మ తుమ్మకెప్డు తుచ్ఛత్వముండెదు
సమ్మరిమ్యపి కని చావచెపుడు
సత్వరమ్మె నీవు సంతోషమయ్యేదు
ఏరు లేరు షూరు ఎపుడు నీవు .."

ఆ పద్యం మొన్నటి అష్టావధానంలోదే!

ఆ పద్యంలో కొన్ని పదాల క్రింద అండర్ లైన్ చెయ్యబడి వుంది.

అవి: తుమ్మ, సమ్మరిమ్యసి, సత్వరమ్మె, షూరు....

గతంలో ప్రోగ్రాముల గురించి రాసుకున్న వివరాల్ని-డైరీలో పేజీల్ని మరోసారి త్రిప్పిచూశాడు జలంధర్. ఫలానా తారీఖున ప్రోగ్రామ్ ఫిక్స్ అయినట్టుగా వుంది కాని ప్రోగ్రామ్ అయిపోయాక ఆ అనుభూతిని ఇలా పేపరుపై నెమరేసుకోవటంకాని ప్రత్యేకంగా వ్రాసుకోవటంకాని జరిగిన దాఖలాలు కన్పించలేదు.

ఈ ఒక్క ప్రోగ్రాములోనే ఎందుకు జరిగింది? అన్ని పద్యాల్లో శర్మ దీన్ని మాత్రమే ప్రత్యేకంగా ఎందుకు వ్రాసుకున్నాడు? అండర్ లైన్ చేసుకున్న పదాల కర్థం ఏమిటి? ఈ హత్యకీ దీనికీ సంబంధం వుందనుకోవడాని కెంతవరకు అవకాశం వుంది???

డిటెక్టివ్ జలంధర్ మస్తిష్కం వేగంగా పనిచెయ్య

నారంభించింది. చెయ్యి అప్రయత్నంగా కాగితం, కలం అందుకుంది.

# 10

"నమస్కారం సార్!" అన్నారు వాళ్ళు ముగ్గురూ.

ఉలిక్కిపడి తలెత్తాడు జలంధర్ తపోభంగమైన మునిలా.

గోపీనాథ్. ఆనందరావు, సోమయాజులు.

ఈ టైములో తనని కలవమన్నట్టు వాళ్ళతో చెప్పటం గుర్తొచ్చింది. చిరునవ్వుతో ఆహ్వానించాడు.

"శర్మ గురించి మాతో యేదో ప్రత్యేకంగా మాట్లాడాలన్నారు...." సోమయాజులన్నాడు.

"అవును...." రెడ్‌విల్స్ పేకెట్ తీశాడు. ముగ్గురికీ ఆఫర్ చేశాడు.

ఆనందరావు మృదువుగా తిరస్కరించాడు. మిగత ఇద్దరూ అందుకున్నారు. ముగ్గురూ వెలిగించుకున్నారు.

"శర్మ మీకు అత్యంత సన్నిహితుడని మీకు తెల్సు. శర్మనిగూర్చి ప్రత్యేకంగా చెప్పేదేదైనా వుంటే సెలవివ్వండి...." అన్నాడు జలంధర్, ఏకకాలంలో ముగ్గురి భావాల్నీ పరిశీలిస్తూ.

జలంధర్ చూపించిన నమ్రతకి పొంగిపోయార్లావుంది. ముందట గోపీనాథ్ ప్రారంభించాడు.

"అతన్నాకు దాదాపు పదేళ్ళనుండీ తెల్సు సార్! చాల మంచివాడు. యెవర్నీ నొప్పించే స్వభావం కలిగినవాడు కాదు...."

"అవన్నీ సరే.... అతనిగూర్చి ప్రత్యేకమైన విషయాలేమైనా వుంటే చెప్పండి...." ఘాటుగా దమ్ములాగుతూ అన్నాడు జలంధర్.

"అదే చెప్పబోతున్నాను. కాని అతడు నాకు తెల్సి నంతవరకూ ఒకే ఒక తప్పుపని చేశాడు. తెలిసి తెలిసి ఒక అమాయకురాలికి ద్రోహం చేశాడు. అది తల్చుకున్నప్పు డల్లా నాకు బాధ కలుగుతుంది."

"ఎవరామె?"

"సంయుక్త."

"ఎవరామె?"

"శర్మ భార్య."

ఆ మాటలకి ఆనందరావు సోమయాజులతో బాటు డిటెక్టివ్ జలంధర్ కూడ అప్రతిభుడయ్యారు!

"గోపీనాథ్ గారూ! ఏమిటి మీరు మాట్లాడుతున్నది?"

"నిజమే జలంధర్ గారూ!"

"ఈ విషయం కమలినికి తెల్సా?"

"తెలుసనుకుంటాను."

"చెప్పండి...."

"సంయుక్త పుట్టిల్లూ మా ఊరూ ఒకటే. సంయుక్త నా క్లాస్ మేట్ కూడాను. అయితే ఆమె టెన్త్ వరకూ చదివి ఆగిపోయింది. నేనీవూరు వచ్చేశాను."

"శర్మ, సంయుక్తల వివాహం మీరు మాశారా?"

"నేను హాజరయ్యాను."

"ఎప్పుడు జరిగింది?"

"సుమారు ఎనిమిదేళ్ళ క్రితం."

"కమలినితో అతని వివాహం శాస్త్రోక్తంగా జరిగిందేనా?"

"తెలీదు."

"పోనీ శర్మ కమలిని 'కలిసి' వుండబట్టి ఎంకాలమైంది?"

"ఆరు సంవత్సరాలు."

"అంటే సంయుక్తని పెళ్ళాడిన రెండేళ్ళకి కమలిన్ని పెళ్ళాడా...."

"కమలిన్ని పెళ్ళాడినట్టు నాకు తెలీదు."

"ఆల్ రైట్ మేరేజ్ చేసుకున్నాడనే అనుకుందాం. సంయుక్త రెండేళ్ళు మాత్రం కాపురం చేసింది. ఆమె బ్రతికుండగానే...."

"కమలిన్ని వివాహం చేసుకున్నాడు."

"అప్పటికే శర్మ ప్రభుత్వోద్యోగా!?"

"అవును."

"గవర్నమెంట్ సర్వెంట్ భార్య బ్రతికుండగా సహేతుకమైన కారణంలేందే—ఆమెనుండి విడాకులు పుచ్చుకోందే ద్వితీయ వివాహం చేసుకునేందుకు వీలు లేదు కదా!?"

"నిజమే. కారణం విషయం, విడాకుల విషయం నాకు తెలీదు."

"శర్మవల్ల సంయుక్తకి పిల్లలు కలిగారా?"

"లేదు. వివాహానికి హాజరయ్యాక నేను కేవలం నాలుగైదుసార్లు మాత్రమే మా ఊరు వెళ్ళాను. ఆతర్వాత అక్కడి పొలం పుట్రా అమ్మేయ్యటంతో ఆ ఊరితో బంధం తెగిపోయి 'నేటివ్ ప్లేస్' గా చెప్పుకునేంతవరకే మిగిలింది."

"శర్మ సంయుక్తతో ఈ ఊళ్ళోనే కాపురం పెట్టాడా?"

"ఆఁ.... బంజారాహిల్స్ ప్రాంతంలో వుండేవాడు."

"కమలినితో కాపురం పెట్టాక మీరెన్నాళ్ళకి శర్మని కలిశారు?"

"దాదాపు ఆర్నెల్లకి."

"క్లోజ్ ఫ్రెండ్సు కదా! ఆర్నెల్లవరకూ అతన్ని కలవకపోవటానికి కారణం?"

"ఇది హైదరాబాదు మహానగరం. వాళ్ళింటికీ మా యింటికీ పద్దెనిమిది కిలోమీటర్ల దూరం. అయినా అభిప్రాయాలూ అభిరుచులూ కలిసింది స్నేహంకాని రోజుకి నాలుగుసార్లు కలిస్తే స్నేహమా?"

దీర్ఘంగా తలపంకించాడు డిటెక్టివ్ జలంధర్.

"కమలిన్ని వివాహం చేసుకున్నాక మీరు తొలిసారిగా అతన్ని కల్సినప్పుడు సంయుక్తని విడనాడడానికీ ఈమెని వివాహమాడటానికీ కారణం చెప్పాడా?" జలంధరే ప్రశ్నించాడు.

"భార్యగా కమలినిని పరిచయం చెయ్యగానే విస్తుపోయాను. నన్ను చూసి చిరునవ్వు నవ్వాడు శర్మ. "నాకు తెల్సు నువ్వాశ్చర్యపోతావని. నీకు చెప్పాలి కూడ. సమయం వచ్చినప్పుడు చెబుతాను" అన్నాడు. ఆతర్వాత యెన్నోసార్లు కలుసుకున్నాము. తనకై తను చెప్పలేదు. నాకై నేను అడగలేదు."

"తనకై తను చెప్పకపోవటానికి కారణం వూహిస్తున్నారా?"

"నాకై నేను అడక్కపోవటానికి ప్రత్యేకమైన కారణమంటూ లేదు. ఎంత స్నేహితుడైనా వ్యక్తిగత వివరాలు చెప్పితీరాలని రూలేమీ లేదుకదా! అతడుకూడా అలాగే వూహించి వుండవచ్చు. లేదా చెప్పాల్సిన అవసరంలేదని కమలిని అతనికి చెప్పి వుండవచ్చు."

"ఇంకా యేమైనా చెప్పేదుందా?"

లేదన్నట్టు తలవూపాడు గోపీనాథ్.

ఆనందరావుకేసి చూశాడు జలంధర్.

సోమయాజులు అంటున్నాడు. అతని ఉబలాటం చూస్తోంటే తనకి తెలిసిన విషయాన్ని యెప్పుడెప్పుడు కక్కేద్దామా అని వుంది. అది గ్రహించాడు జలంధర్.

“దాదాపు సంవత్సరం క్రితం నేనో విషయం గమనించాన్సార్!” అన్నాడు సోమయాజులు.

“చెప్పండి.”

“శర్మ దాదాపు అయిదేళ్ళనుండీ నాకు పరిచితుడు. గోపీనాథ్ అంత ఫ్రెండ్‌షిప్ మాకు లేకపోయినా తరచూ కల్సుకొనే వాళ్ళం. కమలినితో వివాహ విషయాలు గోపీనాథ్ దగ్గరే దాచాడంటే నాదగ్గర వెల్లడిస్తాడనుకోవటం హాస్యాస్పదమే అవుతుంది. దాదాపు సంవత్సరం క్రితం....”

“మీరు గమనించిన విషయం చెప్పండి” జలంధర్ అంటున్నాడు.

“నేను కొన్ని కవితలు వ్రాశాను. వాటిని శర్మకి చూపించి తప్పులుంటే దిద్దుకొని వారపత్రిక్కి పంపుదామనే ఉద్దేశంతో వాళ్ళింటికి వెళ్ళాను. పదిగజాల్లో వాళ్ళిల్లుందనగా ఓ యువకుడు వాళ్ళింట్లోంచి బైటికి రావటం కన్పించింది. అప్పుడతని మొహం కందగడ్డలా వుంది.

“నాకప్పుడనుమానంలాంటిదేమీ కలగలేదు. నేరుగా యింట్లోకి వెళ్ళాను. కమలినిలో ఏ తడబాటూ లేదు. నన్ను లోపలికి పిల్చింది. శర్మ ఊళ్ళోలేడని చెప్పింది. మామూలుగా మాట్లాడి కాఫీ యిచ్చి పంపింది.

“ఆ యువకుడెవడు? శర్మ ఊళ్ళోలేని సమయంలో యెందుకొచ్చాడు? అతనికీ కమలినికీ యేమిటి సంబంధం? యిలా ఎన్నిసార్లు వస్తున్నాడు? అతనొస్తున్నట్టు శర్మకి

తెల్సా? వగైరా సందేహాలు కలిగాయి.

"ఇప్పుడు గోపీనాథ్ చెప్పేవరకూ వాటికి ప్రాధాన్యత యివ్వలేదు. ఎందుకంటే అతడు కమలినికి తమ్ముడు కావచ్చు. లేదా దూరపు బంధువు కావచ్చు. ఆ విషయం శర్మకి తెలిసేవుండొచ్చు అనుకున్నాను. ఇప్పుడనిపిస్తోంది. పెళ్లైనవాణ్ని వల్లో వేసుకొని తాళికట్టించుకున్న ఆడది ఇంకా ఎన్ని దాగుడుమూతలైనా ఆడగలదు!"

"విద్యాధికురాలైన స్త్రీపై మీకు సదభిప్రాయం లేదా?" ప్రశ్నించాడు జలంధర్.

"విద్య మనిషికి స్వేచ్ఛనిస్తుంది. ఆడదానికి స్వేచ్ఛనిస్తే ఇంకేమైనా వుందా?" అన్నాడు సోమయాజులు కళ్ళు యింతలావు చేస్తూ.

"మీ భార్య యెంతవరకు చదువుకున్నారు.

"మూడో తరగతి!!"

"గుడ్" అన్నాడు జలంధర్. అందులోని వ్యంగ్యం అతనికి మాత్రమే తెలుసు.

ఆనందరావుకూడా మాట్లాడాడు. కాని ఆ మాటల్లో పరిశోధనకి పనికొచ్చే ఆధారాలేవీ లేవు.

## 11

జలంధర్ ఆలోచనలన్నీ అల్లకల్లోలంగా వున్నాయి.

శర్మ డైరీలో వ్రాసుకున్నదాన్నిబట్టి దానికీ హత్యకీ సంబంధం వుందనుకున్నాడు తను. కాని కథ రాను రాను క్రొత్త మలుపులు తిరుగుతూ కేసుని క్లిష్టంగా మారుస్తోంది.

తను శర్మకి రెండవ భార్యనని కమలిని చూచాయగానైనా చెప్పలేదు. ఎలాంటి పరిస్థితుల్లో ఆమె అతన్ని ద్వితీయ వివాహం చేసుకుంది? శర్మ మొదటి భార్య

యింకా బ్రతికే వుందా? ఆ పగతో సంయుక్త తరఫు మనుషులు హత్య చేయించి వుంటారా?

ఈ వూహ యెంతవరకూ సమంజసం?

నూటికి ఏ ఒకరో ఇద్దరో తప్ప—విడాకులు పొందినా భర్తని అంటే మాజీ భర్తని—యింకా భర్తగానే వూహించుకునే దేశం మనది. అలాంటిది—శర్మని చంపి-కమలినితో పాటు మానసికంగా సంయుక్తని కూడ విధవని చేస్తారా? ఆఫ్ కోర్స్—ఆమె మరొకర్ని పెళ్ళాడేసి వుంటే అది వేరే విషయం....

అదీ ఆరు సంవత్సరాల తర్వాత!!

ఇకపోతే సోమయాజులు మాటల్నిబట్టి....

శర్మకి పెద్దగా ఆస్తిపాస్తుల్లేవు. సారస్వతమే అతని సంపద. కమలిని అతన్ని వలచి వరించి వుండవచ్చు. కాని సాటి ఆడదానిగా సంయుక్తకి విడాకులిచ్చి తనని చేసుకొమ్మనేంత దుసంస్కారిగా కన్పించదు కమలిని. అదే నిజమయ్యేపక్షంలో సమాజం సోమయాజులు అభిప్రాయంకేసి మొగ్గు చూపవచ్చు.

అయినంతమాత్రాన కమలిని పరాయి మగాడితో పొందు కుదుర్చుకోవాల్సిన అగత్యంలేదు. ఇద్దరూ గెజిటెడ్ ర్యాంక్ వుద్యోగులే! ఇద్దరికీ కలిపి అయిదు వేల దాకా వస్తుంది జీతం. లగ్జూరియస్‌గా గడిచిపోతుంది జీవితం.

అయితే ఆ కుర్రాడెవరు? శర్మ యింట్లో లేని సమయంలోనే తరచూ యెందుకు వచ్చిపోతున్నాడు? తిరిగి వెళ్ళేప్పుడు తరచూ అతని ముఖం కందగడ్డలా ఎందుకు మారిపోతోంది? అలా మారిపోతోందంటే అతడు ఆమె

చేత అవమానింపబడుతూ వుండాలి. ప్రతిసారీ అవమా నింపబడుతున్నాడా? ఒక్కసారైనా అవమానించ కుండా వుంటాడా?

ఆమెనతడు బ్లాక్ మెయిల్ చేస్తున్నాడా???

ఆమె అతడికి భయపడుతోందా???

అప్రయత్నంగా రిసీవరందుకుంది జలంధర్ కుడిచెయ్యి.

"హలో....డిటెక్టివ్ ఇన్స్పెక్టర్...."

"....చక్రవర్తి!?"

"నువ్వా గురూ!?"

"ఆఁ....ఉదయాన్నే వుమెన్స్ కాలేజీ ప్రిన్సిపాల్ని కల్సుకో. కమలిని గురించి వీలైనన్ని వివరాలు రాబట్టు.."

"అలాగే! కేసు ఎంతవరకూ వచ్చింది?"

"కాంప్లికేటెడ్ గా తయారైంది!"

అవతల చక్రవర్తి పెదవులనుండి నిట్టూర్పు వెలువడింది.

* * *

కాలింగ్ బెల్ మ్రోగించాడు.

పనిమనిషి కాబోలు. తలుపుతీసింది.

"అమ్మగారున్నారా?"

"వున్నారు."

"మాట్లాడాలి."

"లోపలకి రండి...."

పనిమనిషి వెనకాలే లోపలికి నడచాడు. డ్రాయింగ్ రూమ్లో కూర్చున్నాడు.

డ్రాయింగ్ రూమ్ అధునాతనంగా వుండి ఆడంబరతని చాటుతోంది. బ్రాందీ విస్కీల తాలూకు అడ్వర్టయిజ్ మెంట్స్ తాలూకు అర్ధనగ్న సుందరీమణులు గోడల

నిండా వ్రేలాడుతున్నారు. వారి అభిరుచిపట్ల అబ్బురం కలిగిందతనికి.

కాసేపయ్యాక 'నమస్తే' అన్న బొంగురు కంఠం విన వచ్చింది. ఫులికిపాటుతో చూశాడు.

"నా పేరు మాధురీదేవి."

"నేను డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ని. పేరు చక్రవర్తి" అన్నాడు లేవబోతూ.

"కూర్చోండి...." అంది మాధురీదేవి భారీకాయాన్ని సోఫాలోకి చేరవేస్తూ.

పనిమనిషి బూస్టు పట్టుకొచ్చింది.

రెండునిమిషాలు మవునంగా దొర్లిపోయాయి.

"మిసెస్ కమలిని...." మొదలుపెట్టాడు చక్రవర్తి.

"అవును పాపం, ఆమెకన్యాయం జరిగిపోయింది. ఇంత చిన్న వయసులోనే ఆమె నుదుట వైధవ్యాన్ని రాశాడు దేవుడు...."

"ఆమె గురించి కొంత సమాచారం కావాలి."

"అడగండి."

"మీ కాలేజీలో ఆమె యెంతకాలంగా పనిచేస్తున్నారు?"

"ఆరేళ్ళుగా"

"యిక్కడ చేరేసరికే ఆమె వివాహితులా?"

"అపాయింట్ మెంటొచ్చాక ఒక మాసానికి పెళ్ళయింది."

"ఆ సందర్భంగా ఆమె హావభావాలెలాగున్నాయో చెప్పగలరా?"

"ఓహ్!! ఆరేళ్ళనాటి మాట!"

"గుర్తున్నంతవరకే చెప్పండి."

"సంతోషంగా అందర్నీ పిల్చి ఈ విషయం చెప్పింది. పెళ్ళి తిరుపతిలో కాబట్టి ఎవ్వరమూ వెళ్ళలేకపోయాం."

"వెడ్డింగ్ కార్డు వుందా మీకాద్ద?"

"అసలు వెడ్డింగ్ కార్డు ఇస్తేనా?"

"అదేం?"

"వెడ్డింగ్ కార్డు పద్ధతి తమకి లేదట."

ఆశ్చర్యంగా విన్నాడు చక్రవర్తి.

"కనీసం ఫలానా శర్మతో నా పెళ్ళి అని కూడ చెప్పలేదా?"

"అడిగాము. పేరు చెప్పటానికి సిగ్గుపడింది."

"మాష్టర్ డిగ్రీ తీసుకున్న మనిషికి సిగ్గా!?"

"దాని తాత డిగ్రీ తీసుకున్నా—ఆడది ఆడదే!!"

"ఆ తర్వాత ఈ ఊళ్ళో రిసెప్షన్ లాంటిది ...."

"జరిగింది. అందరం వెళ్ళాం."

"ఇప్పుడున్న ఇల్లోనేనా?"

అవునన్నట్టుగా తలూపింది మాధురీదేవి.

"ఆమెకోసం శర్మ తరచూ యిక్కడికొస్తూండే వారా?"

"చాల అరుదుగా. ఉదయం స్కూటర్ పై ఆమెని దిగ విడిచి వెళ్ళేవారు. సాయంకాలం తీసికెళ్ళిపోయేవారు."

"హత్య జరిగినరోజు కూడ వుదయం దిగవిడిచి వెళ్ళారా?"

"ఏమో! నేను చూళ్ళేదు. రిక్షాలో వచ్చిందను కుంటాను."

"ఆరోజు వారి మేరేజ్ ఏనివర్సరీదే కదా!! శెలవు అప్లయ్ చెయ్యలేదా?"

"గుర్తొచ్చింది. ఆరోజామె రిక్షాలోనే వచ్చింది.

భర్తకి కాలేజీలో యేదో పనుందని పొద్దుటే వెళ్ళి పోయారు."

"వేరే మగాళ్ళెవరైనా ఆమెని కల్సుకోటానికి కాలేజీ కొచ్చేవారా?"

"ఓ అబ్బాయి మాత్రం అప్పుడప్పుడూ వచ్చేవాడు."

చక్రవర్తి కళ్ళు మెరిశాయి. "ఎవరు? ఎలా వుంటాడు?"

"వయసు దాదాపు ముప్పయ్ ఉండొచ్చు. నిర్లక్ష్యంగా దువ్వుకున్న అందమైన నొక్కుల జుత్తు, చామన చాయ, ఆకర్షణీయమైన మీసాలు. ఎప్పుడూ హుందాగా కన్పిస్తాడు. పేరు యశ్వంత్ అనుకుంటాను."

"అతనితో ఆమె ప్రవర్తన ఎలా వుండేది?"

"నేను చూడలేదు. ఆయిష్టంగానే పర్మిషన్ తీసుకొని వెళ్లేది."

"దీన్నిబట్టి మీరు వేరేదైనా వూహిస్తున్నారా?"

"ఓ ఆడదానితో మాట్లాడేందుకు ఓ మగాడొచ్చినంతమాత్రాన అందులో నీచార్థాలు వెదికేదాన్ని కాన్నేను. ఆమె X జైబెడ్ హోదాలో వున్న ఉద్యోగిని. తమ్ముడు కావచ్చు బంధువు కావచ్చు. శిష్యుడు కావచ్చు. స్నేహితుడు కావచ్చు...."

"థాంక్స్ ఫర్ యువర్ కైండ్ ఇన్ఫర్మేషన్. బైదిబై మీవారు యేదైనా బార్ మెంబరా??"

"థాంక్స్. వారు బార్ మెంబర్ కాదు; వైన్ డీలర్!!"

## 12

సడన్‌గా ఆగిపోయింది డాడ్జికారు, కమలిని ఇంటి కాస్త ఇవతలే.

తల వంచి కనులు మరింత విశాలంచేసి విండ్‌స్క్రీన్ గుండా చూశాడు జలంధర్.

వయసు దాదాపు ముప్పయ్ వుండొచ్చు. నిర్లక్ష్యంగా దువ్వుకున్న అందమైన నొక్కుల జుత్తు. చామన చాయ. ఆకర్షణీయమైన మీసాలు. నడకలో హుందాతనం!!

సౌమ్యరాజులు వెళ్ళేముందు చేసిన వర్ణన గుర్తొచ్చింది జలంధర్ కి.

అతడే! అతడే కమలినిని తరచూ కలుస్తున్నది! ఈ గూడుపుఠాణి ఇంతటితో సమాప్తం కావాలి!!

'అతడు' తలవంచుకొని వడివడిగా అడుగులేస్తూ తన ముందు నుండే సాగిపోతున్నాడు....

"మిష్టర్ ...." పిల్చాడు జలంధర్ కారు దిగి....

ఆగి, నిర్లక్ష్యంగా చూశాడతడు.

"నీ పేరు?"

"అడ్డమైన వాళ్ళందరికీ నా పేరు చెప్పాలని రూలు లేదు."

"చెప్పకపోతే నిన్ను వదిలి పెట్టాలనికూడ రూలులేదు" వాక్యం పూర్తికాకముందే అతని మెడపై 'గురి'చూసి ఒక్క దెబ్బవేశాడు జలంధర్.

అతని కళ్ళముందు చుక్కలు నాట్యంచేశాయి. తోటకూర కాడలా వాలిపోతోన్న అతన్ని కారు బ్యాక్ సీట్లోకి తోశాడు జలంధర్. డోర్ వేశాడు.

ఆలస్యంచేస్తే కమలిని ఫీలింగ్స్ చూసే అవకాశం మిస్సయిపోతుంది. వడివడిగా అడుగులు వేశాడు. అరగంట దాకా వీడు లేచే ప్రసక్తి లేదని గొణుక్కుంటూ.

తలుపులు తెరిచే వున్నాయి. నేరుగా లోనికి నడిచాడు.

బట్టలు సర్దుకుంటోన్న కమలిని జలంధర్‌ని చూసింది. ఒక పురుషుని విదిలించినప్పటి భావాలు ఆమె ముఖంలో ఇంకా లీలగా గోచరిస్తున్నాయి. అతన్ని చూడగానే ఆమె మొహం యథాలాపంగా—నిర్వికారంగా—మారి పోయింది.

"మీ ప్రయత్నం ఫలించిందా జలంధర్ గారూ!?" నిర్వికారంగానే అడిగింది కమలిని.

"ఎలా ఫలిస్తుంది? మీలాంటి ముఖ్యులే కీలకపాత్ర వహించి రహస్యాలు దాచి విషయాలు—ముఖ్యమైన విషయాలు దాటవేసి...."

"నేనా!?"

"అవును మీరే!" కాస్త విసుగ్గా అన్నాడు జలంధర్. "శర్మకి అదివరకే వివాహమైందనీ మీరు రెండవ భార్య అనీ నాతో ముందుగానే ఎందుకు చెప్పలేదు?"

"అవసరంలేదు గనక!!"

"ఏది అవసరంలేదు? భార్య బ్రతికుండగా మరో వివాహం చేసుకున్న సమాచారం అవసరంలేనిదా? పరి శోధనకి ఎంతో విలువైన పాయింట్ అది. కమలిని గారూ మీకు తెలీదు. ఒక్కో సమయంలో—సరైన సమా చారం దొరకటం ఒక్క క్షణం ఆలస్యమైతే ఆ కేసు సక్రమమైన దారిలో నడిచి ముగింపు చేరటానికి ఒక జీవితకాలం సైతం పట్టవచ్చు.

"ఇప్పటికైనా మించిపోయిందిలేదు. శర్మ మొదటి భార్య పేరు సంయుక్త అనీ ఆమె యిప్పటికీ నిక్షేపంగా వుందనీ నాకు తెల్సిపోయింది. చెప్పండి. ఆమె బ్రతి కుండగా అతడు రెండో వివాహం ఎందుకు చేసుకోవాల్సి వచ్చింది? ఇంత చదువు చదివిన మీరు ఆమెకి ద్రోహం

చేస్తున్నానన్న భావన రానీయకుండా ఓ వివాహితుడికి ఆరాగా ఎందుకు కావాలని వచ్చిందీ?"

"తెలుసుకోగలవారు మీరు. ఇదీ తెల్సుకోలేక పోయారా?"

ఖంగుతిన్నాడు జలంధర్. ఆమె భయపడుతుందనీ, బాధపడుతుందనీ ఏదో దౌర్బల్యం అనో మరేదో చెప్తూ ఉంటుందనీ భావించాడు తను. కాని ప్రశ్నకి సమాధానంగా ప్రశ్న వేస్తుందనుకోలేదు....

"కూర్చోండి...." మృదువుగా అంది కమలిని.

"ఫర్వాలేదు. చెప్పండి ..."

"కూర్చోండి!!" ఈసారామె కంఠంలో ఆజ్ఞ ధ్వనించింది.

మంత్రముగ్ధుడిలా కూచున్నాడు.

ఒక్కొక్క క్షణం ఒక్కొక్క నిమిషంలా—అరవై క్షణాలు గడిచాయి.

"సంయుక్త. 'హెర్మాఫ్రొడైట్' జలంధర్ గారూ!" అంది కమలిని. ఆమె మాటల్లో శూన్యం తప్ప మరేమీ లేదు.

అదిరిపడ్డాడు జలంధర్.

హెర్మాఫ్రొడైట్!! అంటే....

ద్విలింగజీవి!!!

"....దయచేసి వివరంగా చెప్పండి...." ఎగ్జయిట్‌మెంటుతో వూగిపోతూ అన్నాడు.

"డెలివరీ ఇంట్లో జరిగింది. సంయుక్త భూమ్మీద పడగానే మంత్రసాని అదిరిపడింది. వాళ్ళది పల్లెటూరు కావడంతో, సడన్‌గా నెప్పులు రావటంతో మంత్రసానిని పిలిపించారు.

"డెలివరీ సమయంలో శిశువు కాళ్ళు ముందుగావస్తే మంత్రసానికి గండం అని ఓ మూఢనమ్మకం వుంది. అలాంటి శిశువుల్ని మంత్రసానులు గొంతు నులిమి చంపేసి మృతశిశువు పుట్టిందని చెప్పటంకూడకద్దు.

డెలివరీ సవ్యంగానే జరిగింది. కాని విపరీతమైన వింతతో పుట్టింది శిశువు. శిశువుకి స్త్రీ పురుష సంబంధమైన మర్మాంగాలు రెండూ వున్నాయి! మంత్రసాని అదిరిపడింది. వణికిపోయింది. శిశువుని చంపాలని ప్రయత్నించింది. కాని శిశువు అమ్మమ్మ ప్రక్కనే వుండటంతో అది సాధ్యంకాలేదు.

"అది ఎంతో అరిష్టదాయకమని చెప్పింది. తనకీ వాళ్ళకీకూడ ముప్పు తప్పదని వాపోయింది. బాలింత తల్లిదండ్రులు కుమిలిపోయారు. ఈ విషయం ఎక్కడా పొక్కనీయవద్దని వారు మంత్రసానిని పరిపరివిధాల బ్రతిమాలారు. అందుకోసం వారామెకి లంచంగా పుష్కలంగా డబ్బు సమర్పించారు.

"మూఢనమ్మకాలకి బానిసైన ఆ మంత్రసాని ఆ రాత్రే ఊరొదిలి వెళ్ళిపోయింది.

"అప్పుడప్పుడూ నిద్రలోనే నవ్వుతూ సమగ్రమైన అమాయకత్వాన్ని వెదజల్లుతోన్న ఆ చిన్నారి శిశువుని చూసేసరికి వారికి దుఃఖం ఆగలేదు.

"గుట్టుచప్పుడు కాకుండా శిశువుని పెంచుతూ వచ్చారు.

"శిశువు ఆడో మగో తెలీలేదు. తెల్సుకుందామనుకుంటే— తెల్సినవాళ్ళ నడగాలి. పెదవి దాటితే పృథ్వి దాటుతుంది. గుడ్లనీరు కుక్కుకుంటూ గుట్టుచప్పుడు కాకుండా వుండిపోయారు.

"శిశువుకి నామకరణం చెయ్యలేదని గ్రామంలో గుస గుసలు బైలుదేరాయి. శిశువుకి సంవత్సరం వయసు వచ్చింది. ఏదో కారణం చెబుతూ వస్తున్నారు.

"రానురాను యిది వాళ్ళకే పెద్ద పజిల్‌గా పరిణమించింది.

"జెనెటల్ ఆర్గన్స్‌కొస్తే మగ శిశువుకి పెనిస్, దాని క్రింద టెస్టికల్స్ వుండాలి. ఆడ శిశువుకి క్లైటోరిస్, దానిక్రింద యూరిత్రా వుండాలి. కాని ఈ శిశువుకి అంగుళం పొడవు క్లైటోరిస్ వుంది. దానిక్రింద భాగంలో వృషణాలున్నాయి. వృషణాల క్రిందభాగంలో యూరిత్రా వుంది!!

"మూత్రం యూరిత్రాలోంచి విసర్జించబడటాన్ని బట్టి కంఠస్వరం ఆడపిల్లలా ధ్వనించటాన్ని బట్టి, అంగుళం పొడవున్న భాగం చివర మూత్రద్వారం లేకపోవటాన్ని బట్టి దాన్ని పెనిస్‌గాకాక క్లైటోరిస్‌గా ధృవపరచుకోటాన్ని బట్టి ఆ శిశువుని 'మగలక్షణాలున్న ఆడపిల్ల'గా భావించి 'సంయుక్త' అని పేరు పెట్టారు.

"సంయుక్త పెరిగి పెద్దవుతోంది. ఆమెతో బాటే ఆమె తలిదండ్రుల గుండెల్లో బాధకూడ పెరుగుతోంది. అప్పుడు సంయుక్తకి పన్నెండు సంవత్సరాలు.

"అప్పుడా అమ్మాయికి పన్నెండు సంవత్సరాల బాలుడికి పెనిస్, వృషణాలు ఏ సైజులో వుంటాయో ఆ సైజులో—అంటే పెనిస్ సైజులో క్లైటోరిస్ వుంది. సంయుక్త అన్న పేరుని సార్థకం చేస్తూ బ్రెస్టు (వక్షోజాలు) పెరగనారంభించింది.

"తల్లిదండ్రుల్లో తెగింపు వచ్చేసింది. సంయుక్త భవిష్యత్తుగూర్చి కొత్త దిగులు పట్టుకుంది. డాక్టర్ని

కన్సల్టు చేస్తే ఆమె సంపూర్ణమైన ఆడపిల్లగా మారొచ్చునేమోనన్న ఆశ చిగురించింది. ఈ ఊరొచ్చి డాక్టర్ని కలిశారు.

"ఇన్ని సంవత్సరాలు ఆలస్యం చేసినందుకు డాక్టరు మందలించాడు. సంపూర్ణమైన ఆడపిల్లగా మారే అర్హత ఆ జీవికి లేదు. ఎందుకంటే ఇలాంటి రెండు లక్షణాలు పుచ్చుకొని పుట్టిన వాళ్ళలో రెండురకాల అర్గాన్సూ పరిపూర్ణ దశకి ఎదగలేవు. అయినా శరీర బాహ్యపరిస్థితిని కంటి తుడుపుగా సవరించటానికి చిన్నతనంలోనే అయితే మరింత బాగుండేది.

"అయినా డాక్టరు అభయమిచ్చాడు. ఆపరేషన్ చేసి వృషణాలు తీసివేశాడు. క్లిటోరిస్ పొడవు తగ్గించి సాధారణంగా ఆ వయసు ఆడపిల్లకుండే సైజుకి సవరించాడు.

"ఆ సందర్భంగా మరో దారుణమైన నిజం బైట పడింది. సాధారణంగా ఇలాంటి కేసుల్లో యుటెరస్ (గర్భాశయం) వుండొచ్చు, వుండకపోవచ్చు. సెక్స్ కోరిక వుండొచ్చు, వుండకపోవచ్చు ఓవరీస్ వుండటం మూలాన బ్రెస్టు డెవలప్ అయిందిగాని సంయుక్తకి యుటెరస్ పూర్తిగా లేదు! వజైనాకూడ పూర్తిగా లేదు!!"

నోరు తెరుచుకొని ఆశ్చర్యంగా వింటోన్న జలంధర్ అప్రయత్నంగా 'మైగాడ్' అన్నాడు. "అయితే...."

"మీ సందేహం నాకు తెల్సు. కాని చాలామందికి తెలీదు. స్త్రీ మర్మాంగంలో యురితా వజైనా అని రెండు భాగాలుంటాయి. యూరినరీ బ్లాడర్ (మూత్ర కోశం) నుండి ఒక నాళం—అదే మూత్రనాళం—

మర్మాంగంలోకి కలుపబడి వుంటుంది. క్లైటోరిస్ క్రింది భాగాన వుండే రంధ్రం దాటాక కొన్ని మిల్లీమీటర్ల దూరంలోనే యురిత్రా వుంటుంది. అందులోంచి యూరిన్ తప్ప మరేమీ రాదు. అక్కణ్నుంచి యుటెరస్ వరకూ వుండే కెనాల్ ని వెజైనా అంటారు.

"ఈమెకి వెజైనా లేదు. ఆర్టిఫిషియల్ వెజైనా వైద్యశాస్త్రంలో సాధ్యమే! కాని యుటెరస్ కూడ లేక పోవటంతో ఆర్టిఫిషియల్ వెజైనా అవసరం లేక పోయింది. అయినా సెక్స్ కోరిక వుండటానికి పదిశాతమైనా అవకాశముంది గాబట్టి ఆర్టిఫిషియల్ వెజైనా అమర్చాడు డాక్టరు. అయితే రీప్రొడక్షన్ కి నూరు శాతం అనర్హురాలని చెప్పేశాడు. ఫీమేల్ హార్మోన్స్ తో ట్రీట్ మెంట్ కోర్సు పూర్తిచేసి పంపించాడు.

"పద్దెనిమిదేళ్ళొచ్చాయి సంయుక్తకి. బాహ్య ప్రపంచానికి అందంగా, పరిపూర్ణ యవ్వనవతిగా కనిపించే సంయుక్తలో ఇన్ని లోపాలున్నాయని, సంతానయోగం లేదని ఎవ్వరూ అనుకోరు.

"సంయుక్త తలిదండ్రుల్లో స్వార్థం ఉరకలు వేసింది. 'గుండెలమీది కుంపటి'ని తొలగించుకోవాలనే తాపత్రయ పడ్డారుగాని ఆమె మరో మగాడి జీవితంలోనే కుంపటవుతుందని వారనుకోలేదు. పెళ్ళిసంబంధాలు చూశారు. 'వారికి' ముడివేశారు.

"తొలిరాత్రే బండారం బైటపడింది. పన్నెండేళ్ళొచ్చేవరకూ ఆమె శరీరంలో పురుష మర్మాంగాలు కూడ పెరగటంతో ఆదోరకమైన జుగుప్సా భావన ఆమెలో పెరుగుతూ వచ్చింది. దానికితోడు శారీరక ధర్మాలుకూడ వ్యతిరేకించటంతో ఆమెలో సెక్స్ కోరిక

పూర్తిగా నశించింది. మొదటి రాత్రి సెప్పని వ్యతిరే కించింది. భోరుమని యేడుస్తూ భర్తకన్ని విషయాలు చెప్పేసింది.

"కాని వారు దేవుడు. మనిషి జీవితంలో, జన్మ, పెళ్ళి, మరణం ఒక్కసారేనని భావించే వ్యక్తి ఆయన. రెండు సంవత్సరాలు భరించారు. సంయుక్త పేరంట్సు కూడ పశ్చాత్తాపపడ్డారు. వారి మంచితనాన్ని భరించలేక పోయారు. తమ కూతురికి అందరిలాగే వివాహమైంది. సంయుక్త అందరి ఆడపిల్లలమల్లే సంసారం చేస్తోంది అని అందరూ అనుకోవటమే వాళ్ళకాక్కావలసింది. అలా జరిగింది గాబట్టి వారి అల్లుడుగారి గురించి ఆలోచించడం మొదలు పెట్టారు.

"తను సాంసారిక జీవితానికి అనర్హురాలననీ తన భర్త మరో వివాహం చేసుకోవటానికి తనకభ్యంతరమేమీ లేదనీ సంయుక్తతో ఉత్తరం రాయించారు.

"చెప్పండి జలంధర్ గారూ! ఇందులో తప్పెవరిది? జన్మతో నే పుట్టుకు 'లోపాలతో' పుట్టిన సంయుక్తదా? ఆ సంగతి దాచి వివాహంచేసిన ఆమె పేరం ట్సుదా? లేక యివేవీ తెలీక ఆ అమ్మాయిని పెళ్ళాడిన శర్మగారిదా?" బాధ, ఆవేదన, కోపం కలిసిన స్వరంతో అడిగింది కమలిని.

"శర్మ మొదటి వివాహం విషయం చెప్పకపోవటంతో శర్మ హత్యకి సంయుక్తకి సంబంధించిన వ్యక్తులు కారణ మనుకున్నానుగాని దీని వెనక ఇంత విచిత్ర చరిత్ర వుం టుందని వూహించలేకపోయాను. మానవ శరీర ధర్మ శాస్త్రం యింత వికృతంగా కూడ వుండొచ్చని యివాళే తెలుసుకున్నాను. పైదిపై, ఇలాంటి పుట్టుకలకి ప్రత్యేక

మైన కారణం అంటూ వుంటుందా? అయ్ మీన్ — మేనమామనో మేనబావనో చేసుకోవటంవల్ల ...."

"నో...." అడ్డంగా తలాడించింది కమలిని. "దానికీ దీనికీ సంబంధం లేదు."

"అయితే దీన్ని శిశువు తల్లి గర్భంలో వుండగానే పొందిన జబ్బు అనుకోవచ్చా?"

"అలాకూడ వీల్లేదు. దిసీజ్ అబ్నార్మాలిటీ!!"

"అబ్నార్మాలిటీ! యూ మీన్ — అసాధారణ పరిస్థితి!?"

"అవును. నూటికో కోటికో ఒక్కటి సంభవిస్తూంటుంది ఇలా."

"ఈ పరిస్థితిని గూర్చి డాక్టర్ ట్రీట్‌మెంట్, సజెషన్స్ గూర్చి ఇంత విపులంగా ఎలా చెప్పగలిగారు?"

"సంయుక్తని ట్రీట్ చేసిన డాక్టరు మా చిన్నాన్నే జలంధర్ గారూ!"

"అయ్‌సీ ..."

"తర్వాత తెలిసింది నాకు...."

"అయినా ఇంత విపులంగా చెప్పగలిగారంటే మీరు వృత్తిరీత్యా డాక్టరు కాకపోయినా...."

"నేను ఫిజియాలజీ లెక్చరర్ని జలంధర్ జీ...." అంది కమలిని.

ఫిజియాలజీ!

మానవ శరీర ధర్మశాస్త్రం!!!

దా ని గు రిం చి క మరేమీ మాట్లాడలేకపోయాడు జలంధర్.

"మరొక్క సందేహం...." అన్నాడు ఆమె పర్మిషన్‌తో సిగరెట్ వెల్గించుకున్న కాసేపటికి.

"అడగండి...."

"జీవితంలో మనిషికి జన్మ, వివాహం, మరణం ఒక్క సారేనన్న సిద్ధాంతాన్ని నమ్మిన మీ వారు—అఫ్‌కోర్స్ విధి అతనితో ఒకసారి ఆడుకుందనుకోండి—అయినా..."

"సిద్ధాంతాన్ని సైతం ఖాతరు చెయ్యక రెండో వివాహం—అంటే నన్ను చేసుకున్నారు.... మానవధర్మం ముందు—వయసొచ్చిన మగాడుగా సెక్స్ + సాంసారిక అనుభవాలముందు తన ఆశయాన్ని గడ్డిపోచని చేశారు. ఎందుకు? కారణం వయసా? కోరికలా? నేనా? నా అందమా? ఇవేకదూ మీ అనుమానాలు?"

అవునన్నట్టు తలూపాడు జలంధర్.

"వినే ఓపికుందా?".

"ఓపిక కాదు. నా డ్యూటీ అది. నేనిప్పుడు కథలు వినటానికి రాలేదు పరిశోధన నిమిత్తం వచ్చాను. తెల్సుకోదగినవి సమగ్రంగా తెల్సుకోకపోతే పరిశోధన సాగదు. మీకై మీరు చెబితే నాకు శ్రమ తగ్గించిన వారవుతారు" అన్నాడు జలంధర్.

## 13

కమలిని చాల పేదకుటుంబంలోంచి వచ్చిన పిల్ల. తెలివితేటల్లో స్కాలర్‌షిప్పులతో ఒక్కో మెట్టూ పైకెక్కుతూ వచ్చింది. కమలిని తండ్రి ఒక ప్రభుత్వ కార్యాలయంలో అటెండరు. తల్లి పాతకాలంనాటి మనిషి.

కూతురికి చదువుపట్లగల ఆసక్తి గమనించి బాగా ప్రోత్సహించాడు తండ్రి.

మాస్టర్ డిగ్రీ తీసుకున్న కొద్దిరోజులకే కమలినికి ఉమెన్స్ కాలేజీలో లెక్చరర్ పోస్టు వచ్చింది. రామ

శాస్త్రి అనారోగ్యంతో, దిగులుతో మంచం పట్టాడు. కూతురు వివాహం కళ్లారా చూసి కన్ను మూయ్యాలని అతని కోరిక.

కుమార్ పి.డబ్ల్యు.డి.లో జూనియర్ ఇంజనీరు. బాగా డబ్బున్నవాడు. విలాసపురుషుడు. అయితే కమలిన్ని చూశాక అతనికి 'మగాడు పెళ్ళిచేసుకోవాలి' అనిపించింది.

రామశాస్త్రిని కలిసి మాట్లాడాడు.

డబ్బుంది. హోదా వుంది. అందముంది. చదువుంది. మంచి ఉద్యోగముంది. పైగా మగపిల్లాడు ఆడపిల్ల ఇంటికి వచ్చి అడుగుతున్నాడు. ఒక సగటు ఆడపిల్ల తండ్రికి అంతకంటే ఏం కావాలి?

కమలినికూడా వరుడు నచ్చాడు.

కట్నం అడగలేదు. పెళ్ళి సింపుల్‌గా తిరుపతిలో జరిగిపోవాలని తీర్మానించుకున్నారు. నో వెడ్డింగ్ కార్డ్స్ నథింగ్.

తీరా అక్కడికెళ్ళాక పెళ్ళి దైవసన్నిధిలో కాక— తాము తీసుకున్న కాటేజీలో జరగాలని పట్టుబట్టాడు వరుడు.

కమలినికి యివేవీ పట్టలేదు. జన్మనిచ్చిన తలిదండ్రులు తన వివాహం చూడాలని కోరారు, తను తీర్చబోతోంది. అంతే. ఆ సమయంలో ఆమెకి ప్రత్యేకించి కోరికలేమీ లేవు.

వివాహమయ్యాక దైవదర్శనానికి ఏర్పాట్లు జరిగాయి.

మంగళసూత్రధారణ సమయంలో పెళ్ళి ఆపుచేశాడు కుమార్.

"కమలిని బాగా చదువుకున్న అమ్మాయి. అందు

లోనూ హాస్టల్లో వుండి చదువుకున్న పిల్ల. నా ఫ్రెండ్స్ అభిప్రాయం ప్రకారం అమ్మాయిల కేరెక్టర్ మంచిది కాదు. వారి అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తున్నాను. ఎవరైనా లేడీ డాక్టర్ ఆమెని యిప్పుడే పరీక్షించి ఆమె కన్నెపిల్ల అని ధృవపర్చే పక్షంలో వధువు మెళ్ళో తాళి కట్టడానికి నాకభ్యంతరం లేదు" అన్నాడు.

పెళ్ళిజనంలో హాహాకారాలు చెలరేగాయి. కాని అవి గుసగుసలుగానే వుండిపోయాయి. పెళ్ళికొడుకుని తిట్టుకోని మనిషి లేడు. దైవసన్నిధిలో గాక కాలేజిలో పెళ్ళి జరగాలని యెందుకు పట్టుపట్టాడో అప్పుడర్థమైంది. ఎవడో దగుల్బాజీ వెధవ సలహా యిచ్చివుంటాడు.

మానవత్వాన్ని హత్య చేసిన వేళ అది.

ఆడతనాన్ని ఉరికంబం ఎక్కించిన వేళ అది.

నమ్మకం అన్న పదాన్ని అగ్ని సమాధి చేసిన వేళ అది.

అలాంటి ఆ నికృష్ట క్షణాల్లో కమలిని కళ్ళమ్మట రెండే రెండు కన్నీటి కణాలు—ఎదుటున్న హోమంలో పడి దగ్ధమైపోయాయి.

ఆహూతుల్లో ఒక డాక్టరమ్మ వుంది. ఆవిడ లేచింది. ఆమె మగపెళ్ళివారి తరఫున వచ్చిన మనిషే.

నెమ్మదిగా ప్రక్కగదిలోకి పిల్చుకుపోయింది. పది నిమిషాల్లో వధువుతో కల్సి బైటికి వచ్చింది.

"మంచికీ మానవత్వానికీ నమ్మకానికీ ఆడతనానికీ పట్టాభిషేకం చేసింది మిస్ కమలిని. ఆమె ఈక్షణం వరకూ 'కన్య' అని చెప్పటానికి గర్విస్తున్నాను" అని చెప్పి కూచుంది.

కుమార్ మొహంలో గర్వం కదలాడింది. ఫ్రెండ్సం

దరకేసీ ఒక్కసారి గర్వంగా చూసి పీటలమీద కూచు న్నాడు.

మంగళసూత్రధారణ సమయం వచ్చింది.

"ఒక్కనిమిషం...." అంది కమలిని పురోహితుడితో.

మంత్రోచ్చారణ ఆగిపోయింది.

సూదిపడితే వినిపించేంతటి నిశ్శబ్దం అలముకుంది వివాహ మంటపంలో.

కమలిని కంఠం ఖంగున పలికింది.

"తన భార్య స్ఫటికం కన్నా స్వచ్ఛంగా ప్రకృతి కంటే పవిత్రంగా వుండాలని కోరుకోవటంలో మగాడి తప్పేమీ లేదు. అంచేత కుమార్ గార్ని నేను తప్పుపట్టడం లేదు. పైగా ఇంతమందిలో తన కాబోయే అర్ధాంగికి శీల పరీక్ష జరిపి మరీ ఋజువు చేసినందుకు ఆనందంగా వుంది.

అలాగే వధువుకి—అయ్ మీన్ ఆడపిల్లకూడ తన భావి జీవిత భాగస్వామి అస్ఖలిత బ్రహ్మచారిగా వుండాలని మనసా వాచా కోరుకుంటుంది. ఒక భారత దేశపు సగటు ఆడదానిగా నాకూ అలాంటి కోరికుంది. పెళ్ళిపెద్దలో మగ డాక్టర్లున్నారు. ఎవరైనా ఈ నిమి షంలో వరుణ్ని అస్ఖలిత బ్రహ్మచారిగా నిరూపించ గలిగితే తలవంచి తాళి కట్టించుకోవటానికి నా కేమీ అభ్యంతరంలేదు."

కుమార్ గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టయింది.

శీల పరీక్ష!

తనకి!!

మగాడికి శీల పరీక్ష???

ఎలా.... ఎలా సాధ్యం!?

అహూతుల పెదవులపై దరహాసం! అమ్మలక్కల

కుండెలనిండా గర్వం!! కమలినిపై అభినందనలు వర్షంలా కురిశాయి.

"నిరూపించుకోవోయ్ నీ పవిత్రతనికూడ!!"

సలహాలు!

అరుపులు!!

కేకలు!!!

అదే సలహా వందలసార్లు ఖంగున మ్రోగింది.

"అదెలా సాధ్యం? ఆడదానికైతే...." ఏదో అన బోయాడు కుమార్.

"ష....ట....ప్....!!!" నవనాడుల్నీ కూడదీసుకొని గర్జించింది కమలిని. "యూ బ్లడీ బాస్టర్!! పేద రికాన్ని ఆసరాగా తీసుకొని పరిస్థితుల్ని బానిసగా చేసుకొని ఒక ఆడదాన్ని కట్నంలేకుండా—జాలితో—సానుభూతితో చేపడుతున్నానన్న గర్వంతో కన్నూ మిన్నూ గానక నీ యిష్టంవచ్చినట్టు ఆడుకుందామను కున్నావురా!?

"తలిదండ్రుల చివరికోరిక తీర్చటంకోసం ఆశయాల్ని సైతం చంపుకొని తలవంచిన ఆడదాన్ని ప్రేమతో అక్కున చేర్చుకుంటే అనంత జీవనవాహినిగా మిగిలి పోతుంది. అవమానించి ఆడుకుందామని చూస్తే అపర కాళిగా విజృంభిస్తుంది. పవిత్రతమీద నమ్మకంలేని నీకు పవిత్రత అన్న పదానికి అర్థంకూడ తెలీదు. నీ పవిత్రతని నిరూపించలేని నీకు పవిత్రతని అక్కున చేర్చుకొని లాలించే అర్హతలేదు. గెటవే ఫ్రమ్ హియర్....!!"

మెడలోని పూలదండనీ నుదుటి బాసికాన్నీ భగ భగ మండుతోన్న హోమంలో వేసింది కమలిని.

ఆ గదిలోని విష వాతావరణంతోబాటు అదికూడ

మాడి బూడిదైపోయాయి.

కుమార్, అతని ముఖ్యులు నిష్క్రమించారు.

గంభీర వాతావరణం నెలకొంది.

కమలిని కళ్ళలో అశ్రుబిందువులు రాజ్యంచేస్తున్నాయి. కర్తవ్య మూఢురాలై అచేతనంగా సజీవ శిల్పంలా నిల్చుండిపోయింది.

ఇందాక కమలిన్ని పరీక్ష చేసిన లేడీ డాక్టర్ నిలుచుంది.

"ఈ అమ్మాయి వయసులో నాకంటే నే కాదు. ఇక్కడున్న ఎందరికంటేనో చిన్నది. కాని వ్యక్తిత్వంలో అందరికంటే ఎదిగిపోయింది. తిరుమల శిఖరాన్ని మించి ఎదిగిపోయింది. ఏ వ్యక్తిత్వాన్ని నమ్ముకొని-ఏ ఆడజాతికి ఔన్నత్యాన్ని తీసుకొచ్చే తలంపుతో ఈ పని చేసిందో- ఆ అమ్మాయిలోని వ్యక్తిత్వాన్ని, ఆ అమ్మాయిలోని ఔన్నత్యాన్ని కాపాడాల్సిన, నిలబెట్టాల్సిన బాధ్యత మనమీదుంది.

ఈ ముహూర్తానికే ఈ అమ్మాయి వివాహం జరిపించటం మన విధి. ఈమె ఆదర్శాన్ని గౌరవించి ఈమె వ్యక్తిత్వానికి విలువిచ్చి ఈమె ఔన్నత్యాన్ని అవగతం చేసుకొని అర్ధాంగిగా తనలో సగభాగాన్ని అర్పించి భర్త అంటే కేవలం భరించువాడుగాకాక ఆమెలో సగాన్ని ధరించేవాడుగా, ఆమెను వరించేవాడుగా మీలో ఏవరైనా ముందుకువస్తే-ఆ యువకుణ్ని పెళ్ళాడుతుంది. సహృదయుదెవరైనా వుంటే దయచేసి ముందుకు వచ్చి పాణిగ్రహణం చెయ్యండి...."

భయంకర నిశ్శబ్దం....

ఎవరి గుండె చప్పుడు వారికే విన్పించేంత నిశ్శబ్దం.

క్షణాలు—నిమిషాలు గడుస్తున్నాయి.

నెమ్మదిగా గుసగుసలు....

సందిగ్ధత....

"ఎవరూ లేరా?" అన్న మాటలు....

అయిదు నిమిషాల తర్వాత....

గంభీరమైన రెండు పెదవులు 'నే నున్నాను' అన్నాయి.

ఆ పెదవులకి సంబంధించిన రెండు పాదాలు కమలిని వైపు సాగిపోయాయి. నిండుకుండలా తొణక్కుండా.

ఆ వ్యక్తి....ఆ మహోన్నత వ్యక్తి....

## 14

"....ద త్తపది మార్కండేయశర్మ" అన్నాడు డిటెక్టివ్ జలంధర్.

అవునన్నట్టుగా రెండు అశ్రుకణాలు ఆమె కళ్ళలోంచి జారి ఆమె ఒడిలో ఇంకిపోయాయి.

కర్చీఫ్‌తో కనులు వత్తుకున్నాడు జలంధర్. "అపరాధ పరిశోధక వృత్తిలో ఎన్నో నేరాలు చూశాను. ఎన్నో హత్యలు చూశాను. ఎన్నో దారుణాలు చదివాను, ఎదుర్కొన్నాను. కాని ఇలాంటి దారుణ వాస్తవాన్ని జీర్ణించుకోవటం యిదే మొదటిసారి...."

"మా వివాహం జరిగిపోయింది. ఆశీస్సులందుకోవటం కోసం మా నాన్నదగ్గరికి వెళ్ళి కెవ్వుమన్నాను. ఆయన ప్రాణవాయువులు అనంత వాయువుల్లో ఎప్పుడో లీన మయ్యాయి. పెళ్ళి భంగమవుతుందని యెవ్వరూ చెప్ప డించలేదు.

"ఆయన ఆశయం అలా భంగమైంది జలంధర్ గారూ...."

"నో నో .... ఆయన ఆశయం యేమాత్రం భంగం కాలేదు. ఆయన సిద్ధాంతానికి ఆయన చర్య వన్నె తెచ్చింది. ఆశయాలు సిద్ధాంతాలు అంటూ వాటిని పట్టుకొని వ్రేల్లాడ్డంకంటే — వాటితో మరో క్రొత్త ఊపిరికి జీవం తీసుకురాగలిగితే అంతకుమించిన సార్థకత దేనికీ వుండదు. పైదిపై.... శర్మపై పగబట్టడానికి కుమార్‌కి యెక్కువ అవకాశం వుంది. తనకే దక్కని మనిషి — తనని అసహ్యించుకున్న మనిషి మనఃపూర్వకంగా మరొకరికి సొంతమైందంటే ఆ పగకి అంతుండదు. ఆ పగ తీర్చుకోవటంకోసం ఆరుకాదు .... అరవై సంవత్సరాలైనా వెయిట్ చెయ్యగలడు...."

అడ్డంగా తలాడించింది కమలిని.

"లేదు జలంధర్ గారూ! అతడు మారిపోయాడు. ఆ తర్వాత అతన్ని — ఆనాడు శీలపరీక్షకి ప్రోత్సహించిన మిత్రులు సైతం అసహ్యించుకున్నారు. వరసగా పది మాను ఇరవై సంబంధాలు తప్పిపోయాయి. అతనిలో ఒకవిధమైన వైరాగ్యం ప్రవేశించింది. ఇంతవరకూ అతడు వివాహం చేసుకోలేదు. అప్పుడప్పుడూ మా యింటికి వచ్చి పశ్చాత్తాపం ప్రకటించి వెళ్ళిపోతుంటాడు. మీరొచ్చేముందుకూడ వచ్చాడు...."

అదిరిపడ్డాడు జలంధర్, "యూమీన్..యశ్వంత్!?"

ఆశ్చర్యంగా కమలిని అతన్ని చూసింది. "అవును. యశ్వంత్ కుమార్! మీకెలా తెల్సు?"

"తెల్సుకున్నాను. అతనికి మీపై పగ లేదా?"

"మచ్చుకైనా లేదు."

"అతడు అప్పుడప్పుడూ మీ ఇంటికి వస్తున్నట్టు మీ వారికి తెలుసా?"

"తెలుసు. వారి స్నేహితుడు. పెళ్ళికి వీరు హాజరైంది అతని పట్టానే కదా!"

"అతడు మీపట్ల యెన్నడూ అసభ్యంగా ప్రవర్తించలేదా?"

"లేదు."

"మీ యింటినుండి మరలిపోయేప్పుడు మొహం కందగడ్డలా చేసుకుపోతాడని విన్నాను. ఎందువల్ల?"

"నన్ను చూసినప్పుడు బహుశా గతం గుర్తుకి వచ్చివుండొచ్చు."

"అతడు మేకవన్నె పులి కాదని మీరు ఖచ్చితంగా చెప్పగలరా?"

"ఖచ్చితంగా చెప్పగలను. అయినా అతనికి దక్కబోతున్న నన్ను వారు బలవంతంగా లాక్కున్నారా? లేదే! యశ్వంత్ మూర్ఖత్వంతో జారవిడుచుకున్నాడు. వారు సహృదయంతో లేవనెత్తారు. వారిపై పగబట్టడానికి అతనికాస్కారమే లేదు. ఇందాక వచ్చినప్పుడు ఇకపై ఈ ఇంటికి రానని నా మొహం చూడలేనని చెప్పి వెళ్ళాడు...." చివరి వాక్యం అంటున్నప్పుడు కమలిని కంఠంలో జీర ధ్వనించింది.

"శర్మగారి మరణం సంయుక్త వాళ్ళలో ఎలాంటి రియాక్షన్ కల్గించింది?"

"పేపర్ న్యూస్ చదివి గుండెలు బాదుకుంటూ వచ్చారట. నేను అన్ కాన్షస్ స్టేజిలో వున్నప్పుడు చూసి మరలిపోయారట. వెళ్ళాక ఉత్తరం రాశాడు సంయుక్త నాన్న. బహుశ సంయుక్త కూడ యిప్పుడు నాలాగే..." ఆపై మాట్లాళ్ళేకపోయింది కమలిని.

"అన్నట్టు మీ అమ్మగారు...."

"సంవత్సరం క్రితం ప్రమాదంలో పోయారు."

"ప్రస్తుతం మీకు తోడు అవసరం. లేడీ కాన్‌స్టేబుల్‌ని సేఫ్టీలో పంపమంటారా?"

"థాంక్స్. అవసరంలేదు. కాని వారు వున్నప్పట్నుండి ఒకడు నాకేసి ఆకలి చూపులు చూసేవాడు. వారుండగా వాడి ఆటలు సాగలేదు. ఇప్పుడు విజృంభించవచ్చు. వాడిపై ఓ కన్ను వేయించండి చాలు...."

"ఎవడు వాడు?"

చెప్పింది కమలిని.

ఉలిక్కిపడ్డాడు జలంధర్.

•　•　•

డాడీ కారువద్దకి నడుచుకుంటూ వచ్చాడు. కారు బ్యాక్ సీట్లోకి తొంగిచూశాడు. ఖాళీగా వుంది. చుట్టుప్రక్కల చూశాడు. ఎవ్వరూ లేరు.

చిన్నగా నవ్వుకొని స్టార్ట్‌చేశాడు.

రంగుల రాట్నంతో గుర్రాన్ని పట్టుకొని తిరుగుతున్నట్టుంది పరిస్థితి. పరిగెత్తి పరిగెత్తి కాళ్ళు నెప్పెట్టడమే కాని యెంతదూరం వెళ్ళావ్ అనడిగితే జవాబు శూన్యం.

అష్టావధానంలో పద్యం యధాలాపంగా వచ్చి దాన్ని ప్రత్యేకంగా డైరీలో వ్రాసుకొని వుండొచ్చని భావించాడు తను. అండర్‌లైన్ చేసిన పదాలుకూడ అర్థాలు దొరక్కనో తెలీకనో వుంటాయనుకున్నాడు. శర్మ మొదటి వివాహం, కమలిని కొరకు యశ్వంత్ రావటం తెలీగానే అట్నుండి నరుక్కు రావచ్చనుకున్నాడు. కాని రెండు విషయాలూ సమగ్రంగా తెల్సుకున్నాక - మొదటిది శర్మపైనా రెండోది కమలినిపైనా సానుభూతిని సుమ్మరించిందే కాని శర్మ హత్యపై అనుమానితుల్ని సంపా

దించలేకపోయింది.

పోతే మిగిలింది డైరీ!

పద్యం!!!

అండర్ లైన్ చేసిన పదాలు!!!

వీటి ఆధారంగా ముందుకు సాగాలంటే ఆనాటి అష్టావధానాన్ని పూర్తిగా గుర్తుకి తెచ్చుకోవాలి. తెచ్చుకోగలడు కాని వాటిలో యేదైనా క్లూస్ దొరికితే పట్టుకోగల శక్తి ప్రస్తుతింలేదు.

# 15

సీలింగ్ ఫ్యాను నెమ్మదిగా తిరుగుతోంది.

ఆనాడు అష్టావధానంలో—కార్యక్రమం పూర్తిగా తిలకించటంతో ప్రతి అంశమూ బాగా గుర్తుండిపోయింది జలంధర్ కి. టేప్ రికార్డర్ లాంటి బుర్ర ఆనాటి కార్యక్రమాన్ని పూర్తిగా రికార్డు చేసింది.

నెమ్మదిగా కళ్ళు మూసుకున్నాడు జలంధర్. మస్తిష్కంపు టేప్ రికార్డర్ తాలూకు ఓ బటన్ నొక్కాడు.

ఎన్నో సంఘటనలు .... వేగంగా వెనక్కి వెళ్ళిపోతున్నాయి. రివైండ్ చెయ్యబడుతున్నాయి. అలా కాసేపు—రెండు మూడు బటన్లు నొక్కాక చప్పట్లు వినిపించాయి అవి—ఉగాదినాటి శర్మ అష్టావధానం ప్రారంభించబోయేముందు శర్మ చేసిన ప్రసంగానికి హర్షధ్వానాలు. ఆ తర్వాత....

• • •

అష్టావధానంలోని తొలి అంశం నిషిద్ధాక్షరి. పృచ్ఛకుడు గోపీనాథ్.

నిషిద్ధాక్షర పృచ్ఛకుడు ఏదైనా విషయం చెప్పి దానిపై పద్యం చెప్పమని అవధానిని కోరతాడు,

అవధాని పద్యంలోని మొదటి అక్షరాన్ని ప్రారంభించగానే పృచ్ఛకుడు రెండవ అక్షరాన్ని వూహించి ఆ అక్షరాన్ని నిషేధిస్తాడు. మరో అక్షరంతో అర్థం చెడకుండా పూరించాలి అవధాని.

అవధాని రెండో అక్షరం చెప్పగానే మూడో అక్షరాన్ని నిషేధిస్తాడు పృచ్ఛకుడు. ఆ అక్షరంకాక మరో అక్షరాన్ని ఉపయోగించాలి అష్టావధాని. నాలుగో అక్షరాన్ని వూహించి నిషేధిస్తాడు పృచ్ఛకుడు. నిషేధించిన అక్షరం ఉపయోగించకుండా పూర్తిచేస్తూ పోవాలి అష్టావధాని.

పద్యంలోని మొదటి మూడు పాదాలూ అలాగే సాగవచ్చు. లేదా పృచ్ఛకుడు నిషేధాన్ని మధ్యలో విరమించుకోవచ్చు. మళ్ళీ కంటిన్యూ చెయ్యవచ్చు.

ప్రాస అక్షరం, పద్యంలోని చివరిపాదం నిషేధించటానికి వీలులేదు.

....కార్యక్రమ ప్రారంభ సూచనగా నెమ్మదిగా లేచాడు గోపీనాథ్. “శర్మగారూ! కార్యక్రమంలోని తొలి అంశాన్ని గణేశ ప్రార్థనతో ప్రారంభించాలని నా అభిమతం. గజాననుని స్తుతిస్తూ కందం ప్రారంభించండి మరి....” అన్నాడు.

రెండు క్షణాలు కళ్ళు మూసుకొని పద్యంలోని తొలి అక్షరంగా ‘శా....’ అని, తర్వాతి అక్షరాన్ని నిషేధించవలసిందిగా గోపీనాథ్ వేపు చూశాడు అవధాని.

వేగంగా ఆలోచించాడు గోపీనాథ్. ‘శాస్తా’ అంటే ‘సర్వాన్నీ శాసించేవాడు’ అని అర్థం. అందుకని “అవధానిగారూ! ‘సకారాన్ని’ నిషేధిస్తున్నాను” అన్నాడు.

వెంటనే "....ంతా" అన్నాడు అవధాని.

ఇప్పుడు 'శాంతా' అన్న పదం తయారైంది. శాంతము గలవాడా అని దానర్థం.

గోపీనాథ్ మొహం పాలిపోయింది. ఇప్పుడు తను మూడో అక్షరం నిషేధించాలి. తను ఒక అక్షరం నిషేధిస్తే అతడు మరొక అక్షరంతో ఇంకో పదం తయారుచేసుకోవచ్చు. అంచేత పదం మధ్యలో నిషేధించాలి.

"శాంతా...." అని మరోసారని—'నిషేధిస్తావా?' అన్నట్టు చూశాడు శర్మ. లేదన్నట్టు తలాడించాడు పృచ్ఛకుడు.

"ధీ...." అన్నాడు శర్మ.

"రా....నిషేధిస్తున్నాను" అన్నాడు గోపీనాథ్.

వెంటనే 'దా....' అన్నాడు అవధాని.

'ధీరా' అంటే బుద్ధియందు రమించువాడా అనర్థం.

'ధీదా' అంటే బుద్ధి నిచ్చువాడా అనర్థం.

గోపీనాథ్ మొహం వివర్ణమయింది. 'ధీదా'తో పదం అయిపోయింది. తర్వాతి పదం యే అక్షరంతో ప్రారంభిస్తాడో!!

నిషేధం లేదన్నాడు.

"శ్రీ...." అని ఆగాడు అవధాని.

'శ్రీశా' అంటే సంపత్తు కలిగినవాడా అని అర్థం. ఆ పదం రాకుండా 'శా' అక్షరం నిషేధించబడింది.

'దా' అన్నాడు అవధాని, పద్యంలోని మొదటి పాదాన్ని పూర్తిచేస్తూ.

'శ్రీదా' అంటే సంపద నిచ్చువాడా అని అర్థం.

గోపీనాథ్‌కి మతిపోయింది.

"రెండవ పాదంలో మొదటి అక్షరాన్ని నిషేధించండి మరి...." అన్నాడు అవధాని.

అడ్డంగా తలాడించాడు గోపీనాథ్ కసిగా.

రెండో పాదంలో రెండో అక్షరం ప్రాసగాబట్టి, ప్రాస నిషేధించకూడదు గాబట్టి, రెండో పాదాన్ని ప్రారంభిస్తూ 'రంతా' అన్నాడు అవధాని. అంటే (పరబ్రహ్మమునందు) రమించువాడా అని అర్థం.

పదం అయిపోవడంతో నిషేధం లేదన్నాడు గోపీనాథ్.

తర్వాతి పదాన్ని ప్రారంభిస్తూ '....మ' అన్నాడు అవధాని.

'హ' నిషేధమన్నాడు పృచ్ఛకుడు.

'....ంతా' అంటూ ఆ పదాన్ని పూర్తిచేశాడు అవధాని.

'మంతా' అంటే (భక్తుల కష్టములను గూర్చి) ఆలోచించదగినవాడా అని అర్థం.

"గ" అన్నాడు అవధాని.

"జ" నిషేధించబడింది.

దానికి బదులుగా 'ణే' అన్నాడు అవధాని.

'శ్వ'లోని వకారాన్ని నిషేధించాడు గోపీనాథ్ 'గణేశ్వర' అని తీసుకుంటాడని.

'శ' అని మాత్రం అన్నాడు అవధాని.

ఆతర్వాత తోచక నిషేధం లేదన్నాడు గోపీనాథ్.

'గ' అన్నాడు అవధాని.

'ణ' నిషేధించబడింది.

'జ' అన్నాడు అవధాని.

ఆ తర్వాత నిషేధించలేకపోయాడు.

'ము' అన్నాడు అవధాని.

నిషేధించలేకపోయాడు పృచ్ఛకుడు.

'ఖ' అన్నాడు అవధాని.

గోపీనాథ్ బుర్ర పనిచెయ్యటం మానేసింది.

'దే' అన్నాడు అవధాని.

గోపీనాథ్ బుర్రలో మెరుపు మెరిసింది. ఇంతవరకూ రెండో పాదం 'రంతా! మంతా! గణేశ! గజముఖదే'తో ఆగిపోయింది. 'గజముఖ' అన్నది సంబోధన. 'దేహాంతా' అంటూ, చివరి రెండక్షరాల్ని మూడో పాదంలోని మొదటి అక్షరాలుగా వేసుకోవచ్చు. ప్రాస కావాలి కాబట్టి దేహభ్రాంతా అని అనవచ్చు.

"హాకారం నిషేధిస్తున్నాను" అన్నాడు రగులుతోన్న మనసుతో.

"వా" అన్నాడు అవధాని.

ఇప్పుడు 'గజముఖ దేవా' అనే పదంతో పద్యంలోని రెండో పాదం కూడ నిర్విఘ్నంగా పూర్తయింది.

ఇంకొక్క పాదంలో అక్షరాల్ని నిషేధించే హక్కు మాత్రమే గోపీనాథ్‌కుంది. నాలుగో పాదం నిషేధార్హమైనది కాకపోవటంతో మూడింట రెండు పాళ్ళు తినని ఓటమి వరించినట్టుగా అర్థమైపోయిందతనికి. గోపీనాథ్‌కీ మార్కండేయ శర్మకీ చాలకాలంగా స్నేహం వున్నా ఇది కేవలం అష్టావధానమే అయినా ఓటమిని భరించటం దుర్భరంగా వుంది గోపీనాథ్‌కి. ఆ కోపంతో మెదడు మొద్దుబారిపోయి యేవేవో పిచ్చి అక్షరాలు నిషేధాక్షరాలుగా ఊహాలో మెదలసాగాయి.

మూడో పాదంలో మొదటి అక్షరం నిషేధించబడలేదు. రెండో అక్షరం ప్రాసగాబట్టి నిషేధించటానికి

వీల్లేగు. మూడో పాదాన్ని 'సంతా....' అంటూ ప్రారంభించాడు అవధాని.

'న' నిషేధించాడు గోపీనాథ్.

శర్మ ఏదో అనబోయేంతలో ఎవరో గంటకొట్టారు. మరుక్షణం మద్దులేటి ప్రవేశించాడు.

(అష్టావధానంలో ఘంటాగణనం, అప్రస్తుత ప్రశంస అనేవి రెండు అంశాలు. ఘంటాగణనం పృచ్ఛకుడు నోటితో ఏమీ మాట్లాడాల్సిన పన్లేదు. కార్యక్రమం పూర్తయేలోగా తన యిష్టం వచ్చినప్పుడు అప్పుడొకటి అప్పుడొకటి చొప్పున గంటలు కొడుతుండాలి.

పోతే అప్రస్తుత ప్రశంస. ఈ పృచ్ఛకుడు యే అంశంలోనైనా మధ్యలో వచ్చి డిస్టర్బు చెయ్యొచ్చు. సందర్భంతో సంబంధంలేని ప్రశ్న అడుగుతాడు. అతనికి సరైన సమాధానం వెంటనే చెప్పాలి అవధాని. కార్యక్రమాన్ని కంటిన్యూ చెయ్యాలి.

ఇలా కార్యక్రమం అయిపోయేవరకూ అతని ప్రశ్నలకి జవాబులు యివ్వాలి. కార్యక్రమం చివర మొత్తం గంటలు యెన్ని అయ్యాయో కరెక్టుగా చెప్పగలగాలి. ఈ రెండూ అవధాని జ్ఞాపకశక్తికీ, ఏకాగ్రతకీ పరీక్ష పెట్టడం కొరకు నిర్దేశించబడ్డాయి. అప్రస్తుత ప్రశంస పృచ్ఛకుడిని అధికప్రసంగి అనికూడ అంటారు. అప్రస్తుత ప్రశంస పృచ్ఛకుడు మద్దులేటి)

"శర్మగారూ చిన్న సందేహం" అన్నాడు మద్దులేటి.

అడగమన్నట్టు చూశాడు అవధాని.

"ఒకచోట సాలెపురుగు గూడు కట్టుకుంది. ఒక ఈగ అందులోకి చిక్కింది. మీరు ఆ సమయంలో అక్కడే వున్నారు. జాలిగుండెమీది. ఈగని రక్షిస్తే

సాలె ఆహారాన్ని చేజేతులా దూరంచేసిన వారవుతారు. వూరకుంటే ఒక ప్రాణి అన్యాయంగా మీ కళ్ళెదుటే ప్రాణం పోగొట్టుకోబోతున్నా రక్షించని పాపి అవుతారు. ఆ క్షణంలో మీరేం నిర్ణయం తీసుకుంటారు?"

"కళ్ళు మూసుకొని దేవుని ప్రార్థిస్తాను" అన్నాడు అవధాని నవ్వుతూ.

"ఎందుకు?"

"ఈగకి మోక్షం ప్రసాదించమని."

"మీకు పాపం రాదా!?"

"ఏం చెయ్యమంటారు? నాకూ రక్షించాలనే వుంది. కాని సాలెగూడు నా కందనంత ఎత్తులో వుంది. పరిసరాల్లో కర్రగాని, అలాంటి సాధనంగాని లేదు. అపుడేం చెయ్యను మరి?"

"అన్యాయం. సాలెగూడు మీకు అందనంత ఎత్తులో వుందని నేను చెప్పలేదు" అన్నాడు మద్దిలేటి.

"అందుబాటులో ఉందనికూడ మీరు చెప్పలేదు!?"

బుర్రగోక్కుంటూ అవతలికి వెళ్ళిపోయాడు మద్దులేటి.

'హా' అన్నాడు అవధాని, గోపీనాథ్ కేసి తిరిగి.

తర్వాతి అక్షరం వూహకందకపోవటంతో నిషేధించలేకపోయాడు గోపీనాథ్.

"....ంతా!" అన్నాడు అవధాని.

నిషేధించలేకపోయాడు పృచ్ఛకుడు.

దాన్ని కంటిన్యూ చేస్తూ 'ఖీ' అన్నాడు మార్కండేయ శర్మ.

ఛటుక్కున స్ఫురించింది గోపీనాథ్ కి. 'మై గాడ్' శర్మ ఒకే సమాసంగా మూడో పాదాన్ని పూర్తి చెయ్యబోతున్నాడు. 'తా' అంటే చాలు, 'సంతా

పాంతాభీతా' అవుతుంది. సంతాప + అంత + అభీతా!! అంటే సంతాపంవల్ల అంతాన్ని గురించిన భయంలేని వాడా అని అర్థం!!!

"....'తా' నిషేధిస్తున్నాను...." గట్టిగా అర్చాడు గోపీనాథ్.

మృదువుగా 'ష్టా' అన్నాడు అవధాని.

నిలువునా కూలబడిపోయాడు గోపీనాథ్. అయిపోయింది. తను అపజయాన్ని చవిచూశాడు. అవధాని విజయం సాధించాడు. మూడుపాదాలూ అయిపోయాయి. నాలుగోపాదం నిషేధించటానికి వీల్లేదు.

కరతాళ ధ్వనులతో రవీంద్రభారతి రెండునిమిషాలు అదిరిపోయింది.

ఈలోగా నాలుగోపాదాన్ని మనసులోనే సృష్టించుకొని మొత్తం పద్యాన్ని శ్రావ్యమైన కంఠంతో పాడాడు దత్తపది మార్కండేయశర్మ.

కం॥ "శాంతా! ధీదా! శ్రీదా!
రంతా! మంతా! గణేశ! గజముఖ! దేవా!!
సంతాపాంతా భీష్టా!
వంతల్ మాన్పుము రయమున వాంతర రాజా!!"

"శాంతముగలవాడా! బుద్ధిని, సంపదలను ఇచ్చువాడా! పరబ్రహ్మమునందు రమించువాడా! భక్తుల కష్టములను గూర్చి ఆలోచించువాడా! సంతాపాలను అంతం చెయ్యటంలో మిక్కిలి యిష్టం కలిగినవాడా! విఘ్నరాజా! మా బాధల్ని వెంటనే తొలగించవయ్యా!" అని దాని సమగ్రతాత్పర్యం!!

♦ ♦ ♦

తర్వాతి అంశం సమస్య.

పృచ్ఛకుడు: శ్రీ కె. కె. సోమయాజులు.

సమస్య అంటే ఇక్కడ విషమ విషయాన్ని సమ విషయంగా సమర్థించి చెప్పటమన్నమాట. ఒక పద్యం లోని నాలుగో పాదాన్ని మాత్రం చెబుతాడు పృచ్ఛకుడు. ఆ పాదం అర్థంలేకుండా వుండొచ్చు. లేదా విచిత్రంగా వుండొచ్చు. దాన్ని ఆధారంగా చేసుకొని దాన్ని సమవిషయంగా సమర్థిస్తూ పృచ్ఛకుడు కోరిన సందర్భానికి అన్వయించి పై మూడు పాదాలు మనసులోనే వ్రాసుకొని మొత్తం పద్యాన్ని చెప్పాలి.

సోమయాజులు లేచాడు. జేబులోంచి ఓ కాగితం తీశాడు.

నాలుగో పాదం చదివాడు.

"... సారాయే తీర్థమయ్యె సభికుల కెల్లన్!!"

అవధాని వైపు చూశాడు. "శర్మగారూ! ఈ పాదం ఆధారంతో శివరాత్రికి అన్వయించి మిగత మూడు పాదాలు అల్లి మొత్తం పద్యం చెప్పండి" అన్నాడు.

అందరిలోనూ ఉత్కంఠ!!

సారాయి సభికులకి తీర్థమెలా అవుతుంది? అది శివరాత్రికి ఎలా అన్వయించబడుతుంది?? ఎలా పూరిస్తాడు అవధాని???

అవధాని పెదవులు విచ్చుకున్నాయి.

"సభికులు అన్న పదానికి సభనలంకరించినవారు అనే అర్థమే కాకుండా జూదమాడించువారు, జూదరులు అనికూడ అర్థం వస్తుంది. ఆ అర్థాన్ని తీసుకొని పద్యం చెబుతాను...." అని పద్యం ప్రారంభించాడు.

కం॥ "ఆ రాత్రే శివరాత్రట!
వారాంగనలే డ్లక్లే· వంతుల బోరన్
వారీయగ మర్యాదగ
సారాయే తీర్థమయ్యె సభికుల కెల్లన్...."

రవీంద్రభారతి మరోసారి మారుమ్రోగింది.

అష్టావధానంలో మూడో అంశం దత్తపది. పృచ్ఛకుడు శ్రీ ఆర్. శ్రీరామమూర్తి.

నాలుగు ప్రాసపదాల్ని ఉద్దిష్ట విషయ ఛందాల్లో కూర్చి చెప్పటం అన్నమాట. ఉదాహరణకి అట్ట, తట్ట, కట్ట, బట్ట.... ఈ నాలుగు పదాల్ని ఉపయోగించి భారతార్థంలో పద్యం చెప్పమంటాడు. చెప్పాలి.

శ్రీరామమూర్తి లేచాడు.

"శర్మగారూ! 'క్రయిమ్ గ్లామర్' డిటెక్టివ్ మాస పత్రిక ప్రారంభోత్సవ సందర్భంగా యేర్పాటు చేసిన కార్యక్రమం యిది. అందులోనూ క్రయిమ్ గ్లామర్ తో అష్టావధానం కదా! సభికులంతా—అయ్‌మీన్ వాదరులు, వాదమాడించువారు కాక్లెండి—సభ నలంకరించిన ప్రేక్షకులు!! అష్టావధానంలో క్రయిమ్ గ్లామర్ కోసం యెదురుచూస్తుంటారు.

"ఇద్దరు స్నేహితులున్నారు. ఒకడు హంతకుడు. రెండోవాణ్ని చంపాలనుకున్నాడు. నువ్వు నా స్నేహితుడివే అయితే ఫలానా చోటికి రా! నిన్ను చంపాలి అన్నాడు. స్నేహానికి ప్రాణమిచ్చే రెండోవాడు అలాగేనని తలూపి అతడు చెప్పిన చోటికి వెళ్ళాడు....

"హత్య, సత్య, నృత్య, భృత్య—ఈ పదాల నుపయోగించి ఆ అర్థంలో ఓ చక్కని ఉత్పలమాల

చెప్పండి....." అని కూచున్నాడు.

అవధాని దీర్ఘంగా ఆలోచించాడు రెండు నిమిషాలు. ఆ తర్వాత అతని కంఠం విచ్చుకుంది.

ఉ॥ "హత్యను చేయబూని ఒక హంతకుడెంతో
ప్రయత్నమున్ వెసన్
సత్యము విస్మరించియును సద్హృదయున్ తన
మిత్రునిన్ బృహ
న్నృత్య విలాసమందిరపు రిక్త ప్రదేశము చేర
బిల్చెనన్
భృత్య విధమ్మునన్ తెలిసి పూర్ణ మనస్కుడు
వెళ్ళెనయ్యయో!"

నాలుగో అంశం వర్ణన. పృచ్ఛకుడు శ్రీ యన్. ఆనందరావు.

వర్ణన అంటే అప్రస్తుత విషయాన్ని ప్రస్తుతానికి అన్వయించి చెప్పటం. అది జరుగుతున్నది కావచ్చు. జరగబోయేది కావచ్చు. భూత భవిష్యత్ వర్తమానాలకి సంబంధించింది కాకపోవచ్చు. సంబంధించిందిగా వూహించుకొని చెప్పాలి.

"శర్మగారూ! ఓ కళాకారుడు అకాల మరణం చెందగా కళామతల్లి యే విధంగా కళావిహీనమవుతుందో సర్వ లఘు కందంలో చెప్పండి" అన్నాడు ఆనందరావు.

సర్వ లఘు కందం! అంటే అన్నీ లఘువులతో నే పద్యమన్నమాట. అయితే రెండు నాలుగు పాదాలకి అంతంలో తప్పనిసరిగా గురువులుండాలి.

కాసేపయ్యాక ఇలా చెప్పాడు అవధాని.

కం॥ "కళలకు నిలయుని విలయము
కలుగగ కళల జనని కడు కలతను గలుగున్
ఇల తన తనయుడు తనకును
ప్రళయము నలమెను ననుచును ప్రభలను
తలగున్!!"

♦ ♦ ♦

తర్వాత అంశం పద్యార్థ కథనం.

పృచ్ఛకుడు శ్రీ బి. వాసుదేవరావు.

ఇందులో పృచ్ఛకుడు పద్యం చదువుతాడు. అవధాని అర్థం చెప్పాలి.

వాసుదేవరావు పద్యం చదివాడు. అది ఆటవెలది.

"తుమ్ము తుమ్ము కొద్దు తుచ్ఛత్వమందెదు
సుమ్మురిప్యసి కని చావదెపుడు
సత్వరమ్మొ నీవ సంతోషమయ్యెడు
ఏరు లేరు షూరు ఎపుడు నీవ...."

అష్టావధాని నవ్వాడు. "పద్యం వింతగా వుంది. ఒక్కో పాదం ఒక్కో అర్థాన్ని కలిగివుంది. అయిదు నిమిషాల క్రితం ఇక్కడ యెవరో తుమ్మారు. దాన్నిబట్టి పద్యాన్ని యిప్పుడే ప్రాశారనుకుంటున్నాను.

మొదటిపాదానికర్థం తుమ్ము యెప్పుడూ తుమ్మొద్దు. తుచ్ఛుడివై పోతావు అని. ముక్కున్న ప్రతివాడూ తుమ్మక తప్పదుగాబట్టి సమయ సందర్భాలు చూచుకోకుండా తుమ్మితే (అపశకునంగా భావిస్తారు గాబట్టి) నిన్నొక పనికిమాలినవాడిగా భావిస్తారు.

ఇక రెండో పాదం క్రయిమ్‌ని వుద్దేశించినది. కసి యెప్పుడూ చావదు, దానివల్ల నువ్వే చస్తావు అని

దానర్థం. కనిపించుకోవటంవల్ల నాశనమయ్యే అవకాశం వుంది అన్న అర్థం వస్తుంది.

మూడు నాలుగు పాదాలకర్థం 'సంతోషమవుతుంది నీకు త్వరలో. అప్పుడు నీకెవ్వరూ సాటిరారు' అని!!

ఇది నన్నుద్దేశించి వ్రాసినట్టుంది. ఎందుకంటే నా అష్టావధానం క్రొత్తరకంగా దిగ్విజయంగా ముగియబోతోంది కదా! ఇది కాస్త పూర్తికాగానే నీకు సంతోషమవుతుంది, అప్పుడు నీకెవ్వరూ సాటిరారు అన్న అర్థం ఇమిడివుంది....” అంటూ ముగించాడు అష్టావధాని.

చప్పట్లతో హాలు మరోసారి దద్దరిల్లింది.

అష్టావధాన కార్యక్రమంలో చిట్టచివరి అంశం ఆశువు.

పృచ్ఛకుడు శ్రీ టి. హనుమంతు.

సబ్జక్టు ఇచ్చి ఆశువుగా పద్యం చెప్పమనటం అన్న మాట. హనుమంతు లేచాడు.

“అవధానిగారూ! ఈ అష్టావధానంలో నిజంగా వైవిధ్యం వుంది. గణేశ ప్రార్థనతో మొదలై సభికులన్న పదానికి చమత్కారంగా అర్థం తీసుకోవటంతో గమ్మత్తైన మలుపుతిరిగి క్రయిమ్‌తో వేగం పుంజుకొని సర్వ లఘుకందంతో నవ్యతని సంతరించుకొని ముగియబోతోంది. ఈ క్రయిమ్ గ్లామర్‌తో అష్టావధానం మీకెలాంటి అనుభూతి నిచ్చింది? ఒక్కొక్క అంశం నిర్వహిస్తున్నప్పుడు మీరెలా ఫీలయ్యారు? ఆశువుగా సీసపద్య రూపంలో చెప్పండి....”

సీ॥ “తీక్ష్ణ ఖడ్గము బోలు తీవ్ర నిషిద్ధాక్ష
ర; వెనుశూల మిదియెరా! సమస్య
గుదియ దత్తపదియు! కొరడా ప్రస్తుతమును
ఆశువు పాశమ్ము హాలముగంట

పద్యార్ధ కథనము వధ్యార్ధసలమ్మునా
కర్ణన బాణమ్ము వదుసగాగ
అష్టావధాన మీ అష్టావదానమై
ఎనిమిది పిల్లలు ఎలుక నొకటి

ఆ॥ వె॥ జేసి ఆటలాడి చెలువార నాడించి
హతుడో హంతకుఁడో అనగనొప్పి
చచ్చి బ్రతికి చంపి సంతృప్తి నవధాని
సత్కృతి బడయును అసామ్యగతిని...."

రెండు చేతులూ ఎత్తి జోడించి సభాసదులందరికీ వినమ్రుడై నమస్కరించి అందరి ఆశీస్సుల్ని అందుకున్నాడు శర్మ.

ఆగకుండా మోగాయి చప్పట్లు.

## 16

బరువెక్కిన హృదయంతో కనులు తెరిచాడు జలంధర్. చెమ్మగిల్లిన కళ్ళని కర్చీఫ్‌తో ఒత్తుకున్నాడు.

కాగితం, కలం తీసుకొని అనుమానితుల జాబితా వ్రాయసాగాడు.

గోపీనాథ్:—పదిసంవత్సరాల స్నేహం వుండికూడ అష్టావధానంలో తన ఓటమిని అంగీకరించలేకపోయాడు. అతని ముఖంలో అవమాన భారం చాలసార్లు కదలాడింది. శర్మని మింగేటట్టు చాలాసార్లు చూశాడు.

సత్యమూర్తి:-కార్యక్రమంలో గంట వాయించాడు. గంట మొత్తం పన్నెండుసార్లు మోగించాడు. హత్య కూడ పగలు సరిగ్గా పన్నెండు గంటలకి జరిగినట్టుగా పోస్టుమార్టమ్ రిపోర్టులో వున్నట్టు క్రయిమ్‌బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ చక్రవర్తి ప్రత్యేకంగా తనతో చెప్పాడు.

మద్దుకేటి:— అప్రస్తుత ప్రశంస నిర్వహించాడు. కార్యక్రమంలో మొత్తం తొమ్మిదిసార్లు జోక్యం చేసు కున్నాడు (ఉదాహరణకి ఘంటాగణనం, అప్రస్తుత ప్రశంస ఒక్కొక్కసారి మాత్రమే యిచ్చాను. అప్రస్తుత ప్రశంశ పృచ్ఛకుడు తన ఇష్టంవచ్చినన్నిసార్లు రావచ్చు. తొమ్మిదిసార్లు రావటాన్ని, గంట పన్నెండుసార్లు కొట్ట డాన్ని రచయితగా విన్నా నే పాఠకుడుగా చదివేకన్నా ప్రేక్షకుడుగా అష్టావధాన కార్యక్రమం తిలకిస్తే బావుంటుంది—రచయిత) అప్పుడప్పుడూ వాసుదేవరావు వంక చూశాడు.

సోమయాజులు:—అక్కడ కూచున్నంతసేపూ అస హనంగా గడిపాడు. చనువుకున్న స్త్రీపై సదభి ప్రాయం లేనివాడు. తన భార్య తక్కువగా చదువుకుందని గర్వంగా చెప్పాడు. శర్మ బ్రతికున్నప్పటినుండీ కమలినిపై కన్ను వేశాడు. కమలిని ఓ కన్నువేసి వుంచండి అని చెప్పింది సోమయాజులుకైనే!

శ్రీరామమూర్తి:— ఇతడుకూడ వాసుదేవరావు కేసి అప్పుడప్పుడు చూశాడు. ప్రాణస్నేహితుణ్ని చంపే ఉద్దేశంతో రమ్మని పిలిచే తాత్పర్యంతో పద్యం చెప్ప మన్నాడు.

ఆనందరావు:—కళాకారుని మరణం గురించి పద్యం చెప్పమన్నాడు. మార్కండేయశర్మ ముఖ్యమిత్రుల్లో ఇతడూ ఒకడు. ఏదో తప్పుచేసినవాడిలా ఒదిగికూచుని మాటిమాటికీ కర్చీఫ్‌తో నుదుటిమీది చెమట తుడుచు కుంటూ కూచున్నాడు.

వాసుదేవరావు:— పద్యం చదివి అర్థం చెప్పమని అష్టావధానిని కోరాడు. అతని పద్యాన్నే శర్మ

స్పెషల్‌గా డైరీలో వ్రాసుకున్నాడు. నాలుగు పదాల క్రింద అండర్‌లైన్ కూడ చేసుకున్నాడు పృచ్ఛకులు ఎనిమిదినుందిలో అతడు లీడర్‌లా అగుపించాడు. పృచ్ఛకుల్లో కొందరి దృష్టిని అతడు తరచూ ఆకర్షించాడు. అప్పుడప్పుడూ ప్రేక్షకులకేసి దృష్టిసారిస్తూ వచ్చాడు. పద్యం చదివాక, అర్థం అవధాని చెప్పాక కూచోబోతూండగా ఆనందరావు పద్యమున్న కాగితం యివ్వ చూసి యిస్తాను అన్నట్టుగా సైగ చేశాడు. అప్పుడు మళ్ళీ చూడచ్చులే అన్నట్టుగా సైగచేసి జేబులో పెట్టుకున్నాడు.

హనుమంతు:-ఆశువు చెప్పమన్నప్పుడు అతని మొహం గంభీరంగా వున్నది. అష్టావధానం ముగిశాక శర్మ ఘంటాగణనంలో మొత్తం మ్రోగించబడిన గంటలు పన్నెండు అని చెప్పినప్పుడు ఇతని మొహంలో లీలగా చిరునవ్వు మెదిలింది. అందులో యేదో ప్రత్యేకమైన భావన వుంది...."

వ్రాయటం పూర్తిచేసి దాన్ని మాటిమాటికీ చదువుకుంటూ కూచున్న జలంధర్ యెవరో వచ్చినట్టనిపించి తలెత్తాడు.

"మాధురీదేవితో మాట్లాడివచ్చాక నీకోసం చాల ప్రయత్నించాను. ఎక్కడికెళ్ళావ్ గురూ!?" అంటూ వచ్చాడు చక్రవర్తి.

"అక్కడి విశేషాలేమిటి?"

"మాధురీదేవి చెప్పిన వాటిల్లో ఒక్కటే విశేషం. కమలిని వివాహపత్రిక అచ్చువేయబళ్ళేదు. అది వాళ్ళ ఆనవాయితీ కాదట. పెళ్ళిపత్రిక ఆనవాయితీ కాకపోవటం ఏమిటి?"

"అప్పటి పరిస్థితుల్లో వీలైకపోయింది. చెబితే అంతా చెప్పాల్సొస్తుంది అందుకని అలా చెప్పిందామె."

"అదేమిటి? ఏదో నోట్సు తయారుచేస్తున్నట్టున్నావు?" అడిగాడు చక్రవర్తి.

"ఈ కేసులో మనకి మొత్తం పదిమంది పరిచయమయ్యారు. యామిని, కమలిని, ఎనిమిదిమంది పృచ్ఛకులు. యామిని అమాయకురాలు. కమలిని హంతుడి భార్య. ఆమె హంతుడి రెండవ భార్య అని తేలటంతో, ఆ విషయం ఆమె మరుగుపర్చటంతో ఆమెని తాత్కాలికంగా అనుమానించాల్సి వచ్చింది. కాని ఆమె చెప్పిన రెండు భయంకరమైన కథలవల్ల ...."

"భయంకరమైన కథలా?"

"అవును. మరోసారి చెబుతాలే! ఇటు శర్మ మొదటి భార్య తరఫువాళ్లుగాని ఇట్లు కమలిని తరఫువాళ్ళుగాని ఈ హత్య చెయ్యలేదని, చేయించలేదని రుజువైంది."

"పోతే యశ్వంత్ కుమార్ అనే యువకుడు రంగంలోకి గెస్టుగా అప్పియరై మాయమయ్యాడు. అతనికీ హత్యకీ సంబంధంలేదు. పోతే ఇక అనుమానితులెవరు?"

"పృచ్ఛకులు!"

"గుడ్. అందుకే ఆనాటి కార్యక్రమాన్ని మరోసారి నెమరేసుకున్నాను. ఎనిమిదిమందిని గురించీ నాకు తోచిన పాయింట్లు వ్రాసిపెట్టాను."

తీసుకొని చదివాడు చక్రవర్తి. "ఎనిమిదిమందీ కనిపిస్తున్నారు! కాని వాసుదేవరావు మాత్రం భూతద్దంలోంచి కనిపిస్తున్నాడు. అన్నట్టు వీడేమిటి? కమలినిపై నీకన్నేశాడు?"

"సోమయాజులు. శర్మ ముఖ్య స్నేహితుల్లో ఒకడు."

"దగుల్బాజీ వెధవ!" పళ్ళు నూరాడు చక్రవర్తి.

"చక్రం! ఇది చూడటానికి అష్టావధానంలా కనిపించినా నాకు మాత్రం 'అష్టావదానం'లా కనిపిస్తోంది!"

"అష్టావదానమా?"

"అఁ.... నేనాడు ముఖ్య అతిథిపలుకుల్లోనే చెప్పాను సాహితీపరంగా యిది అష్టావదానమని. అంటే సాహిత్యాన్ని ఎనిమిదిమంది ఎనిమిది ఆయుధాలుగా పంచుకుని అవధానిపైకి లంఘించటం అని. కాని నేనది జనరల్ గా చెప్పాను.

"ఇప్పుడు పరిస్థితుల్నిబట్టి అది నిజమైందేమోనని పిస్తోంది. అష్టావధానం క్రయిమ్ సబ్జెక్టుపై నిర్వహించబడింది గాబట్టి అంశాలూ ఆటోమేటిగ్గా క్రయిమ్ పై సృష్టించబడ్డాయి గాబట్టి మనం మొదట వీళ్ళకి అంత ఇంపార్టెన్స్ యివ్వలేదు. ఇప్పుడు ఈ నోట్సు బాగా గమనించు. పన్నెండు గంటలు కొట్టబడటం, హత్య సరిగ్గా పన్నెండుకి జరగడం, ఓ కళాకారుడు అకాల మరణం చెందగా కళామతల్లి యే విధంగా శోకిస్తుందో పృచ్ఛకుడుగా అడిగి అవధానిలో చెప్పించటం, యిద్దరు ప్రాణస్నేహితుల్లో ఒకడు మరొకర్ని చంపే విధానాన్ని అవధానితో స్వయంగా చెప్పించటం, పృచ్ఛకుల్లో అందరి దృష్టి వాసుదేవరావుపై వుండటం, అతను చెప్పిన పద్యమే శర్మ డైరీలో ప్రత్యక్షం కావటం ఆ నాలుగుపదాలేవిటో శర్మ అండర్ లైన్ చేసుకోవటం..."

"ఆ నాలుగు పదాలకీ అర్థం మనమే తెల్సుకుంటే పోలా?"

"ఎలా? అవి సంస్కృత పదాలు. మనకి రాదే!"

"ఎవరైనా మాష్టర్ని అడిగితే పోలా!?

"పోతుంది. ఇన్ఫర్మేషన్ నేరుగా వాసుదేవరావుకి."

గతుక్కుమన్నాడు చక్రవర్తి.

"మనకిదొక్కటే ఆధారం. ఎక్కడ యే పుచ్చు ఉందో మనకి తెలీదు. జాగ్రత్తగా సాధించాలి."

"అయిడియా!"

"ఏమిటది?"

"ఇక్కడికి దగ్గర్లో రాఘవేంద్ర గురుకుల విద్యామందిరం వుంది. ప్రతిరోజూ విద్యార్థులకి తెల్లవారు ఝామున సంస్కృత విద్యాబోధన జరుగుతుంది. వాళ్ళ దగ్గర డిక్షనరీ వుంటుంది...."

"ఎందుకూ? వాళ్ళకి సంస్కృత పండితుంటాడు...."

"మాష్టర్ని అడగొద్దన్నావుగా!" చక్రవర్తి అన్నాడు.

"ఈ పండితుడు 'ఉడిపి నుండి వచ్చాడు. ఈ వెధవలతో కక్కుర్తి పడేంత స్థాయికి దిగజారుతాడంటావా?"

"అవును. ఇంకేం? విజయోస్తు. ఫోన్ కొట్టు. వాళ్ళకి ఫోనుంది." నెంబరు చెప్పాడు చక్రవర్తి.

కొట్టాడు జలంధర్.

అవతల్నుండి సంస్కృత పండితుడు "హాలో...." అన్నాడు సంస్కృతంలో.

"మాకు నాలుగు సంస్కృత పదాలకి తెలుగు మీనింగ్స్ కావాలి. దయచేసి చెబుతారా?"

"ఏను బేకూ?" గట్టిగా అడిగాడు సం.పం.

"చచ్చాం. ఈ మహానుభావుడికి సంస్కృతమూ కన్నడమూ తప్ప తెలుగు రానట్టుంది."

"ఆయనకి తెలుగొచ్చు. నేను అప్పుడప్పుడూ పలక

రిస్టాటూగా! కాకపోతే కాస్త చెవుడు! అంతే...."

"గ్రహించాడు...." అనేసి మళ్ళీ 'హలో' అన్నాడు జలంధర్. కాని అప్పటికే సం.పం. ఫోను పెట్టేశాడు.

మళ్ళీ రింగ్ చేశాడు జలంధర్. కాసేపు ఉత్సీపట్టాకాన్ని ఈయన చెప్పిందేమిటో ఆయనకి అర్థమవలేదు. అర్థమయ్యాక తపీమని ఫోను పెట్టేశాడు చాలదొద్దిగా మాట్లాడి.

నిస్పృహాగా చక్రవర్తికేసి చూశాడు జలంధర్.

"వాటిలో ఒకటే సంస్కృత పదమట. ఇంకోటి తెలుగు పదమేనట. సంస్కృత పదంలో ఉపసర్గ కలిసుందట. అది పోతే 'మరిష్యసి' అనే పదం వస్తుందట. ఆ పదాని కర్థం 'ఛస్తావు' అని వస్తుందిట. మిగత మూడుపదాలకర్థం చేరేవాళ్ళ నడగమన్నాడు. లేకపోతే...."

"లేకపోతే....?"

"గంగలో దూకమన్నాడు. అయినా అంతకోప మెందుకయ్యా సంస్కృత పండితులవారికి?"

"ఆయనకి చెముడని చెప్పాగా! మన పెదవులు కదిలితే తన్ని తిట్టుకుంటున్నారేమోనన్న ఫీలింగు...."

"సరే. ఓ పదానికి అర్థం దొరికింది ఛస్తావు!! ఇక మిగతావి" జేబులోంచి తను రాసుకొచ్చిన కాయితం తీశాడు జలంధర్.

"తుమ్మ—సత్వరమ్మ—షూరు...."

"అరె—'సత్వరమ్మ' తెలుగు పదమే కదా! అంటే 'త్వరగా నే' అనే అర్థం రాదా!?"

"కాదు. 'సత్వరము' కూడ సంస్కృత పదమే!!" దృఢంగా అన్నాడు జలంధర్.

"అబ్బా—సరే లేవయ్యా! మనకి తెల్సిన పనేగదా! తెలుగులో చాలమందికి తెలుసు గాబట్టి తెలుగు పదమే అనుకుందాం. ఇప్పుడు 'త్వరలోనే ఛస్తావు' అన్న అర్థం తయారైంది...."

"మైగాడ్...." గట్టిగా అర్చాడు జలంధర్. "చక్రవర్తీ! తుమ్ము అనే పదంలో ఉకారం తీసెయ్. 'తుమ్' అని తయారవుతుంది 'షూరు' అన్న పదాన్ని 'ష్యూర్' అని మార్చుకుంటే?!

"నువ్వు త్వరలోనే తప్పక ఛస్తావు!!"

"ఒక సంస్కృతపదాన్ని, తెలుగు పదమేనన్పించే మరో సంస్కృత పదాన్ని, ఓ హిందీ పదాన్ని, ఓ ఇంగ్లీషు పదాన్ని కంపోజ్ చేసి 'నువ్వు త్వరలోనే తప్పక ఛస్తావు' అన్న వాక్యాన్ని లాఘవంగా పద్యంలో పొదిగారయ్యా! అష్టావధాని అప్పటికేదో సమాధానం చెప్పినా యింటికెళ్ళాక తీరిగ్గా ఆలోచించాడు. అందుకే ఆ నాలుగు పదాలనీ అండర్ లైన్ చేసుకున్నాడు. అంటే తర్వాత లీలగా స్ఫురించిందన్నమాట. తర్వాత డీప్‌గా ఆలోచించాడు. ఆ పద్యంలో పాదానికీ పాదానికీ అర్థం మారిపోతూ వచ్చింది. ఆనాడు నా చెవుల్తో నేనుకూడ విని—ఆహా! ఏం సాహిత్యం అని పొంగిపోయాను! ఏం పాండిత్యం?! అని మురిసిపోయాను.

"చక్రవర్తీ! తనకి చావు అర్థాంతరంగా రాబోతోందని శర్మ ముందుగా తెల్సుకున్నాడు. మనకి క్లూ అందించటానికి తప్పక ప్రయత్నిస్తాడు. అయ్ మీన్ ప్రయత్నించి ఉంటాడు. ఇంట్లో దాదాపు అంతటా వెదికాం. వుండదు. అయినా పృచ్ఛకుల్లో ముగ్గురు అతని క్లోజ్ ఫ్రెండ్స్, కాబట్టి యింట్లో దాచటానికి వీల్లేదు."

"ఇల్లు తర్వాత యిల్లంతటి ప్రదేశం ఏమిటి? అతని కాలేజీయే!"

"వెరీగుడ్ చక్రవర్తీ! ఇక ఆలస్యం పనికిరాదు. హర్రీయప్! నువ్వు నీ మోటరు సైకిలూ నేను నా కారూ!"

"అదేం___?"

"అవసరమైతే అక్కణ్ణుండి విడివిడిగా ప్రొసీడవుదాం....అన్నట్టు — అష్టావధానం మర్రోజు తమ మేరేజ్ ఏనివర్సరీదే అయినా 'పనుందని' కాలేజీకి వెళ్లాడు శర్మ. పరిగెత్తు. మనకి యేదో ఒకటి తప్పక దొరుకుతుంది!!"

## 17

ప్రిన్సిపాల్ సాదరంగా వారిని ఆహ్వానించాడు.

"ఉగాది మర్రోజున శర్మ కాలేజీకి వచ్చారు కదూ!" అడిగాడు జలంధర్.

"అవును."

"ఎంతవరకు డ్యూటీ చేశారు?"

"నిజాని కా రోజు శెలవు పెట్టారు. కాని వచ్చారు. ఆశ్చర్యపోయాను. ఒక ముఖ్యమైన వ్యక్తికి ఉత్తరం రాయాలనీ ఇంటివద్ద సాధ్యంకాలేదనీ కాస్త యేకాంత ప్రదేశం యేర్పాటు చెయ్యమనీ రిక్వెస్టు చేశారు. వారిపై గల అభిమానంకొద్దీ నా రూమే ఉపయోగించుకోమని చెప్పి నేను క్లాసుకి వెళ్ళిపోయాను. పదకొండున్నర కాస్త యిటూ అటుగా బైటికొచ్చారు. థాంక్స్ చెప్పి వెళ్ళిపోయారు."

"మీరు వెళ్ళిపోయాక తలుపులు వేసుకున్నారా?"

"ఏమో! నేను వెనక్కి తిరిగి చూళ్ళేదు."

గదినంతా ఒక్కసారి నిశితంగా పరిశీలించాడు

జలంధర్. తన ఊహ నిజమైంది. ఏదో రాశాడు శర్మ. ఇక్కడే యెక్కడో దాచివుంటాడు.

ఎక్కడ??

జలంధర్ దృష్టి అప్రయత్నంగా సీలింగ్ ఫ్యానుపై బడింది.

మన్నుతిన్న పాములా మెల్లిగా తిరుగుతోంది '56— బ్లేడ్' ఉషా సీలింగ్ ఫ్యాన్.

"బాగా ఎండగా వుంది. ఈమాత్రం గాలి మీకు సరిపోతుందా?" ప్రిన్సిపాల్ని చూస్తూ అడిగాడు.

"వేసవికాలంలో కూడ 'వన్'లో నే వుంచుతా న్నేను. గాలి అధికమైతే టేబుల్ మీది పేపర్లకి రెక్కలొస్తాయ్." నవ్వుతూ అన్నాడు ప్రిన్స్‌పాల్.

"మీ ఆ టెండర్ని పిలుస్తారా దయచేసి?"

పిలిపించాడు ప్రిన్స్‌పాల్.

"ఫ్యాను రెక్కల్లో ఓ దాని పైభాగాన ఓ కాగితంగాని కవరుగాని అతికించబడి వుంటుంది. జాగ్రత్తగా వెతికి తియ్..." అన్నాడు జలంధర్.

ఫ్యాన్ ఆఫ్ చేసి టేబుల్ పై కుర్చీ వేసుకొని యెక్కి బ్లేడ్ పైభాగంలో తడిమాడు అటెండర్. ఏదో అతుక్కున్నట్టు చేతికి తగిలింది. నెమ్మదిగా లాగాడు. అదో కవరు.

జలంధర్ దాన్ని అందుకొని చదువుతూండగా ఫోను మ్రోగింది.

చటుక్కున రిసీవరందుకున్నాడు చక్రవర్తి.

"హలో,...."

"నేను పార్జంటు సారంగధరని మాట్లాడుతున్నాన్సార్! మీరు చెప్పిన వాటి వివరాలు కనుక్కున్నాను.

శర్మగారి హత్య సందర్భంగా వచ్చిన సానుభూతి ఉత్తరాల్లో వాసుదేవరావు బృందం ఉత్తరాల్లేవు. స్టేషన్‌లో అందరూ మిమ్మల్ని కలిసేముందు వాసుదేవరావు ఒంటరిగా కమలిని కలిశాడు. ఏవేవో కూపీలు లాగటానికి ప్రయత్నించాడు. హత్య జరిగిన సమయంలో వాసుదేవరావుకి తప్ప, మిగతా అందరికీ ఎలిబీలున్నాయి. పోతే అష్టావధానంలో పృచ్ఛకుల యేర్పాటు గురించి.

"దాదాపు అష్టావధానానికి నెలముందే క్రయిమ్ గ్లామర్ ఎడిటర్ అష్టావధానిని కలిసి డేట్ మాట్లాడుకున్నాడుట. ఆ సమయంలో గోపీనాథ్ ప్రక్కనే వున్నాట్ట. శర్మ పృచ్ఛకుల్ని ఎరేంజ్ చేసే బాధ్యతని గోపీనాథ్‌కే అప్పగించాడుట."

"వెరీగుడ్. ఇంకా యేమైనా విశేషాలు...."

"ఇంకేం లేవు సార్!"

ఫోన్ పెట్టేశాడు చక్రవర్తి. జలంధర్ కేసి చూశాడు.

"చక్రవర్తీ! హంతకుడు వాసుదేవరావు అనటానికి కావలసిన ఆధారం దొరికింది. ట్రాప్ వేసి పట్టడమే తరవాయి. పద—పథకం ఆలోచిద్దాం."

ప్రిన్సిపాల్‌కి థాంక్స్ చెప్పి బైటపడ్డా రిద్దరూ.

## 18

"హలో! వాసుదేవరావ్ స్పీకింగ్!"

"పదివేలు కావాలి...." కరకుగా వినిపించింది అవతలి కంఠం.

"ఎందుకు?"

"నువ్వివ్వటానికీ నేను పుచ్చుకోటానికీ!"

"నేనెందుకివ్వాలి?"

"నువ్వు చేసిన నేరం నాకు తెల్సిపోయింది గనక!"

"ఏవా!? నేరం చేశావా?"

"మామూలు నేరం కాదు. హత్య!!"

గతుక్కుమన్నాడు వాసుదేవరావు. అతనికి ముచ్చెమటలు పోశాయి.

"హత్య!?" అంతకంటే మాట్లాడ్లేకపోయాడు. పెదాలు తడబడుతున్నాయి.

"అఁ....దత్తపది మార్కండేయ శర్మని హత్య చేసినందుకు!" ఇంకా వివరాలు చెప్పాలా? ఆనందనగర్ సెవన్ రోడ్స్ సెంటర్లో నువ్వు మారువేషంలో నెంబర్ ప్లేటు లేని కారొకటి నడుపుతూ శర్మ స్కూటర్ని గుద్దేశావు. మొత్తం ఆధారాలు నా దగ్గరున్నాయి. పదివేలు నాకివ్వకపోతే అవి డిటెక్టివ్ జలంధర్ వద్దుంటాయి."

"నో నో....అంతపని చెయ్యకు. పదివేలూ రెండు వాయిదాల్లో యిస్తాను."

"కంతులవారీగా యివ్వటానికిదేం బెనిఫిట్ స్కీమ్ కాదు మిస్టర్...."

"ఓకే ఓకే....అలాగే....మొత్తం ఇస్తాను. ఎక్కడ యివ్వమంటావ్?"

"పోలీస్ స్టేషన్లో...."

"వ్వాట్!? ఇంతకీ ఎవరు నువ్వు?? తడబడే కంఠంతో అడిగాడు వాసుదేవరావు, భయం కల్సిన ఆశ్చర్యంతో.

"నీ బండారం బైట పెట్టడం కోసం నాటకం ఆడిన క్రయిమ్ బ్రాంచ్ ఇన్స్పెక్టర్ చక్రవర్తిని!!"

'క్లిక్' మంది టేప్ రికార్డరు.

* * *

"అందరితోనూ కలివిడిగా వుంటూ సాహిత్యమే

ఊపిరిగా ఉద్యోగధర్మమే తన లోకంగా అష్టావధాన ప్రక్రియలో తననితాను మరచిపోతూ తన మానాన తాను బ్రతుకుతోన్న మార్కండేయశర్మ నీకేం అపకారం చేశాడు? అతన్ని దారుణంగా హత్య చెయ్యాలన్న తలంపు నీలో యెందుకు కలిగింది?" గంభీరంగా ప్రశ్నించాడు డిటెక్టివ్ జలంధర్.

తలవంచుకొని కూర్చొని వున్నాడు వాసుదేవరావు. అతని హృదయం బాధ, భయం, అవమానం, పగ కల్సిన భావంతో ఉడికిపోతోంది.

కాసేపయ్యాక నెమ్మదిగా గొంతు విప్పాడు.

"నా తమ్ముడు మొన్న బి.కామ్. పరీక్షలు రాశాడు. వాడు చాల సెన్సిటివ్. ఏ బాధ వచ్చినా భరించలేడు. ఏ అవమానం జరిగినా సహించలేడు.

"పరీక్ష బాగా రాయలేదని వాడికి అనుమానం వచ్చింది. తలుపులు మూసుకొని యెక్కువభాగం గదిలోపలే గడిపేవాడు.

"గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజీ లెక్చరర్‌గా మార్కండేయశర్మ స్పాట్ వేల్యుయేషన్‌కి యిక్కడి యూనివర్సిటి స్పాట్ వాల్యుయేషన్ సెంటర్‌కి వెళ్ళాడు. ఆరు సంవత్సరాలకొకసారి వచ్చే టర్న్ ఈసారి అతనికి వచ్చింది.

"యూనివర్సిటి స్పాట్ వేల్యుయేషన్ సెంటర్ చాల స్ట్రిక్ట్‌గా వుంటుంది. పైగా స్టూడెంట్స్ వ్రాసిన ఆన్సర్ పేపర్స్‌లో హాల్ టికెట్ నెంబర్స్ వేస్తారు కదా! అవి యిక్కడ మారిపోతాయి ఎలాంటి అవకతవకలు జరగకుండా ఆన్సర్ పేపర్స్‌కి రీ నెంబరింగు జరుగుతుంది. దీన్ని కోడింగ్ డీకోడింగ్ అంటారు. చాల

స్ట్రిక్టుగా జరుగుతుంది ఈ కార్యక్రమం.

"ఈ నెంబర్లు వేసే కార్యాలయం యూనివర్సిటీ కాంపస్‌లోనే వుంది. 'రిజిస్ట్రార్ ఫర్ యూనివర్సిటీ ఎగ్జామ్స్ అంటారు' ఈ ఆఫీసు అధికారిని. అపాయింట్ చెయ్యబడిన లెక్చరర్ల పర్యవేక్షణలో సదరు కార్యాలయ గుమస్తాలు వేరే నెంబర్లు యివ్వటం జరుగుతుంది, అతి రహస్యంగా.

"శర్మకి నగరంలోనే కాదు. ఎజుకేషన్ డిపార్టుమెంటులోనే చాల పలుకుబడి వుంది. అష్టావధానిగా అతడు డిపార్టుమెంటు సిబ్బంది హృదయాల్లో కూడ ముద్ర వేసుకున్నాడు.

"మా వాడి బలహీనతని—అతన్ని ప్రత్యేకంగా కలిసి విన్నవించుకున్నాను. పొరపాటున వాడు ఫెయిలయితే మాకు దక్కడని విన్నవించాను. మా వాడి నెంబరు ఇచ్చి ఆ నెంబరు—యూనివర్సిటీలో యే నెంబరుగా మారి పోతుందో రహస్యంగా తెల్సుకొని వాడు సరిగా రాయని పక్షంలో మార్కుల విషయంలో కాస్త 'సర్దుబాటు' చెయ్యమని అర్థించాను.

"శర్మ హృదయం కరగలేదు. ఇది మోసమన్నాడు. విద్యార్థి స్వశక్తితో పైకిరావాలిగాని విద్యని సొంతం చేసుకోటానికి దొడ్డిదారి పనికిరాదనీ యిలాంటి హేయమైన క్రియలో భాగం పంచుకుని మన సత్యానికీ ఉద్యోగ ధర్మానికీ ద్రోహం చెయ్యలేనని నిక్కచ్చిగా చెప్పేశాడు.

ఫలితాలు తెలిశాయి. మా వాడు ఫెయిలయ్యాడు. మర్రోజుదయం వాడి శరీరం పరిగెత్తే రైలు క్రిందపడి ముక్కలుగా మారిపోయింది.

"నా హృదయం భగ్గున మండింది. ముక్కుసూటిగా

నడవాలి మనుగడలో. నిజమే! కాని అందువల్ల ఓ జీవితమే నష్టపోకూడదు. నష్టపోయేందుకు కారణం కాకూడదు. టస్క్ జాబ్ అయినా శర్మలాంటి వ్యక్తి ప్రయత్నించి వుంటే వాడు పాసయ్యేవాడు. కళకళ్లాడుతూ తిరిగేవాడు.

"ఇది అర్థంలేని ఊహ అయినా నా తమ్ముడికి చావుకి శర్మ కారకుడు అనే విషయం నా మనసులో విషబీజమై నాటుకుపోయింది. మొక్కగా పెరిగి మహావృక్షమైంది. హత్య చెయ్యాలన్న నిర్ణయం వరకూ వచ్చింది.

"సమయం కోసం కాచుకొని వున్నాను. ఇంతలో ఉగాది సందర్భంగా శర్మ అష్టావధానం క్రయిమ్ పద్ధతిలో జరగబోతోందనీ పృచ్ఛకుడుగా నన్నూ భాగం పంచుకోమనీ గోపీనాథ్ చెప్పాడు. కార్యక్రమం యిలా ఉంటుందని చూచాయగా వివరించాడు.

"శర్మ ఎటూ విజయం సాధిస్తాడని నాకు తెలుసు. కొత్త పద్ధతిలో అష్టావధానం చేసి విజయం సాధించిన సందర్భంలో దాన్ని తలుచుకుంటూ యేమరుపాటుగా స్కూటర్ డ్రయివ్ చేసి ప్రమాదానికిలోనై మరణించాడన్న పుకారులో ఈ కేసు క్లోజవుతే ఎలా వుంటుంది? అని ఆలోచించాను. పథకం వేశాను.

"కార్యక్రమం జరిగింది. దిగ్విజయంగా అష్టావధానం పూర్తయింది. ఆ మర్నాడు తాత్కాలికంగా రంగు మార్చి నెంబరు ప్లేటు మాయంచేసిన అద్దెకారులో నేను వేషం మార్చుకొని డ్రయివ్ చేస్తూ ప్లాన్ ప్రకారం సెవెన్ రోడ్స్ సెంటర్‌లో అతను మలుపు తిరుగుతోండగా దాన్ని అతని పాలిటి 'హెవెన్ రోడ్స్ సెంటర్'గా మారుస్తూ డాష్ ఇచ్చి పారిపోయాను. నాకు తెలిసినంత

వరకూ యే ఆనవాలునీ వదల్లేదు నేను. అయినా పట్టుబడ్డా నంటే అది నా దురదృష్టమే!" దీర్ఘంగా నిట్టూర్చాడు వాసుదేవరావు.

డిటెక్టివ్ జలంధర్ అందుకున్నాడు.

"కార్యక్రమంలో నువ్వు పద్యం చదివినప్పుడు ఆ పదాల్ని ఆనందరావు గ్రహించగలిగాడు. ఎందుకంటే శర్మని త్వరలో చంపబోతున్న నువ్వు ఆ అర్థాన్ని పద్యంలో ఇరికించి శర్మకి 'క్లూ' అందించావు.

"మేము నియోగించిన చారులు మీ ఎనిమిదిమంది చర్యల్ని గమనించారు. నీపై అనుమానం ఏర్పడింది.

"ఇంటివద్ద నింపాదిగా పద్యం గుర్తుకు తెచ్చుకున్న శర్మ డవుట్ ఫుల్ గా దాన్ని డైరీలో వ్రాసుకున్నాడు. ఈ హెచ్చరిక తనకేనన్న అనుమానం అతనికి చూచాయగా వచ్చింది. ప్రధాన అనుమానితుడుగా నీ పేరు ఉదాహరిస్తూ నీ తమ్ముడి విషయం క్లుప్తంగా వ్రాసి కాలేజీలో భద్రపరిచాడు. తనకేదైనా ఆపద సంభవిస్తే అందుకు కారకుడివి నువ్వేనని స్పష్టంగా రాశాడు.

"నువ్వుకూడ కొన్ని తప్పులు చేశావు. హత్య జరిగిన సమయంలో నీవు ఎలిబీ లేదు. శర్మ మరణవార్త విని స్నేహితుడిగా హుటాహుటిన వెళ్ళి సానుభూతి తెలియజెయ్యక మిగత ఏడుమంది కొరకు నిరీక్షించావు. అందరూ కల్సి కట్టగట్టుకొని శర్మ యింటికి వెళ్ళకుండా క్రయిమ్ బ్రాంచ్ హెడ్ క్వార్టర్సుకి వచ్చి చక్రవర్తిని కలిశారు.

కమలినికి సానుభూతి తెలియజెయ్యాలని ప్రయత్నించామని, సాధ్యంకాక పోస్టులో పంపామని అబద్ధం చెప్పావు. ఆ తర్వాత కమలినిని కల్సి నీపై అనుమానం వుందో లేదో తెల్సుకోయత్నించావు. నిన్ను అనుమా

నిన్నూ శర్మ ఆధారాలేమైనా వదిలాడేమో కనుక్కోవాలని ప్రయత్నించావు.

"నీపై అనుమానం బలపడి ధృవపర్చబడ్డాక నిన్ను భయపెట్టి రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకోవటంకోసం చక్రవర్తిని గొంతు మార్చి మాట్లాడమని టేప్‌రికార్డర్‌ని టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లో — ఆన్ చేసి కూచున్నాను. సులభంగా వల్లో పడిపోయావు. ఈ కేసెట్‌ని రేపు కోర్టులో సబ్మిట్ చేస్తాను...." అంటూ ముగించాడు జలంధర్, టేప్‌రికార్డర్‌లోంచి కేసెట్ తీసి జేబులో వేసుకుంటూ.

—: అయిపోయింది :—

అష్టావధాన ప్రక్రియ గురించి నేను కోరిన వెంటనే విపులంగా విశదీకరించటమే కాకుండా రచన కనుగుణంగా నా అభ్యర్థనపై చక్కని పద్యాలు వ్రాసియిచ్చిన సాహితీ మిత్రుడు శ్రీ మేడవరం శివరామకృష్ణ (విరుపాపురం) గారికీ హెర్మాఫ్రోడైట్‌ని గూర్చిన సమాచారం అందించిన డా॥ శివభూషణం (కర్నూలు) గారికీ యూనివర్సిటీ స్పాట్ వేల్యుయేషన్ సెంటర్‌కి సంబంధించిన క్లుప్త వివరాలందించిన శ్రీ సయ్యద్ అహమద్ (కర్నూలు) గారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

— రచయిత

సీరియల్

వి.యస్.రావ్



(గత సంచిక తరువాయి)

మనోజ్ ఉలిక్కిపడ్డాడు. కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి.

పోలీసు యూనిఫామ్‌లో వున్న అతని తెల్లటి జుట్టు కిటికీలోంచి వీచే గాలికి అటూ యిటూ కదుల్తోంది....

• • •

కారు ప్రచండమైన వేగంతో వెళ్తోంది. 'మిస్టర్ బెలూన్' ఆరితేరిన డ్రయివర్‌లా వున్నాడు. డోర్‌కీ ఫ్రేముకీ మధ్య ఇందాకటిదాకా నలిగిన యెడమచేతిని తేలిగ్గా స్టీరింగ్ మీద వుంచుకున్నాడతను.

మనోజ్ ఇబ్బందిగా కదిలాడు. చేతులు వెనక్కి విరిచి బేడీలు తగిలించబడినందువల్ల సీటుకి ఆనుకుని తిన్నగా కూచోలేకుండా వున్నాడతను.

ఎవరు వీళ్ళు? పోలీసులా? రంగంలోకి దిగినప్పట్నుంచీ పోలీసులు తనని వెంటాడుతున్నారా? ఎందుకు? శత్రువులు పోలీసుల్లా నటిస్తున్నారా? పోలీసులే శత్రువులా?

ఎవరైనా, తనని బోల్తా కొట్టించారు. పదిరోజుల తన ప్రిపరేషన్, మారువేషం, కుంటినడక, మితిమీరిన జాగ్రత్త, వాళ్ళని బోల్తా కొట్టించలేక పోయాయి! క్రయిమ్ నవలల్లో హీరోలా తను ప్లాన్ చేయలేక పోయినందుకు మనోజ్ తనని కోపంతో తిట్టుకున్నాడు.

తన పక్కన అగ్గిపుల్ల వెలిగింది. తెల్లజుట్టు వ్యక్తి, న్యూస్ పేపర్ కాలీ సిగరెట్ వెలిగించాడు. కారు ఆగకుండా వెళ్ళిపోతోంది. తనని యెక్కడికి తీసుకెళుతున్నారు?

“ఎక్కడికి తీసుకెళుతున్నారు నన్ను?” మనోజ్ పక్కకి తిరుగుతూ ప్రశ్నించాడు.

తెల్లవెంట్రుకలతను అతనివైపు చూసి చిరునవ్వు నవ్వాడు. సిగరెట్ని ఇవతలికి తీసి, కిటికీలోంచి బూడిదని కింద దులిపాడు. కారు వేగం తగ్గకుండా మలుపు తిరిగింది.

మనోజ్ విసురుగా అతనిమీద పడ్డాడు. అతని మోచేయి మెరుపులా కదిలింది. మనోజ్ విసురుగా, బలంగా మూలకి కొట్టుకున్నాడు. సర్దుకుని కూచోడానికి ప్రయత్నిస్తూ మనోజ్ అతన్ని కోపంగా చూశాడు జుట్టు తెల్లబడినా చేతుల్లో చేవ తగ్గలేదు!

“ఎవరు మీరు? ఎక్కడికి తీసుకెళుతున్నారు?” మనోజ్ కోపంగా అరిచాడు.

తెల్లవెంట్రుక లతను చెవిటివాడిలా వుండిపోయాడు.

కారు స్పీడు తగ్గింది. మిస్టర్ బెలూన్ తలతిప్పి వోరగా చూశాడు.

"గురూ, నువ్వు డ్రైవ్ చెయ్. వాడి నోరు నేను మూయిస్తా!" అన్నాడతను కసిగా.

"షటప్! నీ పని నువ్వు చెయ్యి!" తెల్లవెంట్రుక అతను గద్దించాడు.

కారు స్పీడు హెచ్చింది. సిటీలిమిట్స్ దాటి హైవేలో ప్రవేశించింది.

"మీరేం చేస్తున్నారో మీకు తెలీదు. తరవాత విచారిస్తారు...." మనోజ్ మెల్లిగా అన్నాడు. తెల్లవెంట్రుకతలని కుడిచెయి అతని మొహంవైపు దూసుకొచ్చింది. అరచెయ్యి మనోజ్ పెదవులమీద బలంగా, వెడల్పుగా తాకింది. అతని పెదవులు బిగుసుకుపోయినట్టయ్యాయి. అడ్హెసివ్ టేప్ తన నోటిని మూసేసినట్టు మనోజ్ గ్రహించాడు. తెల్లవెంట్రుకలతను ఖుషీగా, బిగ్గరగా నవ్వడం ప్రారంభించాడు....

'గురూ, నువ్వు డ్రైవ్ చెయ్. వాడి' అంటే వీళ్ళు పోలీసులు కారు! తెలివిగా, పోలీసుల్లా నటించి నడిరోడ్డులో తనకు బేడీలు తగిలించారు! అవమానంగా, భయంగా వున్నా లోపల్లోపల మనోజ్‌కి సంతోషంగా వుంది. శత్రువు తనని, తనకి చూపిస్తున్నాడు! ఒక విధంగా తనకి శ్రమ తగ్గుతుంది. వెతుకుతున్న తీగ కాళ్ళ దగ్గరకు పాకుతోంది!

తనని ఏం చేస్తారు? తప్పించుకు రాగలడా? ఆలోచిస్తూ మనోజ్ పరిసరాల్ని జాగ్రత్తగా గమనిస్తున్నాడు. తన పక్కనే కదలిక అతని దృష్టిని ఆకర్షించింది. మనోజ్ తల తిప్పబోయాడు.

దిండుగలీబులాంటి పొడుగాటి నల్లటి సంచీ అతని తలమీంచి భుజాలదాకా కిందికి దిగింది. దళసరి గుడ్డ. కటిక చీకట్లో వున్నట్లనిపించిం దతనికి. తను వెళ్తున్న పరిసరాన్ని గుర్తుంచుకునే అవకాశం తనకి లేకుండా చేశారు వాళ్ళు!

మనోజ్ గుండె రేస్‌హార్స్‌లా ఉరకలు ప్రారంభించింది. ఖంగారుని అదుపు లోకొస్తూ, తీవ్రంగా ఆలోచించటానికి ప్రయత్నించా డతను.

పరిసరాల్ని తను చూస్తే వాళ్ళకి నష్టం ఏమిటి? తరువాత, తరువాత తను ఆ ప్రదేశాన్ని గుర్తించవచ్చు. అలా గుర్తించటం వాళ్ళకి యిష్టంలేదు. అంటే తనకి 'తరువాత' అనేది వుందన్నమాట! అంటే తనని వాళ్ళు చంపబోవడం లేదన్నమాట!

మనోజ్ ఉద్రేకంతో నిట్టూర్చాడు. నిట్టూర్పు వేడి అతని మొహాన్ని తాకింది. చంపే ఉద్దేశం లేనప్పుడు తనని ఎందుకు తీసుకెళ్తున్నారు? రంగనాథ్‌కి ఇచ్చినట్టు తనకి కూడా 'మైల్డు వార్నింగ్' ఇస్తారా?

మనోజ్ మొహాన్ని కప్పిన సంచీ తటాలున పైకి లాగబడింది. మిరుమిట్లు గొలుపుతున్న కాంతిని చూడలేక అప్రయత్నంగా కళ్ళు మూసుకున్నా డతను.

మనోజ్ కళ్ళు తెరిచాడు. పొడుగాటి హాల్లో తను నిలబడ్డాడు. నేలని తివాచీ పూర్తిగా కప్పింది. హాలు పొడవునా, మధ్యలో రెండు వరసలుగా గ్లాస్‌టాప్డ్ టేబుల్స్ వేయబడ్డాయి. వాటి వెనుక ఖరీదైన కుషన్డు కుర్చీలు. టేబుల్ వరసల మధ్య అరడుగుల వెడల్పులో ఖాళీ జాగా వుంది.

మనోజ్ ఎదురుగా చూశాడు. టేబుల్ వరసల

చివర, అడ్డంగా వెడల్పాటి టేబుల్ వుంది. టేబుల్ ముందు ఎత్తుగా సింహాసనంలా వున్న కుర్చీలో గంభీరంగా కూర్చున్న వ్యక్తిని అతను ఆశ్చర్యంగా చూశాడు.

వెనక్కి దువ్విన గిరజాల జుట్టు. బుర్ర మీసాలు. గుబురుగా పెరిగి, మధ్యలో కలుసుకున్న కనుబొమలు అతని మీసాల్లాగే వంకీలు తిరిగున్నాయి. వాటికింద సాన బెట్టిన వజ్రాల్లాంటి కళ్ళు. బంగారు రంగులో వున్న కోటు మెరుస్తోంది. లావుపాటి బంగారు గొలుసునుంచీ వేలాడు తున్న పులిగోరు ధగధగ మెరుస్తోంది. అతను కిరీటంలేని రాజులా వున్నాడు. మనోజ్ కళ్ళు అతనిమీదే తాపడం అయిపోయాయి.

అతని మీసాలు మెల్లిగా కదిలాయి. ఎర్రటి పెదవుల సందులోంచి పళ్ళు మెరిశాయి.

"వేటకి బయల్దేరిన సింహాన్ని వెంటాడి పట్టారన్న మాట! సింహాం, అతన్ని సోదా చెయ్!" అతని కంఠం గర్భగుడిలో మ్రోగించిన శంఖంలా హాల్లో ప్రతిధ్వనించింది.

రెండు చేతులు భుజాలనుంచీ కిందికి మనోజ్ ని జాగ్రత్తగా తాకుతూ వెళ్ళాయి. బెల్టునీ, జేబుల్ని తడివాయి. పాంటు జేబులోంచి సిగరెట్ పాకెట్ నీ, లైటర్నీ తీసి అతను, సింహం—పక్కనేవున్న టేబుల్ మీద పడేశాడు. అతని చేతులు కిందికి దిగాయి. మనోజ్ కుడికాలి పిక్క ప్రాంతంలో తడివి దూరంగా జరిగాయి. మనోజ్ తేలిగ్గా నిట్టూర్చాడు.

"మనోజ్ కుంటుతూ నడిచాడు బాస్. కాలికి బ్యాండేజీ వుంది" సింహాం వినయంగా అన్నాడు.

"కట్టుకింద గాయం వుందో, గాయాలు చేసే వస్తు

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకూ చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందచేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 84/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

వుందో చూద్దాం! కట్టు విప్పెయ్!" బాస్ కంఠం గంభీరంగా ధ్వనించింది.

మనోజ్ గుండె వేగంగా కొట్టుకో సాగింది. గురువు శిష్యుల్ని మించినట్టున్నాడు.

సింహం, తెల్లకోట్టు వ్యక్తి—మనోజ్ కాళ్ళ దగ్గర గొంతుక్కూచున్నాడు. రెండు చేతుల్తో మనోజ్ పాంటుని మోకాలిపైకి తోశాడు. రెండు నిమిషాల్లో తెల్లటి బ్యాండేజీని తీసి కింద పడేశాడు. రెండు సన్నటి రబ్బరు బ్యాండ్స్‌తో కాలికి తగిలించబడిన కత్తిని చిరునవ్వుతో చూశాడు. వేళ్ళతో రబ్బర్ బ్యాండ్స్‌ని తెంచేశాడు. కత్తిని పైకెత్తి పట్టుకుని నిలబడి తన యజమానిని నవ్వుతూ చూశాడు.

బాస్ నవ్వు కన్‌సీల్డు మెగాఫోన్స్‌తో యాంప్లిఫై చేయబడినట్టు హాల్లో ప్రతిధ్వనించింది. సింహం ముందుకి నడిచి, కత్తిని బాస్ ముందు టేబుల్ మీద వుంచాడు.

బాస్ కుడిచేత్తో కత్తిపిడిని పట్టుకున్నాడు. అతని వేళ్ళకి వున్న ఉంగరాల రాళ్ళు జిగేల్‌మన్నాయి. ఎర్రటి వెల్వెట్ ఒరలోంచి సన్నటి కత్తిని ఇవతలికి లాగి, అటూ ఇటూ తిప్పాడతను. మెరుస్తున్న పదునుని నవ్వుతూ చూశాడు. సిల్కు జుబ్బా చేతికి పైకెత్తోసి, ముంజేతిమీద కత్తితో రాశాడు. మెత్తటి ఈకలాగా కత్తిపదును అతని చర్మాన్ని తాకింది. తాకినంత మేరా అతని ముంజేతిమీద వెంట్రుకలు మాయమయ్యాయి. అతని తల మెల్లగా పైకి లేచింది. కళ్ళు చిట్లిస్తూ మనోజ్ వైపు చూస్తూ వుండిపోయాడతను.

మనోజ్ రెప్ప వాల్చకుండా అతన్నే చూస్తున్నాడు. కత్తిని ఒరలో దోపి, తనముందు టేబుల్ మీద పెట్టు

న్నాడతను. దృష్టిని మనోజ్ వైపు మళ్ళించి, చేతిని పైకెత్తి చూపుడువేలితో పైకి చేశాడు.

సింహం మనోజ్ జబ్బ పట్టుకుని టేబుల్ ముందుకు నడిపించుకు వెళ్ళాడు.

"మనోజ్ నీ అన్వేషణ ఎందాకా వచ్చింది?" బాస్ కంఠంలో ఎగతాళి వినిపించింది మనోజ్ కి.

మనోజ్ లోపల్లోపలే పళ్ళు కొరుక్కున్నాడు. తన వదినను చంపి, అన్నను సర్వనాశనం చేసిన రాక్షసుడు, గీతను కాలరాచిన పిశాచం! కోర్టులో తనకి సహకరించిన బలహీనుల్ని దారుణంగా చంపిన కృతఘ్నుడు! చింత నిప్పుల్లా వున్న కళ్ళతో మనోజ్ అతన్ని తీక్షణంగా చూశాడు.

"మనుషుల్ని నల్లుల్లా చంపుతున్న నరరూపరాక్షసుడి దాకా వచ్చింది!" మనోజ్ గర్జించాడు.

ఏదో జోక్ విన్నవాడిలా అతను పగలబడి నవ్వాడు. నగిషీలు చెక్కిన చిన్న పెట్టెలోంచి కరోనా సిగార్ తీసి వెలిగించాడు. నోటినిండుగా పీల్చిన పొగని కాలుతున్న చుట్ట కొసమీదికి ఊదాడు. కొన ఎర్రగా మండింది.

"మనోజ్ నువ్వు అనుకున్నంత తేలిగ్గా నేను మనుషుల్ని చంపను!" చుట్టకొసనే చూస్తూ అన్నాడతను "నువ్వు అన్వేషిస్తున్న వ్యక్తి నేను కాను!"

మనోజ్ ఆశ్చర్యంగా చూశాడు. ఏమిటిదంతా? నాటకమా?

మనోజ్ వెటకారంగా నవ్వాడు. "రాజమ్మ, మస్తాన్ రావు, కృష్ణంరాజు చాలా తేలిగ్గా చంపబడ్డారు"!

(ఇంకా వుంది)

